# దర్శన కర్తలు దర్శనములు

సర్వదర్శన సంగ్రహము

(సాయణ మాధవ శంకరాదులు)

౨వ భాగము

-ఆస్తిక దర్శనములు-

రామానుజ, పూర్ణప్రజ్ఞ, నకులీపాశుపత, శైవ, ప్రత్యభిజ్ఞా, రసేశ్వర, వైశేషిక, నైయాయిక జైమిని పాణిని దర్శనములు




## చర్ల గణపతిశాస్త్రి

వెల:- రూ 15-00

# పరిచయము

ఇదివఱకు మొదటిభాగములో సామాన్య దర్శనము, చార్వాక, బౌద్ధ, జైనదర్శనములు చూపఁబడినవి. ఇపుడీ రెండవ భాగములో రామానుజాదుల దర్శనములు చూపబడుచున్నవి. సృష్టినిగూర్చి సృష్టికర్తనుగూర్చి ఆయా ఋషులు తెల్పిన భాగములు ఈ దర్శనములతో తెల్పఁబడినవి.

ఇంక మూడవభాగములో పాతంజలాది దర్శనములు చూపబడును. వీనిని పాఠకులు గ్రహింతురుగాక.

ఇట్లు

భవదీయుఁడు

చర్ల గణపతిశాస్త్రి

## విషయసూచిక

## శ్రీ రామానుజ చరిత్ర

శ్రీరామానుజుడు క్రీ. శ. 1017 సం లో వైశాఖశుద్ధ పంచమి నాడు మద్రాసుకు సమీపమున పెరుంబుదూరులో జన్మించెను. తల్లి కాంతిమతి. తండ్రి కేశవాచార్యుడు. ఇతని మొదటిపేరు ఇల్లయ పెరుమాళ్ళు. యామునాచార్యుని పౌత్రుడు. ఇతనికి ఎనిమిదవయేట ఉపనయన మయ్యెను ...వప్రకాశుండను తనమేనమామ దగ్గర విద్యలభ్యసించెను. యాదవప్రకా... అద్వైత మతానుయాయి. వేదవేదాంగములు ఉపనిషత్తులు మొద... లగునవి ఇతనికి యాదవప్రకాశుఁడు బోధించెను. ఇతనికి అద్వైతభావన సంతృప్తి నీయలేదు. యాదవప్రకాశుడు బోధించిన యద్వైతము నచ్చక ...ఁడు గురువునె విమర్శింప దొడగెను. ఈవిమర్శవలన గురువగు యాదవ...శునికి రామానుజునిపై ఈర్ష్య గలిగి గోవిందభట్టు అనుశిష్యునిఁబంపి శ్రీరామానుజుని జంపించుటకు గుట్రపన్నెను. కానిదైవ వశమున ఆ కుట్ర ...లమయ్యెనని చెప్పుదురు.

రామానుజునికి పదునాఱవయేట వివాహమైన పిదప నితఁడు కంజీవ...లో నుండెను. పిదప తల్లిదండ్రులు చనిపోయిరి. ఇతఁడు ఒక చెట్టు ...ది కూర్చుండి రాముని ఉపాసించు చుండువాఁడు. "లోకులు ఆశలలోఁ ...డి సంసారసుఖములలోఁ జిక్కి యున్నారు. అందఱి హృదయములోను ...క్కమాటువైరాగ్యము గలుగుట కష్టము. అందఱు త్యాగులై ముక్తులు లేరు. సామాన్యమానవులుధర్మములలో, కఠిననియమములను పాలింపలేరు ...న ప్రకృతిమయ జీవితముతో బాటుకొన్ని సామాన్యనియమములను బాటిం చుట మంచిది." అని తలపోసి భక్తిని రామకృష్ణాదులపూజను ప్రచారముచేసి వీనిద్వారా తాము సత్ప్రవర్తకు లగునట్లు ప్రజలను జేయ మొదలిడెను. "జీవాత్మకుఁ బరమాత్మకు భేదముగలదు. ఆపరమాత్మనామము వ్యాపకమైన దిగాన విష్ణువనఁబడెను. రామకృష్ణులు విష్ణుని యవతారములు. ఆవిష్ణువు ప్రపంచమును సృజించి పోషించి సంహరించును" అని యతఁడు తెలిపెను,

రామానుజుఁడొకమాఱు తిరుకొట్టియూరు అనుగ్రామములో గోష్ఠిపూర్ణుఁడను నొకనంబిదగ్గఱ "ఓం నమోనారాయణాయ" అను మంత్రోపదేశమును పొందెను. గురువు మంత్రోపదేశము చేయుచు "దీనిని జపించినచో మోక్షముగలుగును. ఎల్లవారికి ఇది యుపదేశింపరాదు. అట్లు ఉపదేశించినచో పాపలోకములుగలుగు" నని చెప్పెను. రామానుజుఁడు ఈమంత్రము గొప్పశక్తిగలదని గ్రహించెను. అతని హృదయము ఉదారమైనది. ఈ మంత్రోపదేశముద్వారా అందఱకు మోక్షము సిద్ధింప జేయువలయునని తలఁచి వర్ణమతవిచక్షణ లేకుండ అందఱను ఒకదేవాలయము దగ్గఱ ప్రోగుచేసి యీమంత్రము నుపదేశింపసాగెను. అప్పుడదివిని క్రోధముతో నంబి వచ్చి "నీవు నా యాజ్ఞను తిరస్కరించితివి నీకుఁ బాపలోకము గలుగుగాక!" అనెను అంత రామానుజుఁడు గురువునకు నమస్కరించి "గురుదేవా! ఈ మంత్ర జపమును జపించిన మోక్షముపొందునపుడు నేనొక్కఁడను మీమాట తిరస్కరించినందుకై పాపలోకమునకుఁ బోవలసివచ్చినచో నాకిష్టమే" అనెను. అపుడానంబి రామానుజుని యుదారహృదయమును మెచ్చుకొని యతని దీవించి పంపెను.

రామానుజునిభార్య మిగులఁ పూర్వాచార పరాయణురాలు. భర్త వైశ్యుడగు నంబిని గురువుగా స్వీకరించుటను ఆమె సైపలేకపోయెను. ఆమెకుఁగల పిచ్చినమ్మకములవల్ల విసిగి తాను నమ్మినభావములను ప్రచారముచేయువలయునని తీవ్రవేదన ప్రోత్సాహపెట్టగ తన యేబదవయేట రామానుజుఁడు సంన్యాసాశ్రమును స్వీకరించెను.

ఈతఁడు ఆళ్వందారు అనుపేరుగల యామునాచార్యుని పిదప శ్రీరంగములో శిష్యులకోరికపై అతని పీఠమలంకరించెను. పిదపఁదన మతమును ప్రచారముచేయ యాత్రలుచేసెను. విష్ణువు దేవుడని దలఁచుటచే శైవులు ఇతనిని సహింపలేకపోయిరి. మేల్కోటి అను నగరములో ఇతనిబోధను విని చాలమంది శిష్యులైరి. చోళదేశపురాజు శైవుఁడు. అతఁడీసంగతివిని వైష్ణవులను బాధింపసాగెను. అందువలన రామానుజుఁడు ఆదేశమును వదలి కర్ణాట దేశమునకు వెడలిపోయెను. అక్కడిరాజు వైతాలుఁడు జైనమతస్థుడు

రామానుజుఁడొకమాఱు తిరుకొట్టియూరు అను గ్రామములో గోష్ఠిపూర్ణుఁడను నొకనంబిదగ్గఱ "ఓం నమోనారాయణాయ" అను మంత్రోపదేశమును పొందెను. గురువు మంత్రోపదేశము చేయుచు "దీనిని జపించినచో మోక్షముగలుగును. ఎల్లవారికి ఇది యుపదేశింపరాదు. అట్లు ఉపదేశించినచో పాపలోకములుగలుగు" నని చెప్పెను. రామానుజుఁడు ఈమంత్రము గొప్పశక్తిగలదని గ్రహించెను. అతని హృదయము ఉదారమైనది. ఈ మంత్రోప దేశముద్వారా అందఱకు మోక్షము సిద్ధింప జేయువలయునని తలఁచి వర్ణమతవిచక్షణ లేకుండ అందఱను ఒకదేవాలయము దగ్గఱ ప్రోగుచేసి యీమంత్రము నుపదేశింపసాగెను. అప్పుడదివిని క్రోధముతో నంబి వచ్చి "నీవు నా యాజ్ఞను తిరస్కరించితివి నీకుఁ బాపలోకము గలుగుగాక!" అనెను అంత రామానుజుఁడు గురువునకు నమస్కరించి "గురుదేవా! ఈ మంత్ర జపమును జపించిన మోక్షముపొందునపుడు నేనొక్కఁడను మీమాట తిరస్కరించినందుకై పాపలోకమునకుఁ బోవలసివచ్చినచో నాకిష్టమే" అనెను. అపుడానంబి రామానుజుని యుదారహృదయమును మెచ్చుకొని యతని దీవించి పంపెను.

రామానుజునిభార్య మిగుల పూర్వాచార పరాయణురాలు. భర్త వైశ్యుడగు నంబిని గురువుగా స్వీకరించుటను ఆమె సైపలేకపోయెను. ఆమెకుఁగల పిచ్చినమ్మకములవల్ల విసిగి తాను నమ్మినభావములను ప్రచారముచేయువలయునని తీవ్రవేదన ప్రోత్సాహపెట్టగ తన యేబదవయేట రామానుజుఁడు సంన్యాసాశ్రమము స్వీకరించెను.

ఈతఁడు ఆళ్వందారు అనుపేరుగల యామునాచార్యుని పిదప శ్రీరంగములో శిష్యులకోరికపై అతని పీఠమలంకరించెను. పిదపఁదన మతమును ప్రచారముచేయ యాత్రలుచేసెను. విష్ణువు దేవుడని దలఁచుటచే శైవులు ఇతనిని సహింపలేకపోయిరి. మేల్కోటి అను నగరములో ఇతనిబోధను విని చాలమంది శిష్యులైరి. చోళదేశపురాజు శైవుఁడు. అతఁడీసంగతివిని వైష్ణవులను బాధింపసాగెను. అందువలన రామానుజుఁడు ఆదేశమును వదలి కర్ణాట దేశమునకు వెడలిపోయెను. అక్కడిరాజు వైతాలుఁడు జైనమతస్థుడు

హ్మము యొక్క సంపూర్ణషడ్గుణములు (=అపహతపాప్మత్వాదులు) సూక్ష్మము సకల జీవులను లోపలనుండి నియమించుట అంతర్యామిత్వము, వాసుదేవుఁడు తనభక్తులమీఁది వాత్సల్యముచే వారికోరికలను యథోచితముగ ఆ యా యవతారములను దాల్చియిచ్చును. ముక్తులకు ఈశ్వరునికి సర్వజ్ఞత్వాది గుణములు సమానమె. కాని సర్వకర్తృత్వము ఒక్క యీశ్వరునికి మాత్ర మె యుండును అని యీ మతములలోని ముఖ్యాశయములు. భాగవతాది పురాణములు ఈవైష్ణవ మతమునకు మూలము

ఈవిధముగ భగవంతుని సగుణస్వరూపమును నిరూపించి భక్తుల యనుగ్రహమునకు శాస్త్రమార్గము చూపిన శ్రీరామానుజుఁడు సర్వారాధ్యుడును ప్రశంసనీయుఁడును గదా.

## రామానుజ దర్శనము

ఆ యార్హత మతము ప్రామాణికముకాదు. ఒకే వస్తువు పరమార్థమగు చున్నపుడు పరమార్థమైన సత్పదార్థములు ఒక్కమాటుగా సత్తుగాను అసత్తు గాను విరుద్ధ దర్మముగ గలవిగా నుండుట సంభవింపదుగదా. పరస్పరము విరుద్ధమైన వస్తువులు సత్తును అసత్తును అగును అని సముచ్చయము సంభ వింపనపుడు సత్తుగాని అసత్తుగాని అగును. అని వికల్పము ఎందుకు కాదు. అని యనరాదు, అగును కావచ్చును అను క్రియయే వికల్పముగఁ జెప్పఁ బడును గాని వస్తువొకటె సత్తుగాను అసత్తుగాను వికల్పించుట తగదను న్యాయమున్నదికదా వస్తువును సాధించుటలో కర్తలు అనేకులుగా నుందురు కాన ఒక కర్త ఉండునట్లును వేఱొక కర్త అవస్తువు లేనట్లును ఊహించును కాన వికల్పము ఉండవచ్చును. కాని సిద్ధమైయున్న వస్తువులో ఎవని చేతనో యొకనిచేత సిద్ధింపఁబడి నట్లు చెప్పుట సంభవింపదుగదా "అనేకాంతం జగ త్సర్వం హేరంబ నరసింహవత్ "గజముఖ నరసింహుల వలె సర్వజగత్తును అనేకములుగ సత్తుగాను అసత్తుగాను ఉన్నదని గజముఖాది దృష్టాంత ములను బట్టి అది సరెయని యిష్టపడరాదు.

ఒకచోట (ముఖములో) గజత్వమును సింహత్వమును, ఇంకొకచోట (ముఖముకంటె ఇతరమగుచోట) నరత్వమును ఉన్నది. కాన అట విరోధము లేదు. ఇక్కడ అట్లు గాక ఒక వస్తువు సత్తుగాను అసత్తుగాను ఉన్నది. కనుక ఒక చోటనే సత్త్వాసత్త్వములచేత అనేకాంతత్వమును చెప్పుటలో దృష్టాంతముకుదరదు, ఘటమను ఒకవస్తువును మట్టియను ద్రవ్య రూపముగా సత్త్వమని, పర్యాయరూపముగా అనగా కపాలరూపముగా అసత్త్వమును మరల కపాలావస్థ యందు మట్టిరూపముగా సత్త్వమును మృత్పిండ ఘటాది రూపముగా అసత్త్వమును చెప్పవచ్చును గనుక రెండును ఉపపన్నమగుచో అట్లనరాదు. ఏలయనగా ఒక కాలమందు అనగా కుండగా ఉన్న కాలములో కపాలముగా లేదు. కపాలముగానున్న కాలములో కుండగా లేదు కాన అక్కడ కాలభేదము ఉన్నది కాన అదియు కుదరదు ఇంక ఒకవస్తువె పొడుగు వస్తువును బట్టి పొట్టిగాను, పొట్టివస్తువును బట్టి పొడుగుగాను ఉన్నట్లు సత్త్వాసత్త్వములుగ ఒక జగత్తు ఉండును గదా అన్నచో అట్లును అనరాదు. ప్రతియోగి అనగా నిరూపకవస్తునుబట్టి నిరోధము లేదు. భేదముద్వ్యణుకమును బట్టి త్ర్యణుకము పెద్దదై చతురణుకమునుబట్టి చిన్నదై కనిపించుచున్నది. ఇట్టి ప్రతియోగి భేదముచే విరోధము లేదు. కర్తలు, కాలము, దేశము అను అవస్థ ప్రతియోగుల భేదమును బట్టి విరుద్ధము ఉండక పోవచ్చును కాని ఒకే యుపాధిలో విరుద్ధ విషయములు ఉండరాదని భావము. కనుక ప్రమాణము లేకపోవుట వలన ఒకమాటుగా పరస్పర విరుద్ధములైన సత్త్వాసత్త్వములు ఒకే వస్తువు నందు ఉండుట యుక్తముగాదు కనుక 'స్యాదస్తి' ఉండవచ్చును, స్యాన్నాస్తి ఉండక పోవును అన్నవి ఒకే వస్తువు నందు చెప్పరాదు. ఇట్లే యితరమైన భంగులును భంగించును అని తెలియ వలెను.

మఱియు దీనికంతకు మూలమైన సప్తభంగి నయము స్వయముగా ఏకాంతమైనదా అనేకాంతమైనదా మొదటి పక్షములో సర్వము అనేకాంతము అను ప్రతిజ్ఞకు భంగము కలుగుచున్నది. ఇంక రెండవ ప్రక్షములో వివక్షితమైన యర్థము సిద్ధింపదు. అది యనేకాంతము (సంశయగ్రస్తము) గాన

సాధకముగాదు నిశ్చయమైనదే అర్థసాధకమగును. ఇట్లు రెండు ప్రక్కల బంధించునట్టి యీ త్రాడు స్యాద్వాదికి బంధమె అగును. తత్త్వములు తొమ్మిది అని ఏడని యిత్యాదికముగ నిర్ధరించుటకు గల ఫలమునకును దానిని నిర్ధారణచేయు ప్రమాతకును తత్కరణమైన ప్రమాణమునకు నవత్వాది (తొమ్మిది మొదలగుసంఖ్యా) రూప ప్రమేయమునకు నియమము లేకపోవుటయు సర్వము తెలిసికొన్నట్లు చెప్పుకొను తీర్థంకరమతమును అసంగతమగును. మఱియు అట్లు జీవము దేహముల బట్టి పరిణామము గలదని యంగీకరించినపుడు యోగబలమువల్ల అనేక దేహములను పరిగ్రహించిన యోగిశరీరమందు ప్రతి శరీరములో జీవము విచ్ఛిన్నము కావలసి వచ్చును. మనుజ శరీరమంత పరిణామము గల జీవము సమస్త గజ దేహమున ప్రవేశించుటకు శక్తి గలది కాకపోవలసి వచ్చును. మఱియు గజాది శరీరములను విడిచి చీమ మొదలగు వాని శరీరమును ప్రవేశించెడి యాత్మల ప్రాచీన శరీర సన్నివేశమునకు వినాశము కూడ గలుగ వలసి వచ్చును. దీపకాంతి పానశాలయందు సంకోచమును పెద్ద భవనము అందు వికాసమును పొందినది గదా అట్లే జీవుడును మనుజ శరీరము నందు సంకోచమును గజశరీరము నందు వికాసమును పొందును గదా అనియనరాదు. అట్లన్నచో అనాది సిద్ధమైన వేదమె ప్రమాణముకానిచో అర్హతముని ప్రణీతమైన కృతకమైన యాగమము ప్రమాణమెట్లగును. యతోవా ఇమాని భూతాని జాయంతే (తై 3-1-1) ఇత్యాది శ్రుతి సిద్ధమైన ఈశ్వరుడు లేడని చెప్పవలను పడదు గదా. ప్రదీపము వలెనే వికారము గలిగి అనిత్యుడు కావలసి వచ్చును. అపుడు జీవునికి వినాశమున్నపుడు చేసిన కర్మకు ఫలము అనుభవించు వాడే లేనపుడు చేసిన దానికి ఫలము లేకపోవుటయగును. పిపీలికా గజాది శరీరములనుబట్టి సంకోచ వికాసములను పొంది ఒక సారి పుట్టుట ఒకసారి నశించుటయు గలుగును గాన ఉత్పన్నమైనపుడు చేయనికర్మకు ఫలము అనుభవించుటయు కలుగును ఇట్లు కృత ప్రణాశాఽకృతాభ్యాగమములు (చేసిన ఫలమునకు నాశము, చేయనిదానికి ఫలము వచ్చుట)అను దోషములు ప్రసక్తములగును. ప్రధానుడైన మల్లుని జయించిన వాడు ఇతరులైన చిన్న మల్లురను జయింపనక్కర లేనట్లే జీవపదార్థమందు దూషణములు సిద్ధించినపుడు జీవుని అనుసరించిన

యితర పదార్థముందు గూడ దూషణములు ప్రసక్తమగుచున్నవి. కనుక నిత్యము నిర్దుష్టములైన శ్రుతులకు విరుద్ధమై యుండుట వలన ఇది స్వీకరిం పందగినది కాదు. ఈ విషయమే భగవంతుడైన వ్యాసుని చేత ఒకదానియందు అసంభవమగుటవలన సదసద్ధర్మములు ఉండవు" (బ్రహ్మ సూ. 2-2-31) అని చెప్పఁబడెను. ఈ సూత్రము రామానుజునిచేత జైనమత నిరాకరణ పరముగా వ్యాఖ్యానము చేయఁబడినది.

అతని సిద్ధాంతమిది "చిత్తు అచిత్తు ఈశ్వరుఁడు అను భేదముచేతను భోక్త భోగ్యము నియామకుఁడు అను భేదముచేతను మూఁడు పదార్థములు ఉన్నవి అని యిట్లు చెప్పఁబడెను.

ఈశ్వర శ్చిదచిచ్చేతి పదార్థత్రితయం హరిః
ఈశ్వర శ్చిదితిప్రోక్తో జీవో దృశ్య మచిత్పునః।

ఈశ్వరుఁడు చిత్తు అచిత్తు అని పదార్థములు మూఁడు. ఈశ్వరుఁడు అనఁగా హరి చిత్తు అనఁగా జీవుఁడు. అచిత్తు అనఁగా కనిపించు పదార్థము" అని.

మఱికొందఱు శంకరానుయాయులైతే సమస్త హ్రస్వత్వ దీర్ఘత్వాది భిన్నమైన చిన్మాత్ర రూపబ్రహ్మమె పరమార్థము. అది నిత్యశుద్ధ బుద్ధముక్త స్వభావము గలదైనను "తత్ త్వమసి" అది నీవై యున్నావు. (ఛాందో. 6-8-7) ఇత్యాది విశేష్య విశేషణ భావముచేత తెలియఁదగిన జీవైక్యము బద్ధమగుచు ముక్తమగుచునుండును గూడ. దానికంటె నితరమైన యనేక విధములైన భోక్తభోగ్యము మొదలైన ప్రపంచమంతయును గూడ దానియందు అవిద్యచేత "సదేవ సోమ్యేదమాసీత్ ఏకమేవ అద్వితీయం" సౌమ్యుఁడా ఈ సత్తె మొదట ఉన్నది ఒకటె రెండవది లేదు. (ఛాందో. 6-2-1) మొదలగు వచనముల ప్రామాణ్యముచేత కల్పింపఁబడినది అని చెప్పుచు- "తరతి శోక మాత్మవిత్" ఆత్మవేత్త శోకమునుదాటును. (ఛాందో. 7-1-3) మొదలైన నూర్ల కొలది వాక్యములచేత నిర్విశేష బ్రహ్మాత్మైక్య విద్యచేత అనాదియైన యవిద్యను నివర్తింపఁజేయవలెనని యంగీకరించుచు "మృత్యోః సమృత్యుమా

ప్నోతి య ఇహ నానేవ పశ్యతి" ఈ యాత్మ విషయములో ఇది వేఱు అది వేఱు అని భిన్నముగా చూచుచున్నవాఁడు మృత్యువును దానినుండి మరల జన్మ మృత్యువులను పొందుచున్నాఁడు... (క ఠ. 2-1) అని భేదనింద వినఁబడుటచేత వ్యవహారములోనేగాని పరమార్థములో భేదములేదని నిరాకరించుచు విచక్షణులమనుకొనుచున్నవారు చిత్తు అచిత్తు ఈశ్వరుఁడు అను ఈ విభాగము ను అంగీకరించుట లేదు.

ఈ విషయములో ఈ క్రింది సంగతి నిర్ధారణ చేయఁబడుచున్నది. అసలు ఈ సమస్తభేదము అజ్ఞాన మూలకమైనది. అజ్ఞానము అనాది భావ రూపమైనది. జ్ఞానా భావాత్మకము కాదు. ఈ భావరూపమైన యజ్ఞానమునె అవిద్య యందురు. మఱి యీ యవిద్య యున్నట్లు ప్రమాణమె కనుక ఉన్నచో నీవన్నట్లు అంగీకరింపవచ్చును. అపుడీ భావరూపమగు అవిద్య-అజ్ఞానము జ్ఞానముచే నివర్తింపఁబడినదగును. ఈ యవిద్య అజ్ఞానము "నేను అజ్ఞుఁడను నన్నును ఇతరుని గూడ నెఱుఁగను" అని ప్రత్యక్ష ప్రమాణముచే సిద్ధమైనది అదియును ఇట్లు చెప్పఁబడినది.

"అనాది భావరూపం య ద్విజ్ఞానేన విలీయతే
త దజ్ఞానమితి ప్రాజ్ఞా లక్షణం సంప్రచక్షతే (చిత్సుఖీ 1-9)

అనాదియు భావరూపమునై నదియు నగునేది విజ్ఞానముచే నశించిపోవు చున్నదో దానిని అజ్ఞానమని ప్రాజ్ఞులు దాని లక్షణమును చెప్పుచున్నారు" అని.

"నేను అజ్ఞుఁడను నన్నును ఇతరుని ఎఱుఁగను" అనునది జ్ఞానాభావ రూప విషయమని శంకింపరాదు. ఇట్లు చెప్పువాఁడు ప్రభాకరమతము ననుసరించువాఁడా లేక భట్టమతమును అనుసరించువాఁడా?

స్వరూప పరరూపాభ్యాం నిత్యం సద సదాత్మకే
వస్తుని జ్ఞాయతే కించిత్ కై శ్చిద్రూపం కదాచన।

స్వరూప పరరూపములచేత సదసద్రూపమైన వస్తువునందు కొందఱిచేత కొంత రూపమెుక్కపుడు కలిగించబడుచున్నది. అనఁగా ఘటపటాది సకల వస్తువులు ప్రత్యేకముగా రూపద్వయము కలవి; తన రూపముగా సద్రూపము. ఇతరమైన దాని రూపముగా అసద్రూపము. కనుక అది యొకప్పుడు సద్రూపమై యింకొకప్పుడు అసద్రూపమై యుండుసు. ఇట్లు జ్ఞానకాలమందును అసద్రూపముగా సద్రూపము ఉండనే యుండును. మామిడిపండునందు రూపరసగంధ స్పర్శాదులుండును. కాని జ్ఞానమైతే ఒకప్పుడు రూపస్వరూపముగాను ఇంకొకప్పుడు రస స్వరూపముగాను ఉండును అని తెలియువలయును. రూపజ్ఞానము ఉన్నప్పుడు రసజ్ఞానము లేదు. రసజ్ఞానమున్నపుడు రూపజ్ఞానము లేదు.

భావాంతర మభావో హి కయాచిత్తువ్యపేక్షయా
భావాంతరా దభావోఽన్యో నకశ్చి దనిరూపణాత్‌।

"అభావము అనఁగా భావాంతరము (భావమున కన్యమైనది) గదా. అది యొకానొకవ్యపేక్షచేత అభావశబ్దముచే చెప్పఁబడుచున్నది. భావాంతరము అనుదానికంటె అభావము అన్యము కాదు. అట్లు నిరూపించుటకు శక్యము గాదు కనుక" అని.

అని వచించు ప్రాభాకరానుయాయులు భావముకంటె వ్యతిరేకమగు నభావమును పదార్థాంతరముగా అంగీకరింపక పోవుటవలన మొదటి పక్షము సరికాదు. ఇంక రెండవ భట్ట మతానుయాయిమతము కూడ సరికాదు

భట్టమతమున అభావమన్నది ఇతర పదార్థమె అయినను నేను అజ్ఞుఁడను అను ప్రత్యక్షము జ్ఞానాభావవిషయకమైనది. జ్ఞానమె కనుక ప్రత్యక్ష ప్రమాణముచే గ్రహింపఁబడినచో అయభావము ప్రత్యక్షమునకు విషయమయ్యెడిది. నేను ఎఱుఁగుదును. అను ఇతరానువ్యవసాయాత్మక ప్రత్యక్ష విషయత్వము జ్ఞానమునకు సంభవించునను నైయాయిక మతము యుక్తమె అనరాదు. అట్లయినచో అటువంటి యను వ్యవసాయాత్మక జ్ఞానము కూడ

ఇంకొక యన్యమైన యనువ్యవసాయముచే గ్రహింపఁదగినదగును. అది కూడ ఇంకొక యన్యమైన అనువ్యవసాయముచేత అది యింకొక దానిచే అని అనవస్థ ప్రసక్తమగును. కనుక అది స్వప్రకాశమె అనుట యుక్తము. దీపము ఇంకొక దీపముచే గ్రహింపఁబడదుగదా. కనుక జ్ఞానమన్నది అతీంద్రియమే యని భట్టులు సిద్ధాంతముచేసిరి. కనుక ప్రత్యయ యోగ్యార్థమునకుఁ గలిగిన యభావము ప్రత్యక్షమగుటకు యోగ్యము కాని జ్ఞానాదుల యభావముకూడ అప్రత్యక్షమె యగును కాన నేను అజ్ఞుఁడను అను ప్రత్యక్ష విషయమైన భావరూపమైన యజ్ఞానమును స్వీకరింపవలసి యుండును. అనుపలబ్ధి అను అభావముల ఆరవ ప్రమాణములో గోచరమగుటచే తాను ప్రత్యక్ష ప్రమాణములో అనుపలబ్ధి ప్రమాణము అంతర్భవించు నన్నచో జ్ఞానము నిత్యము అను మేయమేకాని ప్రత్యక్షము కాదుకాన అది ప్రత్యక్ష విషయమైనదనుట ఉపపన్నము కాదు. అనుభవము ప్రత్యక్షమగునను నైయాయికాదులు ఇట్లు అన్నచో వారిని గూర్చియే చివరి యనువ్యవసాయముచేత స్వయముగాఁ దెలియునివస్తు సద్భావముచేతనే తనకుఁ బూర్వమందున్నట్లు వంటి యనువ్యవసాయము గ్రహింపఁబడును గాన అనవస్థయుండదు. కనుక పరులందున్న జ్ఞానమును తనయందలి నిర్వికల్పక జ్ఞానమును అతీంద్రియమైనను తనయందలి సంకల్ప జ్ఞానము ప్రత్యక్ష విషయమె అగును. అందుచే నేను అజ్ఞుఁడను అను ప్రత్యక్షము జ్ఞానాభావ విషయకమని చెప్పవచ్చును.

'నేను అజ్ఞుఁడను' (జ్ఞానాభావము కలవాఁడను) అను ననుభవములో జ్ఞానాభావమున కాధారముగా నున్న నేను అనునర్థముగల యాత్మక జ్ఞానము ఉన్నదా లేదా అట్టి ఆయనుభవములోనే జ్ఞానాభావమునకు ప్రతియోగిగా (భిన్నముగా) జ్ఞానమునకు జ్ఞానమున్నదా లేదా ఉన్నదన్నచో అపుడు జ్ఞానము ఉన్నదిగాన జ్ఞానాభావమేలేదు గాన అదే లేనపుడు దాని యనుభవమెట్లు? లేదన్నచో ఉన్నట్టువంటి జ్ఞానభావమునకు ఏమాత్రము అనుభవము సంభవింపదు. ఆ యజ్ఞానము భావరూపమైనచో ఇది వఱలో జెప్పఁబడిన లేకపోవుటవల్ల ఈ యనుభవము భావరూపమైన జ్ఞానమున గోచరించుననియే అంగీకరింపవలయును. భావరూపమైన జ్ఞానముతో విరోధము లేదని మాయావాదుల యభిప్రాయము.

భావరూపముగానున్న యజ్ఞానము జ్ఞానరూపము కాకపోవుటచే దానికి పట్టిన గాలే దీనికిని పట్టును. కాన ఇదియంతయు ఆకాశమున నెమరువంటిదే. మాయావాదిమతమున ఆత్మస్వరూపమైన జ్ఞానమె అజ్ఞానమునకు విషయము. అజ్ఞానమునకు ఆశ్రయమైనదియు ఆత్మయె కాన విషయరూపముగాను ఆశ్రయ రూపముగాను అజ్ఞానమును నివర్తింపజేయువలయును గాన నేను అజ్ఞుఁడను అను నజ్ఞాన ప్రతీతికాలములో జ్ఞానరూపముగానున్న ప్రత్యగార్థమైన ఆత్మకు ప్రతీతి యున్నదా లేదా. ఉన్నదన్నచో స్వరూప జ్ఞానముచే నివర్తింపఁ జేయఁదగినదే అజ్ఞానము. కాన అపుడు ఆ జ్ఞానము ఉండగా ఆ అజ్ఞానము ఏమని యుండును. లేదన్నచో అజ్ఞానమును నివర్తింపఁజేయు అజ్ఞాన విషయము అజ్ఞానాశ్రయ శూన్యమైన అజ్ఞానము జ్ఞానము కాకపోవుటచేత అజ్ఞానమునకు అనుభవ ప్రతీతి యుండును. ఇట్ల వ్యావర్తకమే అజ్ఞానమునకు విషయముగాను ఆశ్రయముగాను ఉన్నది. మఱి స్ఫుటమైన ఆత్మజ్ఞాన స్వరూప భావమె అజ్ఞతకు విరోధి. అది యజ్ఞతతో గూడఁ బ్రకాశింపదు. కాన ఆశ్రయ విషయముల జ్ఞానమున్నను అజ్ఞానానుభవమునకు విరోధియే కాదు. అయితే మరి ఇందులో ఇంకొక విషయమున పట్టుదల పక్షపాతము ఉండుటవలన ఇది జ్ఞానాభావమనుటలోను సమానమె. ఆత్మ ప్రతీతి స్ఫుటము అస్ఫుటము అని రెండు విధములు. అందులో స్ఫుటమైన యాత్మ ప్రతీతియే అజ్ఞానమును మరలింపఁ జేయును. నేను అజ్ఞుఁడను అన్నపుడు ఈ అజ్ఞాన ప్రతీతి కాలములో అజ్ఞానము విషయముగాను ఆశ్రయముగాను ప్రతీతమగుచున్నది. అది స్ఫుటముగాదు. కాన అజ్ఞానమును మరలింపలేదు. మాయావాదుల భావస్వరూపమైన యభావమందుఁగల పక్షపాతము మాకు లేదని వారి యాశయము. ఇంకనిద్దఱు అంగీకరించిన జ్ఞానాభావమె "నేను అజ్ఞుఁడను నన్ను ఇతరుని ఎఱుఁగను" అను అనుభవములో గోచరమగుచున్నదని యంగీకరింపవలెను.

అయితే ప్రత్యక్షము ప్రమాణముగానిచో ఇంక అనుమానమె ప్రమాణమగుగాక. ఆ యనుమాన ప్రమాణమును ఇట్లు నిరూపింపవలెను.

వివాదగ్రస్తమైన ప్రమాణజ్ఞానము తనకు పూర్వమునందున్న యభావమునకు భిన్నమును; ప్రమాణ బుద్ధికి విషయమైన బ్రహ్మాది స్వరూపమును తిరస్కరించునదియు, ప్రమాణ బుద్ధిచేతనే మరలింపఁదగినదియు ప్రమాణ బుద్ధికి ఆశ్రయమైన యాత్మయందున్నదియు నగు నితర వస్తువు పూర్వమందుఁ గలది. ప్రకాశింపఁజేయఁబడని యర్థమును ప్రకాశింపఁజేయుటవలన అంధకారమందు మొదట పుట్టిన ప్రదీపకాంతివలె అని.

అదికూడ విమర్శకు ఆగదు. అజ్ఞతయందుఁగూడ ఇష్టముగాని యింకొక యజ్ఞతను సాధింపవలసి వచ్చును. అపుడు సిద్ధాంతమె దుష్టమగును. అట్లయినచో ఆ యితరమగు అజ్ఞతచేత ప్రపంచమును తిరస్కరించినపుడు సంసారమె సంభవింపదు కాన ఇది అపసిద్ధాంతమగును. లేక యజ్ఞతను సాధించునట్టి యనుమానము ప్రమాణబుద్ధి కనుక అది పైని చెప్పబడిన యితర వస్తువే పూర్వముగాఁగలది అని సాధించునపుడు ఇంకొక యజ్ఞత సిద్ధింపవలసి వచ్చును. ఆ యింకొక యజ్ఞతచే అనుమాన విషయమైన భావరూపా జ్ఞానమును తిరస్కరించుటవల్ల సంసారమె సంభవింపక యపసిద్ధాంతమె యగును. అది దానిని సాధించకపోవుటచే అనైకాంతికము (సంశయగ్రస్తము) అగును. భావరూపా జ్ఞానముగాని భావరూప అజ్ఞతను సాధించునదిగాని పైని జెప్పఁబడిన యింకొక వస్తువు పూర్వముగాఁగలది యనుదానిని సాధింపకపోఁగా దానియందున్న యప్రకాశితార్థ ప్రకాశకత్వము అందే సాధ్యాభావ వత్తునందు ఉండుటచే హేతువు వ్యభిచరించినదగును. కాన అది అపసిద్ధాంతమగును. దృష్టాంతములో సాధనము లేదు కావునను అది యపసిద్ధాంతమె. జ్ఞానమేగాని ప్రదీప ప్రభ అప్రకాశితార్థమును ప్రకాశింపఁజేయదు. దీపమున్నను జ్ఞానముచేత విషయ ప్రకాశము సంభవించుచున్నది. నేత్రేంద్రియమునకు విజ్ఞతను గలిగించు ప్రదీపప్రభయైతే విరోధియగు నంధాకారమును పోగొట్టుటద్వారా ఉపకారము మాత్రమె అగును. కాన ఇంక అతి విస్తరమెందుకు?

అనుమానమునకు ప్రతి యోగియగు ప్రత్యనుమానమైతే వివాదగ్రస్తమైన అజ్ఞత జ్ఞానమాత్రమైన బ్రహ్మను ఆశ్రయించినది కాదు. అజ్ఞత

అగుటవల్ల శుక్తికా ద్యజ్ఞానమువలె జీవునకు గలుగును. శుక్తికాద్యజ్ఞత విజ్ఞుడగు జీవునియందేగాని జ్ఞాననిష్ఠము గాదు. అటులే ఈ మాయావాది కిష్టమైన భావరూపాజ్ఞానము జ్ఞాతను ఆశ్రయించినదే గాని జ్ఞానమునాశ్రయించినది కాదు. మాయావాదులైతే ఆయజ్ఞానము జ్ఞానరూప బ్రహ్మాశ్రితమని యంగీకరించుచున్నారు. శుక్తి కాద్యజ్ఞానమునకు ఆశ్రయమైన ప్రత్యగర్థము జ్ఞానమాత్ర స్వభావమె గదా అన్నచో ఇట్లు శంకింపరాదు. మాయావాది మతములో జీవము వాస్తవమునకు జ్ఞాతగాదు. కేవలము జ్ఞానమాత్ర స్వరూపమె యగును. కనుక శుక్తికా ద్యజ్ఞానమాత్రాశ్రితమని దృష్టాంతము సంభవింపదని భావము. అనుభూతి అన్నది స్వసద్భావముగానే యొకానొక వస్తువు వ్యవహారానుగుణమని చెప్పు స్వభావముగలది జ్ఞానము అవగతి సంవిత్తుబోధ అను పేర్లుగలది. అనుభవించునాత్మకు సకర్మకమైన ధర్మవిశేషము. అనుభవించునది ఆత్మయని ఆత్మయందున్న గుణవిశేషము జ్ఞానము అని ఆశ్రయింపఁబడుచున్నదిగదా. మతిజ్ఞానరూపమైన యాత్మకుజ్ఞానగుణముండుట యెట్లన్నచో ఇందుసారము లేదు. అప్రత్యక్షమైన యాత్మ జ్ఞానస్వరూపమని శ్రుతి ప్రమాణముచేత స్వీకరింపఁబడినట్లే అప్రమాణముచేతనే జ్ఞానగుణముగలది అని తెలియఁదగును. మణులు సూర్యుడు మొదలగునవి స్వయముగా తేజో రూపప్రభకు ఆశ్రయమగును. అట్లే జ్ఞానరూపమైనది జ్ఞానగుణాశ్రయమని వ్యవహారము కలుగునని తెలియునది స్వాశ్రయముకంటె నితరమైనచోట ఉండుటచేతను రూపముగలదగుటచేతను ప్రభద్రవ్యరూపమైనను సూర్యతేజః శుక్లాది గుణ నిబంధనమగుటచే గుణవ్యవహారము గలది కొన్ని అవ్యాప్యవృత్తులు. ఎట్లన ఆకాశమున శబ్దము. ఆకాశములో నొకచోటనే శబ్దము ఉండునుగాని అంతట ఉండదు. కొన్ని వ్యాప్యవృత్తులు ఎట్లన ఘటమందు రూపము. ఘటములోపలపైని అంతటరూపముగలది, ప్రభ సూర్యునందున్నను సూర్యుని కంటె నితర సముద్ర పర్వతాదులందున్నది. కనుక అది గుణముకాదు శుక్లరూపముగాన అది ద్రవ్యమె.

ఇట్లు ఈ యాత్మ స్వప్రకాశమైన జ్ఞాన రూపమే. చిద్రూపమే చైతన్యగుణము ఆత్మగుణభూతమైనను వాస్తవమునకు ద్రవ్యమే ప్రభసూర్యాది తేజోంతర

మునా శ్రయించుటచేత గుణసాదృశ్య మగుటచేత గుణత్వవ్యవహారము. అది గుణమని తెలియునది. ఉభయురూపముగా శ్రుతియందు వ్యవహరింప బడినది. ఎట్లనఁగా-"అదియెట్లన,

సయథాసైంధవఘనోఽనంతరోఽబాహ్యః కృత్స్నో రసఘన ఏవై వంవా అరేఽయమాత్మాఽనంతరోఽబాహ్యః కృత్స్నః ప్రజ్ఞాన ఘ నఏవ (బృ. 4. 5. 13)

అదెటులన భౌమతైజన ప్రాప్తి వలన
ఏజలనిధి నీర ముప్పగడ్డటులయ్యె
అటులెయోసి! యేనాత్మ యనంతరము
సకలము నబాహ్యమునౌ ప్రజ్ఞానఘనమై
ఇంతవఱకు ఇట ఆత్మ జ్ఞాన స్వరూపమైనదని చెప్పఁబడినది.
అత్రాయం పురుషః స్వయంజ్యోతిర్భవతి. (బృ. 8. 3. 2)
ఒగిని నీపురుషుండు స్వయంజ్యోతియగును"
నహి విజ్ఞాతు ర్విపరిలోపో విద్యతే (బృ. 8. ౬0)
తెలిసెడి యతని తెలివియడఁగదు.

అథయో వేదేదం జిఘ్రాణీతి స ఆత్మా (బృ 8. 2. 4) వాసనచూచెద నని యెవండు తలఁచు వాడయాత్మ ఇట ఆత్మజ్ఞానత గుణమున్నదని చెప్పబడినది యోఽయం విజ్ఞామయః ప్రాణేషు హృద్యంతర్జ్యోతిః పురుషః (బృహ 8. 3. 2)

ప్రాణములలోన నెవ్వఁడు విజ్ఞానమయుఁడొ, హృదయములోన జ్యోతి యెసఁగునతఁడెయాత్మ," ఇంతవరకు జ్ఞానరూపమనబడెను.

ఏషహిద్రష్టా స్రష్టా శ్రోతాఘ్రాతా రసయితా మంతా బోద్ధాకర్తా విజ్ఞా నాత్మా పురుషః (ప్ర. 4. 9) ఇతఁడెచూచువాఁడు స్పృశించువాఁడు విను వాఁడు, వాసనచూచువాడు రుచిగొనువాఁడు తలఁచువాఁడు తెలిసికొనువాఁడు చేయువాఁడు విజ్ఞానాత్మయైనపురుషుఁడు" ఇత్యాదులు శ్రుతులలో మఱల ఆత్మ

జ్ఞానగుణము గలదని చెప్పబఁడినది. ఈ విధముగా ఆత్మ యుభయాత్మకమని భావము. దీనినిబట్టి ఆత్మజ్ఞాతయేగాని జ్ఞానస్వరూపమైనదికాదను తార్కికులును ఆత్మజ్ఞానరూపమేగాని జ్ఞాతయను మాయావాదులును నిరసింపఁబడిరని తెలియుచున్నది.

"అనృతేన ప్రత్యూరూఢాః" (ఛాం, 8. 3. 2) అపత్యముచేఁగప్పఁబడిన వారై యట్లు చూడతేరు. అనుశ్రుతి అవిద్యలో ప్రమాణమని యాశ్రయింప శక్యము గాదు. అనృత శబ్దము ఋతముకంటె భిన్నమైనది అనృతము అను నర్థములో వాడఁబడినది, ఋతంపిబంతౌ సుకృతస్యలోకేఛాయాత పౌప్ర వదంతిధీరాః" (కఠ. 3. 1) కర్మఫలమును అనుభవించు బ్రహ్మజీవులను ఎండ నీడలుగా వచింత్రు" "అని చెప్పుటవలన, ఋత శబ్దము కర్మ ప్రవచన మైనది. అనఁగా పుణ్యకర్మవాచకము ఋతకర్మ ఫలాభిసంధ(ఫలవాంఛా) రహితము. పరమాత్మ పురుషారాధన మనెడి స్వరూపము గలది. పరమ పురుష ప్రాప్తియె ఫలముగా గలది. ఇట నిష్కామముగా పరమ పురుష ప్రాప్తికంటె వ్యతిరేకమైన యల్పఫలముకర్మ అనృతము. యఏతం బ్రహ్మ లోకంన విందంతి అనృతేన హి ప్రత్యూఢాః" (ఛాం 8. 3. 2) ఎవరీ బ్రహ్మ లోకమును పొందరో వారు అనృతముచేత గప్పబడినవారై చూడలేరు) అను వాక్యమువల్ల ఇది బ్రహ్మప్రాప్తికి విరోధి "మాయాంతు ప్రకృతిం విద్యాత్" (శ్వేతాశ్వ 4-10) ఇత్యాదులందు మాయయను పదము విచిత్రార్థములను గలిగించు గుణాత్మకమైన ప్రకృతిని జెప్పునదికాని అనిర్వచనీయమైన యజ్ఞానమును జెప్పునదికాదు.

తేనమాయాసహస్రం తచ్ఛంబరస్యాశుగామినా

బాలస్యరక్షతా దేహ మేకాంశేనచ సూదితం, (వి. పు. 1-19-20) త్వరగ పోవునట్టియు బాలుడైన ప్రహ్లాదుని దేహమును రక్షించు నా విష్ణుచక్రము చేత హిరణ్య కశిపుడు పంపిన శంబరుని వేలమాయలు ఒకే యంశ చేత నాశము చేయఁబడినవి." అనుచోట మాయాశబ్దము విచిత్రార్థ సృష్టిని సమర్పించు నట్టి పారమార్థికమై యసురాద్యస్త్ర విశేషమునే చెప్పుచున్నది. కాన

ఎక్కడను గూడ శ్రుతిలో మాయా శబ్దము అనిర్వచనీయాజ్ఞానార్థమును తెలుపుట లేదు.

"తత్త్వమసి" (తత్=ఆ పరమాత్మ, త్వం=జీవుడవైన నీవుగా, అసి=ఉన్నావు) అనుచోట జీవ పరమాత్మలు వాస్తవమునకు భిన్నులైనచో ఐక్యము చెప్పరాదు. కనుక ఆ భేదము కాల్పనికమని స్వీకరించిననేగాని తాదృశభేద జ్ఞానమును గలిగించుటద్వారా అనిర్వచనీయమైన యజ్ఞానము సిద్ధించును. ఆ యర్థము అర్థాపత్తి ప్రమాణముచే భావరూపాజ్ఞానము గలుగును అనికూడఁ జెప్పరాదు. ఏలయన, తత్ త్వం అను పదములు రెండు సవిశేషమైన బ్రహ్మలను (జీవ బ్రహ్మను పరబ్రహ్మను) ప్రతిపాదించుచున్నవి. అవి విరుద్ధమైన జీవబ్రహ్మల స్వరూపైక్యమును ప్రతిపాదింపలేవు. కనుక అసలు అక్కడ అర్థాపత్తి యుదయించుటకే అవకాశము లేదు. అను దోషము గలుగుచున్నది. ఆ "తత్త్వమసి" అనుదానిలోని తత్పదము సమస్తదోష శూన్యమును హద్దులేని గొప్ప లెక్కలేనన్ని కళ్యాణగుణములకు ఆస్పదమైనట్టియు, జగుదుత్పత్తి స్థితి లయములనెడి లీలలుగల బ్రహ్మమును ప్రతిపాదించుచున్నది. "తదైక్షత బహుస్యాం ప్రజాయేయ" (ఛాం. 6-2-3) నేను చాల రూపములుగ అగుదును చాలగా సృజింతును" ఇత్యాదులందు సవిశేషమైన బ్రహ్మమె ప్రకృతమగుచున్నది. ఇంక తత్ పదమునకు విశేషణమైన త్వం పదము అచిద్విశిష్ట (చిత్తుగాని జడదేహము గల) జీవుని శరీరముగల బ్రహ్మనే చెప్పుచున్నది. రెండు విధములుగానున్న యొక వస్తువునే నీలఘటము అను చోటవలె సామానాధికరణ్యమును ప్రతిపాదించుచున్నది.

మఱి "వాఁడె ఈ దేవదత్తుడు" అనుచోటవలె తత్ (అది) త్వం (నీవు) అను పదములకు విరుద్ధ (భిన్న) భావములను త్యజించు లక్షణముచేత నిర్విశేష స్వరూపముగల ఆత్మలయైక్యమె సామానాధికరణ్యముగ (విశేషణ విశేష్య భావముగ) ఎందుకుఁ గాఁగూడదు. ఎట్లు "వాడె వీఁడు" అనుచోట తత్ (అది) పదముచేత మరొకచోట మరొకప్పుడు గల పురుషుడు పరామర్శింపబడుచున్నాడో అట్లే వీఁడు అను పదముచేత ఇక్కడ ఇప్పుడు ఉన్న సంబంధము

ఎక్కడను గూడ శ్రుతిలో మాయా శబ్దము అనిర్వచనీయాజ్ఞానార్థమును తెలుపుట లేదు.

"తత్త్వమసి" (తత్=ఆ పరమాత్మ, త్వం=జీవుడవైన నీవుగా, అసి=ఉన్నావు) అనుచోట జీవ పరమాత్మలు వాస్తవమునకు భిన్నులైనచో ఐక్యము చెప్పరాదు. కనుక ఆ భేదము కాల్పనికమని స్వీకరించిననేగాని తాదృశభేద జ్ఞానమును గలిగించుటద్వారా అనిర్వచనీయమైన యజ్ఞానము సిద్ధించును. ఆ యర్థము అర్థాపత్తి ప్రమాణముచే భావరూపాజ్ఞానము గలుగును అనికూడఁ జెప్పరాదు. ఏలయన, తత్ త్వం అను పదములు రెండు సవిశేషమైన బ్రహ్మలను (జీవ బ్రహ్మను పరబ్రహ్మను) ప్రతిపాదించుచున్నవి. అవి విరుద్ధమైన జీవబ్రహ్మల స్వరూపైక్యమును ప్రతిపాదింపలేవు. కనుక అసలు అక్కడ అర్థాపత్తి యుదయించుటకే అవకాశము లేదు. అను దోషము గలుగుచున్నది. ఆ "తత్త్వమసి" అనుదానిలోని తత్పదము సమస్తదోష శూన్యమును హద్దులేని గొప్ప లెక్కలేనన్ని కళ్యాణగుణములకు ఆస్పదమైనట్టియు, జగుదుత్పత్తి స్థితి లయములనెడి లీలలుగల బ్రహ్మమును ప్రతిపాదించుచున్నది. "తదైక్షత బహుస్యాం ప్రజాయేయ" (ఛాం. 6-2-3) నేను చాల రూపములుగ అగుదును చాలగా సృజింతును" ఇత్యాదులందు సవిశేషమైన బ్రహ్మమే ప్రకృతమగుచున్నది. ఇంక తత్ పదమునకు విశేషణమైన త్వం పదము అచిద్విశిష్ట (చిత్తుగాని జడదేహము గల) జీవుని శరీరముగల బ్రహ్మనే చెప్పుచున్నది. రెండు విధములుగానున్న యొక వస్తువునే నీలఘటము అను చోటవలె సామానాధికరణ్యమును ప్రతిపాదించుచున్నది.

మఱి "వాఁడె ఈ దేవదత్తుడు" అనుచోటవలె తత్ (అది) త్వం (నీవు) అను పదములకు విరుద్ధ (భిన్న) భావములను త్యజించు లక్షణముచేత నిర్విశేష స్వరూపముగల ఆత్మలయైక్యమె సామానాధికరణ్యముగ (విశేషణ విశేష్య భావముగ) ఎందుకుఁ గాఁగూడదు. ఎట్లు "వాడె వీఁడు" అనుచోట తత్ (అది) పదముచేత మరొకచోట మరొకప్పుడు గల పురుషుడు పరామర్శింపబడుచున్నాడో అట్లే వీఁడు అను పదముచేత ఇక్కడ ఇప్పుడు ఉన్న సంబంధము

ఆత్మ ఎఱుగదో దేనికి ఆత్మ శరీరమో అదే నీ యాత్మ. "య ఆత్మని తిష్ఠన్ ఆత్మనోంతరోయ మాత్మా నవేద యస్యాత్మా శరీరం" (బృ. 3-7-22) అను శ్రుతిని బట్టియు అది బ్రహ్మరూపమె.

"త్వం" నీవు అన్నది జీవునిలోనున్న పరమాత్మను చెప్పును" అన్నది అత్యల్పమైనది. ఘటము పటము మొదలైన అన్ని మాటలును వస్తువులుగాన అన్ని వస్తువులు బ్రహ్మరూపములుగాన పరమాత్మనె చెప్పునవి. పరమాత్మకు పర్యాయ పదములుమాత్రము కావు. ఘటశబ్దము ఘటవ్యక్తిద్వారా ఘటములోని పరమాత్మను చెప్పునది. పటశబ్దము పటవ్యక్తిద్వారా పటములోని పరమాత్మను చెప్పును. పటములోని పరమాత్మ ఘటములోని పరమాత్మయు పేరైనను ఘట పట వ్యక్తులు వేరుకాన వానిని పర్యాయములనరాదు. జీవములు శరీరముగలవగుటచేత అనేక ప్రకారములుగానున్న దేవ మనుష్యాది శరీరములవలె అన్ని వస్తువులు ఉండుటచేత అన్ని వస్తువులు బ్రహ్మస్వరూపము గలవి కనుకనే

దేవో మనుష్యో యక్షోవా పిశాచోరగ రాక్షసాః
పక్షివృక్షో లతాకాష్ఠం శిలా తృణం ఘటః పటః

దేవుడు, మనుష్యుడు, యక్షుడు, పిశాచములు, పాములు, రాక్షసులు, పక్షి, చెట్టు, తీగె, కర్ర, రాయి, గడ్డి, ఘటము, పటము మొదలగు శబ్దములు ప్రకృతి ప్రత్యయ సంబంధముచేత వస్తువులుగా ప్రసిద్ధమై లోకమున వానియర్థముగా తోచుచున్న ఆయా యాకారములుగలుగు వస్తువులుగా వానియధి దేవతల లోపలనున్న ఆత్మవరకు అర్థమును చెప్పును. ఆ వస్తువుల లోపలనున్న జీవుడు ప్రత్యక్షము కాకపోవుటవలన లోకులు కేవలము బాహ్యమైన యర్థమునే ఆయా పదములకర్థముగా తలంచుచున్నారు. దేవాది పదములకు పరమాత్మవఱకుఁగల యర్థమె సరియైన యర్థమని తత్త్వముక్తావళియందు నాల్గవ సరమందిట్లు చెప్పబడినది.

జీవం దేవాది శబ్దోవదతి తద పృథక్సిద్ధభావాభినాత్
నిష్కర్షాభావయుక్తాద్ ఒహురిహచదృఢో లోక వేదప్రయోగః
ఆత్మాసంబంధకాలే స్థితిరనవగతా దేవమర్త్యాది మూర్తేః
జీవాత్మాను ప్రవేశాజ్జగతి విభురపివ్యాకరోన్నామ రూపే
(తత్త్వముక్తావళి 4–82)

జీవనము కంటె వేరుకాని దేవాది శరీరరూపమైన భావమును చెప్పుట వలన దేవాదిశబ్దములు జీవునె చెప్పును. జీవునితో సంబధములేకుండ శరీరస్వరూపమె సిద్ధింపదు గదా. మఱియు లోకములోఁగాని వేదములోఁగాని దేవాది శబ్దము శరీరము కంటె వేఱుగాకుండనె సిద్ధించుచున్నది లోకమున దేవమనుష్య పశుపక్ష్యాదులు కేవలము జీవమందునుగాని శరీరమునందును గాని ప్రయోగింపఁబడుటలేదు శరీరవిశిష్ట జీవాదులందె ప్రయోగింపఁబడు చున్నవి. వ్యాపియైన పరమాత్మకూడ జీవాత్మలందె చొచ్చుచున్నది. ఆత్మ ప్రవేశింపనపుడు మరణించిన పిదప దేవాది శరీరములు వెనుకటివలె నుండవు. వ్యాపియైన పరమాత్మకూడ అన్నిచోట్ల జీవాత్మయొక్క ప్రవేశమువల్లనె జగత్తులో నామరూపములను వివరించెను. కనుక అచిచ్ఛరీరము గలవాఁడు జీవుఁడు అచిజ్జీవ శరీరము గలవాఁడు ఈశ్వరుడుఅని చేతనా చేతనా శబ్దములకు పరమాత్మవరకు అర్థముచెప్పుట యుక్తము. ఇట్లుపరమాత్మ నామరూపములు వివరించెను.

సంస్థానైక్యాద్యభావే బహుషు నిరుపధి ర్దేహశబ్దస్య రూఢిః
లోకామ్నాయ ప్రయోగానుగత మిహ తతోలక్ష్మ నిష్కర్షణీయమ్
అవ్యాప్తత్వాది దుఃఖం పరమత పతితం లక్షణంతత్ర తస్మాత్
యద్ధీతుల్యాశ్రయం యద్వపురిద మపృథక్సిద్ధి మద్ ద్రవ్యమస్య

మనుష్య పశుపక్షిలతాదులైన యనేక శరీరములందు ఒకేవిధమైన యవయవ సంనివేశము లేనపుడు లోకవేదములందు దేహశబ్దము నిరుపాధిగానే ప్రసిద్ధమై యున్నది. కనుక వానినిబట్టియే శరీరమునకులక్షణము చెప్పవలసియున్నది.

నైయాయికాదిపర మతములందు చెప్పబడిన 'చేష్టాశ్రయమైనది శరీరము' అనులక్షణము చేష్టాదులు లేనికాలాదులందు అవ్యాప్తమైయున్నవి, కనుక శరీరము అన్నదానికి జ్ఞానముతోపాటు తుల్యమైన యాశ్రయముగలదే శరీరమని లక్షణము చెప్పవలయును. జ్ఞానముగలదే ద్రవ్యమని ఆత్మతో వేఱుగా నుండనిదే శరీరమని చెప్పబడుచున్నది.

శబ్దైస్త్వంశ రూప ప్రభృతిభి రఖిలైః స్థాప్యతే విశ్వమూర్తేః
ఇత్థంభావః ప్రపంచ స్తదనవగమత స్తత్పృథక్సిద్ధమోహః
శ్రోత్రాద్యై రాశ్రయేభ్యః స్ఫురతిఖలు పృథక్ శబ్దగంధాదిధర్మో
జీవాత్మన్యప్యదృశ్యే వపురపిహి దృశా గృహ్యతేఽనన్యనిష్ఠమ్

తత్సర్వం నైవహరే స్తనుః [విష్ణు.పురా. 1–22–37] మమైవాంశో జీవలోకే [గీ–15–7] ద్వేరూపే బ్రహ్మణ స్తస్య [వి. పు 1–22–5] విష్ణు శక్తిః పరాప్రోక్తా [వి. పు. 6–7–6] యదంబు వైష్ణవః కాయః [వి. పు. 2–12–37] యస్యాత్మా శరీరం [బృ. 3-7-22] ఇత్యాదులందు 'అదేశమె, సర్వము హరియొక్క తనువు, జీవలోకమందె అన్నియు నాయొక్కయం ఆబ్రహ్మమునకు రెండురూపములున్నవి, విష్ణుశక్తి పర అనిచెప్పబడినది. ఈ నీరు వైష్ణవకాయము. ఆపరమాత్మయే శరీరము, అని ఇత్యాదులందు తనువు అంశ మొదలగుశబ్దములచేత ఈయఖిలప్రపంచము విశ్వమూర్తియైన విష్ణువుయొక్క వేఱుగాని స్వరూపముగనె స్థాపింపఁబడుచున్నది. లోకమందైతే విశేష్యమైన ఈశ్వరుని తెలియకపోవుటవలన ఇది వేఱుఅని సిద్ధించుచున్నదని చెప్పుట పామరుల మోహమె. జ్ఞానులకు మాత్రము ఎల్లపుడును ఈప్రపంచము ఈశ్వరునికంటె వేఱుగాదని ప్రతిదియు వ్యవహారమును శ్రోత్రాదులచేత వానియాశ్రమములకంటె శబ్దగంధాది ధర్మములువేఱుగా స్ఫురించుచున్నట్లుగానే ఈశ్వరుని గ్రహించుట కర్హులుకాని అల్పజ్ఞులు శ్రోత్రాదిప్రమాణములచేత ఈశ్వరుని కంటె వేఱుగా కేవలప్రపంచమును గ్రహించుచున్నారు. జీవాత్మకూడ చక్షురాదులకుఁ గనిపింపదు. అది మనోగ్రాహ్యమె

కనుక చక్షువుచే గ్రహింపఁబడు శరీరము జీవునికి విశేషణముగా గ్రహింప బడదు. కాని జీవుడు చక్షుర్గ్రాహ్యుఁడుగాడుకాన నన్యనిష్ఠుడుగాడని వేఱుగా సిద్ధమైనట్లు గ్రహింపబడుచున్నాడు.

నిష్కర్షాకూతహానౌ విమతిపద పదాన్యంతరాత్మానమేకం
తన్మాత్రే ర్వాచికత్వాదభిదధతి యథారామకృష్ణాది శబ్దాః
సర్వేషామాప్తముఖ్యైరగణితవచసాం శాశ్వతేఽస్మిన్ప్రతిష్ఠా
పాకైస్తస్యాప్రతీతేర్జగతి తదితరైఃస్యాచ్చ ఛంక్త్వాప్రయోగః

వేఱు అనునభిప్రాయములే నపుడు వివాదాస్పదమైన పదములు రామ కృష్ణాది శబ్దములవలె వేరుకాని వానిమూర్తులను జెప్పునవగుటవలన జీవశరీర మందున్న యొకయంతరాత్మనె చెప్పుచున్నవి. ఆప్తులలో ముఖ్యులగు మహర్షులచేత అన్నిమాటలకు శాశ్వతపరమాత్మ యందెదానికి నిలకడకల్పింప బడినది. బాలురవంటి యజ్ఞానులకది తోచకపోవుటవల్ల జగత్తునందు అజ్ఞానులు కానివారిచే లక్షణచే శరీరస్థిత పరమాత్మనె చెప్పునట్లు ప్రయోగింపబడినది. ఈవిధముగా విశ్వము ఈశ్వరునికంటె వేరుగాదని సిద్ధింపఁజేసి పదముల న్నియు చివరకు పరమాత్మ పరములుగా ప్రతిపాదింప బడినవి. ఇదంతయు విస్తరముగా ఆగ్రంథములనుండియే తెలియదగును. ఈ యర్థమె వేదార్థ సంగ్రహములో నామరూప శ్రుతివివరణ సమయమందు రామానుజులచే నిరూపింపబడెను.

ప్రత్యక్షాది ప్రమాణములు రూపాది విశేషములున్న వస్తువులందేగాని రూపాదివిశేషములు లేని వస్తువునందు పట్టవు. ప్రత్యక్షమును ఆధారముగా, జేసికొని ప్రవర్తించు ననుమానాది ప్రమాణములును రూపాదివిశేషములు లేని వస్తువునందు సరిగా పట్టవు. రూపాదినిర్విశేషమగు నిర్వికల్పక ప్రత్యక్షమం దుఁగూడ రూపాదివిశేషములు గలవస్తువె ప్రతీత మానమగును. అట్లుగానిచో సవికల్పకజ్ఞానమందు అదేయిది అని ఇదివరలోపొందిన ప్రకారము గలదానికి ప్రతీతి కలుగక పోవలసివచ్చును. నిష్ప్రకారకజ్ఞానము నిర్వికల్పక జ్ఞానమని

నైయాయికులచే చెప్పబడినది యిక్కడ గ్రహింపబడదు. నిష్ప్రకారకజ్ఞానము నిర్వికల్పక జ్ఞానముగా రామానుజీయులు ఎక్కడనునంగీకరింపలేదు కానిఏకజాతీయములగు ద్రవ్యములందుమొదటచూచిన ఆకారములేకపోవుటయే నిర్వికల్పకమని గ్రహింపబడెను. ఎట్లనఁగా, అదివరకు ఘటమునుజూడని దేవదత్తాదులకు మొదటఁగలుగుచున్న "ఇదిఘటము." అనుజ్ఞానము ఇట ఆలోచింపఁగా ఘటస్వరూప ప్రకారము భాసించుచునేయున్నది. అయినను ఈ ఘటత్వము ఇతరఘటములందుఁగూడ అనుకర్తించినది అని ఇటువంటి యనువర్తించిన రూపముతోఘటలేదు అనునాశయములో రామానుజీయులచే నిర్వికల్పకమని చెప్పఁబడుచున్నది. ద్వితీయ తృతీయాది ఘటజ్ఞానములందుఁ మునుపేఘటమైతే చూడఁబడెను అటువంటిదే ఇదిఅను అనువృత్తిఘటత్వము ప్రతీతమగుచున్నదికాన అది నిర్వికల్పకమైనది. ఇట్లును రామానుజులకిష్టమైన నిర్వికల్పకమందు విశేషమైన వస్తువు ప్రతీతమగుచున్నదనితేలినది. అట్లుగానిచో మొదటి జ్ఞానమందు ప్రకారము భాసింపనిచో అదే ఇది అని అదేఅను శబ్దముచేత ఇదివరలో కలిగిన ఘటత్వాది ప్రకారక విశిష్ట ప్రతీతి ఉపపన్నము కాదు, నైయాయికులైతే మొదటి సవికల్పకజ్ఞానమందు అదేయిది అని యిట్లు ప్రతీతియే గలుగదని తలచుచున్నారు.

భ్రాంతితో ప్రయోగింపఁబడిన 'రజ్జుసర్ప' వాక్యమువలె భ్రాంతిమూలములై యుండుటవలన పూర్వోక్తములగు 'తత్త్వమసి' మొదలైనవి ప్రపంచమునకు బాధకములుకావు. బ్రహ్మము ఆత్మయు ఒకటేఅను జ్ఞానముకూడ ప్రపంచమునకుబాధకముగాదు. సర్వప్రపంచము భ్రాంతిచేభాసించుచున్నదని వాదించు మాయావేదాంతుల మతమున ప్రపంచములోని వేదముకూడ భ్రాంతిమూలకమే గాన దానిచే ప్రపంచమునకు బాధకలుగదు. నిజమునకు భ్రాంతిపడినవాడు త్రాడునుచూచి పాముఅనుకొని చెప్పినపుడు దానియందు విశ్వాసము కలుగనట్లే ఇక్కడఁగూడ అవిద్యయందు ప్రమాణములేదని ఇదివఱకే చెప్పబడెను గనుక ప్రత్యక్షముగ సిద్ధించిన భేదముగ ప్రపంచములేదని చెప్పరాదు గాన బ్రహ్మాత్మైక్యముగూడ ప్రమాణసిద్ధముగాదు సర్వప్రమాణములు సవిశేషవస్తువిషయములని చెప్పితిమిగదా. ప్రపంచము సత్యమని స్థాపించి

నపుడు ఏకవిజ్ఞానమున సర్వవిజ్ఞానములు గలుగునని ప్రతిజ్ఞకు విరోధములేదు. ప్రకృతి పురుషుడు మహత్తు అహంకారము తన్మాత్రలు (శబ్దస్పర్శాదులు)పంచ భూతములు ఇంద్రియములు పదునాల్గుభువనముల రూపమైన బ్రహ్మాండము వానిలోని దేవులు తిర్యక్కులు మనుష్యులు స్థావరములు మొదలగు సర్వవిధము లయిన రచనావిశేషములతోఁ గూడిన కార్యమెల్ల బ్రహ్మమె. మూల కారణ భూతమగు బ్రహ్మ జ్ఞానమువల్లనె సర్వవిజ్ఞానము లగుచున్నవి. కనుక ఏక విజ్ఞానముచేత సర్వవిజ్ఞానము కలుగుట కలుగుచున్నది మరియు బ్రహ్మ మునకంటె భిన్నమైనదెల్ల మిధ్యకావున సర్వములేనిది కనుక ఒకటి తెలిసిన సర్వము తెలియుునను ప్రతిజ్ఞకు బాధకలుగవలసి వచ్చుచున్నదిగదా, నామ రూపవిభాగములకు తగని సూక్ష్మస్థితివలె ప్రకృతిపురుష శరీరము కారణావస్థ లోనున్న బ్రహ్మమె. దానివికారమైన బ్రహ్మాండము స్థూలశరీరమె, జగత్తు సూక్ష్మమైన బ్రహ్మరూపమొందుట అనఁగా ప్రళయమె, నామరూపములుగా విభజింపబడి స్థూలమైన చిత్తు అచిత్తు వస్తువుల శరీరము కార్యావస్థయందలి బ్రహ్మమె. బ్రహ్మముయొక్క అటువంటి స్థూలరూపమె సృష్టి ఇట్లుకాఁగా కార్యకారణములలో పదమొకటిగానుండుటయె సృష్టిఅని ఆరంభావస్థలో చెప్పబడినది మిక్కిలి యుపపన్నమగును.

'నిర్గుణం పరబ్రహ్మ' అనునిర్గుణ బ్రహ్మప్రతిపాదక వాదములు ప్రాకృతమైన త్యజింపదగిన జరామరణాది గుణముల నిషేధించుటకె. అవి పరమాత్మ యందులేదని చెప్పుటయె తాత్పర్యముగలవి. "నేహ నానా స్తికించన" ఈ బ్రహ్మవిషయములో భిన్నత్వములేదను శ్రుతులును ఒకబ్రహ్మమునకు శరీర మైన సర్వచేతనా చేతనాత్మకమైన జగత్తు అని సర్వము ఆత్మస్వరూపముగాన సర్వప్రకారమైన బ్రహ్మయెయున్నదని సర్వాత్మక బ్రహ్మముకంటె వేఱైన ఏవస్తువులేదని చెప్పుటయె జడచేతనాది నానాత్వ శ్రుతులకు తాత్పర్యముగా నంగీకరించి ప్రతిపాదింపబడెను.

అయితే మరియిక్కడ అసలుసంగతిఏది?తత్త్వము భేదస్వరూపమా అభేద స్వరూపమా. భేదాభేద రూపమైన యుభయస్వరూపమా? సర్వముతత్త్వమె. అనఁగా భేదము, అభేదము భేదాభేదముకూడ వస్తుతత్త్వము. అని మూడు

విధములుగను ఉండును. బ్రహ్మతత్త్వము సర్వవిధ శరీరములు గలదగుట చేత సర్వవిధ ప్రకారములు గలిగి బ్రహ్మగానే ఉండునుగాన అభేదమని అంగీకరింపఁబడుచున్నది. బ్రహ్మమొకటే అనేకవిధములయి చిద్రూపులయిన జీవులుగాను అచిద్రూపులయిన జడములుగాను ఉండుటచే నానారూపముగా ఉండునుగాన భేదము అభేదము నగును. ఇంక అందు చిద్రూపులుగానున్న జీవాత్మలు సంకుచితములుగాక పరిచ్ఛిన్నములుగాక నిర్మలము లయి జ్ఞానరూపములయి యుండియు అనాదికర్మ రూపావిద్యచేఁ జుట్టుకొనఁబడి ఆయాకర్మల కనురూపమైన జ్ఞానసంకోచవికాసములు భోగ్యమైన యాచిత్తుతో సంబంధము, దానికనుగుణమైన సుఖదుఃఖములను అనుభవించుచు సుఖదుఃఖ రూపమైన భోక్తృత్వము, భగవంతునిపొందుట, భగవంతుని పొందకపోవుట అనునవి ఆజీవాత్మలకు స్వభావములు. భోగ్యములగు అచిద్వస్తువులకు అచేతనత్వము అపురుషార్థత్వము వికారాస్పదత్వమును మొదలగునవి స్వభావములు. ఇంక పరమేశ్వరునికో భోక్తృత్వము భోగ్యత్వములందు అంతర్యామియైయుండుట ఇంతది యనరాని జ్ఞానము ఐశ్వర్యము వీర్యము శక్తి తేజస్సు మొదలగు హద్దులులేని గొప్పతనములు లెక్కలేని కళ్యాణగుణగణములు కలిగియుండుట, స్వసంకల్పముచే ప్రవర్తించిన తనకంటె భిన్నమైన సమస్త చిదచిద్వస్తువులు గలిగియుండుట, తంకిష్టమై తనకు తగిన ఏకరూప దివ్యరూపముల నిరతిశయమైన విధములుగల అనంతమైన భూషణములు గలిగియుండుట మొదలగునవి స్వభావములు.

* వెంకటనాథుడు పదార్థవిభాగమును తత్త్వముక్తాకలాపమను గ్రంథమందు ఈ విధముగా సిద్ధాంతీకరించెను.

(ఈ వెంకటనాథుడు ద్రావిడబ్రాహ్మణుడు, విశ్వామిత్రగోత్రుడు. శ్రీపుండరీకాక్షాచార్యుని పౌత్రుడు. శ్రీమదనంతాచార్యుని పుత్రుడు, వాదిహంసాంబుదాచార్యునిశిష్యుడు. శ్రీతోతారమ్మ ఇతనితల్లి. ఇతనినే వేదాంతాచార్యుడని యందురు. ఇతడు విద్యారణ్యుని సమకాలీనుడు, శ్రీమద్విద్యారణ్యమునులకనుమధ్వ సంప్రదాయమునకనుసరించు అక్షోభ్యమునులకును జరిగిన వివాదములో ఈ వేదాంతాచార్యులు మధ్యస్థులై యుండిరని యందురు.)

> ద్రవ్యాద్రవ్య ప్రభేదాన్మిత ముభయ విధంతద్విద స్తత్త్వమాహుః
> ద్రవ్యంద్వేధావిభక్తం జడమజడ మితిప్రాచ్యమవ్యక్తకాలే
> అంత్యం ప్రత్యక్పరాక్చ ప్రథమముభయథా తత్రజీవేశభేదాత్
> నిత్యా భూతిర్మతిశ్చేత్య పరమిహ జడామాదిమాం కేచిదాహుః
>
> (తత్త్వముక్తా. 1-6.)

ప్రమాణసిద్ధమైన తత్త్వము ద్రవ్యము అద్రవ్యముఅని అవి రెండుగా తత్త్వవేత్తలు చెప్పిరి. మరల ద్రవ్యము జడము అజడము (చైతన్యము) అని రెండువిధములు. అందు మొదటిది అవ్యక్తముకాలము అని రెండువిధములు. (అవ్యక్తమనఁగా సత్త్వరజస్తమో గుణాత్మక రూపమైన మూలప్రకృతి) ఇంకకాలమున్నది ప్రత్యక్కు పరాక్కు అని రెండు. ప్రత్యక్కు జీవుఁడు ఈశుఁడని రెండువిధములు. పరాక్కు నిత్యవిభూతి మతి అని రెండు, నిత్యవిభూతి అనఁగా వైకుంఠలోకము, మతియనఁగా ఆత్మగుణమైన జ్ఞానము. కొందఱు రామానుజీయులు నిత్యవిభూతి జడమందుర్రు.

> తత్రద్రవ్యం దశావత్ప్రకృతిరిహగుణైః సత్త్వపూర్వైరుపేతా
> కాలోఽబ్దాద్యాకృతిః స్యాదణురవగతిమాన్ జీవఈశోన్యఆత్మా
> సంప్రోక్తా నిత్యవిభూతి స్త్రిగుణసమధికా సత్త్వయుక్తాతథైవ
> జ్ఞాతుర్జ్ఞేయావభాసోమతి రితికథితం సంగ్రహాద్ద్రవ్యలక్ష్మ.
>
> (తత్త్వముక్తా, 1-7)

అందు ద్రవ్యము అనేకావస్థలు గలది. సత్త్వరజస్తమో గుణములుగలది ప్రకృతి కాలముఅనఁగా సంవత్సరము ఋతువులు మాసములు మొదలగునవి గలది. అజ్ఞానమునకాధారమైనవాఁడు జీవుడు ఇతరమైన చేతనము స్వరూపముగలవాఁడు ఈశ్వరుడు త్రిగుణములకంటె భిన్నమైన సత్త్వగుణ విశేషముగలది నిత్యవిభూతి, జ్ఞాతయైన జీవునికి జ్ఞేయమైన విషయ ప్రకాశము మతి. ఇది సంగ్రహముగా ద్రవ్యలక్షణమని తెలియఁదగును.

అందుచిత్తు అను పేరతోఁ జెప్పఁబడు జీవాత్మలు పరమాత్మకంటె భిన్నులు నిత్యులును. అట్లు శ్రుతికూడ చెప్పుచున్నది.

"ద్వా సుపర్ణా సయుజా సఖాయాః సమానం వృక్షం పరిషస్వజాతే
తయోరన్యః పిప్పలం స్వాద్వత్తి అనశ్నన్నన్యో అభిచాకశీతి.
(ముండ. 3-1-1. శ్వేతా. 4-4)

సమానమైన ఱెక్కలుగలిగి, సమానగుణములు గలిగిన సఖులు (జీవేశ్వరులు) ఇద్దరుగలరు. వారొక సంసారమనెడి ఒకచెట్టును ఆశ్రయించుకొని యుందురు. వారిలో జీవు డనుపక్షి రుచిగల కర్మఫలమును అనుభవించును. రెండవ పరమేశ్వరుడను పక్షి భుజింపకయే ప్రకాశించును. జీవుడు కర్మఫలము భుజించుచు సుఖదుఃఖములు పొందును సంసారమందు బద్ధుడైయుండును. రెండవ పరమాత్మ ముక్తుడయి యుండును అని యిత్యాదులు శ్రుతులు. కొందఱకు సుఖము, కొందఱకు దుఃఖము కలుగుటవల్ల కొందఱకు బంధము కొందఱకు ముక్తికలుగుచున్న వ్యవస్థనుబట్టి జీవాత్మలు అనేకము (వై. సూ. ౩-2-20 వాని నిత్యస్వరూపముగూడ శ్రుతిప్రసిద్ధమె,

నజాయతే మ్రియతే వా విపశ్చిత్ నాయంభూత్వా
భవితా వా నభూయః, అజో నిత్యః శాశ్వతోఽయం
పురాణో నహన్యతే హన్యమానే శరీరే

(కఠ. 2-18)

ఆత్మపుట్టదు, చావదు. జ్ఞానముగలది. ఇది ఇపుడు ఉండక మరలరేపుపోవునది కాదు. అజము నిత్యము శాశ్వతము. సనాతనము. శరీరము చంపఁబడినను చనిపోవునదికాదు. అని

ఆత్మయే నిత్యముగానిచో శరీరముతో జీవునికి ఉత్పత్తి వినాశములుండునని యంగీకరించుటచేత జీవుడు అనిత్యుడని ఆశ్రయించినపుడైతే కర్మ

చేసి చనిపోయినవానికి ఫలోపభోగము ఉండదు కాన చేసినకర్మకు నాశమును జన్మాంతరములేకపోవుటచే ఇదివరకు చేయనికర్మకుఁ గూడ ఫలప్రాప్తి యగును. సుఖము పుట్టుకతోనే కలుగవలసివచ్చును. వానినేకృతప్రణాశము అకృతాభ్యాగమము అందురు. అవి జీవునికి కలుఁగవలసివచ్చును.

కనుకనే "వీతరాగ జన్మాదర్శనాత్ (న్యా. సూ. 3-1-2.)

అనిచెప్పబడినది. విషయాసక్తి లేనివానికి జన్మమెట్లుగలుగును. అనఁగా జీవుఁడు రాగముక్తుడు గానున్నపుడేపుట్టును. రాగమువల్లనే ఆరాగముతీర్చుకొనుటకు పుట్టును. రాగము ఎందువల్ల కలిగినదనఁగా పూర్వము అనుభవించిన విషయములను స్మరించుటవలననే కలుగును. ఇతరజన్మలలోని వానిని స్మరించుటవల్లనే పూర్వానుభవము కలుగును. అది శరీరములేనపుడు ఎట్లుకలుగును ఈ స్మరణమె పూర్వపునేటి జన్మలను కలుపునది. ఇట్లిపూర్వపూర్వజన్మల సంస్కృతివలన గలుగును గాన జన్మలు జీవులు అనాదులు. చైతన్యము శరీరమును పొందుటయు అనాదియె. రాగమునుఅనాదియె ఆ యాత్మయు అనాదియె అనియు శ్రుతిచెప్పుచున్నది.

వాలాగ్రశతభాగస్య శతధాకల్పితస్య చ
భాగో జీవః సవిజ్ఞేయః సచానంత్యాయకల్పతే
శ్వేతా. 5-9)

వెంట్రుకచివరను నూరుభాగములుగాచేసి ఆ నూరవభాగమును మరల నూరుగా చేయుబడఁగా వచ్చినభాగమంతటి స్వరూపము గలిగి జీవుడుండునని తెలియవలయును. అట్టిజీవుడు అనంతుఁడు" అని.

ఆరాగ్రగమాత్రః పురుషః (శ్వేతా.5-8)

తోత్రమునకుచివర గ్రుచ్చిన ఇనుపయూచనుండి తీయబడిన ప్రమాణమంతటి వాడుజీవుఁడు.

అణుర్హాత్మాచేతసావేదితవ్యః (ముండక. 3-1-9)
ఆత్మను మనసుతోఁ దెలియవలెను ఇత్యాదులందును ప్రసిద్ధము.

అచిత్తు అనఁగా కనిపించు జడజగత్తు భోగ్యము (విషయము) భోగోప కరణము (ఇంద్రియము) భోగాయతనము (శరీరము) అని మూఁడువిధములు. ఆజగత్తుకు ఉపాదానకర్త ఈశ్వరుఁడు. వానినే పురుషోత్తముఁడు వాసుదేవుఁడు మొదలైన నామములచేఁ జెప్పఁదగియుండును. అధికూడ మున్ను చెప్ప బడెను.

వాసుదేవః పరంబ్రహ్మ కళ్యాణగుణ సంయుతః
భువనానాముపాదానం కర్తా జీవనియామకః

కళ్యాణగుణములతోఁ గూడినవాసుదేవుడే పరబ్రహ్మము. అతఁడు భువనములకు ప్రధానకర్త. అతఁడే జీవులను నియమించును" అని.

ఆ వాసుదేవుఁడె పరమకారుణికుడు. భక్తవత్సలుఁడు. పరమపురుషుఁడు అతఁడు తన్ను నుపాసించువారికి వారివారికనుగుణములయిన ఫలము లిచ్చుటకై తనలీలలనుఁబట్టి అర్చన వైభవము, వ్యూహము సూక్ష్మము అంతర్యామి అనునైదు విధములైన భిన్నరూపములతోనుండును. అందు అర్చన అనఁగా గృహము దేవాలయములందు పరమాత్మసూక్ష్మ దివ్య శరీరములందుండి మనుష్యాదులచేత ప్రతిష్ఠింపబడిన ప్రతిమమొదలైనవి మత్స్య కూర్మాదులు రాముఁడు మొదలైన యవతారములు అతనివైభవము వాసుదేవుడు సంకర్షణుఁడు ప్రద్యుమ్నుఁడు అనిరుద్ధుఁడు అని యతని వ్యూహము నాలుగు విధములు. పరమాత్మమె ఉపాసనలకు జగత్సృష్ట్యాదులకు వాసుదేవాది రూపములను బొందును. వాసుదేవుఁడు జ్ఞానైశ్వర్యాది షడ్గుణములు గల వాఁడు. జ్ఞానబలముగలవాఁడు సంకర్షణుఁడు. ఐశ్వర్యవీర్యములు గలవాఁడు ప్రద్యుమ్నుఁడు. శక్తితేజస్సులుగలవాఁడు అనిరుద్ధుఁడు. అందుసంకర్షణుఁడు శాస్త్రములను ప్రవర్తింపజేయును సంహరించునుగూడ. ప్రద్యుమ్నుఁడు ధర్మమునుచేయుచు సృష్టించును. అనిరుద్ధుఁడు తత్త్వముతెలుపుట రక్షణము

భగవంతుని యుపాసనము అభిగమనము, ఉపాదానము ఇజ్యస్వాధ్యాయము యోగము అని అయిదువిధములుగ పాంచరాత్రమునందు చెప్పఁబడినది. అభిగమనమనగా దేవాలయమార్గములను తుడుచుట అలుకుట మొదలైనవి. ఉపాదానమనఁగా గంధపుష్పాదులయిన పూజాసామగ్రిని సంపాదించుట. ఇజ్యఅనఁగా దేవతాపూజ. స్వాధ్యాయమనఁగా అర్థమును అనుసంధించుటతోపాటు మంత్రములను జపించుట; వైష్ణవసూక్తములను స్తోత్రమును పఠించుట, నామసంకీర్తనము తత్త్వమును దెలుపుశాస్త్రముల నభ్యసించుట. యోగమనఁగా దేవతలను అనుసంధానముచేయుట ఇట్లు ఉపాసనాపూర్వకమైన కర్మలతోఁగూడి విజ్ఞానముచేత ద్రష్టయైన జీవుని స్మారకదర్శనములు నష్టమగును. చూచుచు వినుచు మననముచేయుచు ధ్యానించుచు ఉన్న జీవుని చూడక వినక మననముచేయక ధ్యానింపక దర్శనాదికర్మలను చేయని లోపలనున్న జీవునికంటె భిన్నమైన పరమాత్మను చూడవలెను వినవలెను మననముచేయవలెను ధ్యానించవలెను ఇంద్రియములకు అధీనుఁడైన జీవుని ప్రాణములకు బ్రతుకునకు కర్తగాచూడక ఇంద్రియములను జయించు పరమాత్మనె ప్రాణాదికార్యములకు కర్తగాఁ జూడవలయునని శ్రుతులకు తాత్పర్యముగా గ్రహింపవలయును. భగవంతునియందు నిష్ఠగల భగవద్భక్తునికి భక్తవత్సలుఁడు పరమకారుణికుఁడునగు పురుషోత్తముఁడు తనయథార్థమైన యాత్మానుభవమునకనుగుణమైన అవధులులేని యానందరూపమైన పునరావృత్తిలేని తన దివ్యపదవిని ప్రసాదించును. ఇట్లును స్మృతులుగలవు

మామువేత్య పునర్జన్మ దుఃఖాలయమశాశ్వతమ్
నాప్నువంతి మహాత్మానః సంసిద్ధిం పరమాంగతాః. (భగవద్గీత. 8–15)

దుఃఖములకు స్థానమైన శాశ్వతముకాని పునర్జన్మను నన్ను పొందినపుడు వారు పరమసంసిద్ధిని పొందిని మహాత్ములు పొందరు.

స్వభక్తం వాసుదేవోపి సంప్రాప్యానంద మక్షయమ్
పునరావృత్తి రహితం స్వీయంధామప్రయచ్ఛతి.

వాసుదేవుడును తనభక్తుని పొంది అనంతరూపమైన అక్షయమైన పునరావృత్తిలేని తనధామమును ప్రసాదించును. అని.

భగవంతుని యుపాసనము అభిగమనము, ఉపాదానము ఇజ్యస్వాధ్యాయము యోగము అని అయిదువిధములుగ పాంచరాత్రమునందు చెప్పఁబడినది. అభిగమనమనఁగా దేవాలయమార్గములను తుడుచుట అలుకుట మొదలైనవి. ఉపాదానమనఁగా గంధపుష్పాదులయిన పూజాసామగ్రిని సంపాదించుట. ఇజ్యఅనఁగా దేవతాపూజ. స్వాధ్యాయమనఁగా అర్థమును అనుసంధించుటతోపాటు మంత్రములను జపించుట; వైష్ణవసూక్తములను స్తోత్రమును పఠించుట, నామసంకీర్తనము తత్త్వమును దెలుపుశాస్త్రముల నభ్యసించుట. యోగమనఁగా దేవతలను అనుసంధానముచేయుట ఇట్లు ఉపాసనాపూర్వకమైన కర్మలతోఁగూడి విజ్ఞానముచేత ద్రష్టయైన జీవుని స్మారకదర్శనములు నష్టమగును. చూచుచు వినుచు మననముచేయుచు ధ్యానించుచు ఉన్న జీవుని చూడక వినక మననముచేయక ధ్యానింపక దర్శనాదికర్మలను చేయని లోపలనున్న జీవునికంటె భిన్నమైన పరమాత్మను చూడవలెను వినవలెను మననముచేయవలెను ధ్యానించవలెను ఇంద్రియములకు అధీనుఁడైన జీవుని ప్రాణములకు బ్రతుకునకు కర్తగాచూడక ఇంద్రియములను జయించు పరమాత్మనె ప్రాణాదికార్యములకు కర్తగాఁ జూడవలయునని శ్రుతులకు తాత్పర్యముగా గ్రహింపవలయును. భగవంతునియందు నిష్ఠగల భగవద్భక్తునికి భక్తవత్సలుఁడు పరమకారుణికుఁడునగు పురుషోత్తముఁడు తన యథార్థమైన యాత్మానుభవమునకనుగుణమైన అవధులులేని యానందరూపమైన పునరావృత్తిలేని తన దివ్యపదవిని ప్రసాదించును. ఇట్లును స్మృతులుగలవు

మాముపేత్య పునర్జన్మ దుఃఖాలయమశాశ్వతమ్
నాప్నువంతి మహాత్మానః సంసిద్ధిం పరమాంగతాః. (భగవద్గీత. 8–15)

దుఃఖములకు స్థానమైన శాశ్వతముకాని పునర్జన్మను నన్ను పొందినపుడు వారు పరమసంసిద్ధిని పొందిని మహాత్ములు పొందరు.

స్వభక్తం వాసుదేవోపి సంప్రాప్యానంద మక్షయమ్
పునరావృత్తి రహితం స్వీయంధామప్రయచ్ఛతి.

వాసుదేవుడును తనభక్తుని పొంది అనంతరూపమైన అక్షయమైన పునరావృత్తిలేని తనధామమును ప్రసాదించును. అని.

ఇదియంతయు హృదయమందుంచికొని మహోపనిషన్మతమును అవలంబించి భగవంతుడైన బోధాయనునిచే రచింపఁబడిన విస్తీర్ణమైన బ్రహ్మసూత్ర వృత్తిని దృష్టియందుంచుకొని రామానుజుడు శారీరకమీమాంసాభాష్యమును చేసెను. అందు "అథాతోబ్రహ్మజిజ్ఞాసా (బ్ర. సూ. 1–1–1) అను మొదటి సూత్రమునకిట్లు అర్థముచెప్పఁబడినది. 'అథ' అనుశబ్దమునకు ఇదివఱకు తెలిసికొనినదాని తరువాత అని 'అనంతరము' అర్థము. వృత్తికారుఁడును ఇదివఱకు తెలిసికొన్నదానితరువాత బ్రహ్మమును దెలిసికొనఁగోరుచున్నాడు" అనియర్థము చెప్పెను. ఇంక అతః అనునానికి హేతువు అర్థము. వేదవేదాంగములు చదివి వానియర్థము తెలిసినవానికి, నశించు ఫలముగల కర్మనుండి విరక్తుఁడయిన కారణముచేత స్థిరమైన మోక్షమందు అభిలాషగలుగును పిదప ఆమోక్షమునకు ఉపాయమైన బ్రహ్మమును దెలిసికొనవలెనని జిజ్ఞాసకలుగును. బ్రహ్మశబ్దముచేత స్వభావముగా సమస్తదోషములు లేక హద్దులులేనివియు గొప్పవియు లెక్కలేనివియునగు కళ్యాణగుణములుగల పురుషోత్తముఁడు చెప్పఁబడుచున్నాడు. కనుక కర్మజ్ఞానమును కర్మానుష్ఠానమును వైరాగ్యమును పుట్టించుటద్వారా చిత్తకల్మములను పోగొట్టును. కాన వానిద్వారా బ్రహ్మజ్ఞానమునుగూర్చి అవి సాధనములుగాన అవి కార్యకారణములుగా పూర్వమీమాంసోత్తర మీమాంసలు పురుషోత్తమ ప్రతిపాదకమైన యొకే శాస్త్రమగును. పూర్వమీమాంసచేతఁ దెలుపఁబడిన కర్మజ్ఞానము కారణము ఉత్తర మీమాంసచేత దెలుపఁబడిన బ్రహ్మజ్ఞానము కార్యములు రెండిటి సమన్వయము సిద్ధించుచున్నది. జైమినిచెప్పిన ద్వాదశాధ్యాయములు నాలుగు అధ్యాయములుగా నున్న సంకర్షణమును గలిసి పదునాఱు అధ్యాయములు గలదగుచున్నదనియందురు.

కర్మఫలము నశించినదియని బ్రహ్మజ్ఞానఫలము అక్షయమని పరీక్షించి కర్మఫలము క్షయమొందునని నిశ్చయించి అనుమానార్థ సక్తులచే వివరింపఁబడిన "నిత్యమగుపరమాత్మ అనిత్యకర్మచే లభింపదని తెలిసికొని వేదవేదాంగములు చదివినవాఁడు వైరాగ్యముపొంది గురువును ఆశ్రయింపవలెను. ఇత్యా

చిత్రుతులచేత ప్రతిపాదింపఁబడెను కేవలకర్మను, కేవలజ్ఞానమును ఒక్కొకని కి నందించి కర్మవిశుద్ధజ్ఞానము మోక్షమునకు సాధనమగునని శ్రుతిచూపుచున్నది.

అంధః తమః ప్రవిశంతి యేఽవిద్యాముపాసతే
తతోభూయ ఇవతేతమో య ఉవిద్యాయాంరతాః
(బృ. 4-4-10 ఈశావాన.9)

ఎవరు అవిద్యను కేవలకర్మను ఉపాసించుచున్నారో వారు అంధకారభూయిష్ఠమైన యజ్ఞానమును నరకమునుగాని ప్రవేశింతురు. ఎవరుస్వవిహితకర్మనువిడిచి కేవలవిద్యను ఉపాసింతురో వారింకను అంధకారమును ప్రవేశింతురు.

విద్యాంచా విద్యాంచయ స్తద్వేదోభయంసహ
అవిద్యయామృత్యుంతీర్త్వా, విద్యయాఽమృతమశ్నుతే (ఈశ. 11)
ఎవరు బ్రహ్మోపాసన రూపవిద్యను కర్మను ఉభయమును ఉపాసింతురో వారు కర్మచే మృత్యువుదాటి బ్రహ్మోపాసనచే అమృతముపొందుదురు. అది పాంచరాత్ర రహస్యమందిట్లు చెప్పబడినది.

స ఏవకరుణాసింధుర్భ గవాన్భక్తవత్సలః
ఉపాసకానురోధే న భజతే మూర్తిపంచకమ్
భక్తవత్సలుఁడును కరుణాసముద్రుఁడునగు నాపరమాత్మయే ఉపాసకులనుబట్టి అయిదురూపములను పొందుచున్నాఁడు.

తదర్చా విభవవ్యూహ సూక్ష్మాంతర్యామి సంజ్ఞకమ్
యదాశ్రిత్యైవ చిద్వర్గస్తత్తజ్ జ్ఞేయం ప్రపద్యతే
1. అర్చ 2 విభవము 3 వ్యూహము 4 సూక్ష్మము 5 అంతర్యామి అను ఐదు పేర్లను ఆశ్రయించియె చిద్వర్గము అజ్ఞేయమును పొందును.
పూర్వ పూర్వోత్తరమూర్తీనా ముపాస్త్యధికృతోభవేత్
ఏవం హ్యుపరహః శ్రౌతస్మార్త ధర్మానుసారతః

ఉక్తోపాస ా పుంసాం వాసుదేవః ప్రసీదతి
ప్రసన్నాత్మా హరిర్భక్త్యా నిదిధ్యాసనరూపమా
అవిద్యాం కర్మసంఘాత రూపాంసద్యోనివర్తయేత్

ఇదివరలో చెప్పబడిన యుపాసనచేత వాసుదేవుడు ప్రసన్నుడగును. ప్రసన్నుడైన నిదిధ్యాసనరూపమైన భక్తిచే కర్మ సంఘమమైన అవిద్యను వెంటనే పోగొట్టును.

తతఃస్వాభావికాః పుంసాంతే సంస్కారతిరోహితాః
ఆవిర్భవంతి కళ్యాణాః సర్వజ్ఞత్వాదయోగుణాః

పిదప సంస్కారముచే కనిపించని సర్వజ్ఞత్వాదులైన స్వభావ సిద్ధ కళ్యాణ గుణములు ఆవిర్భవించును.

ఏవంగుణాః సమానాః స్యుర్ముక్తానా మీశ్వరస్యచ
సర్వకర్తృత్వ మేవైకం తేభ్యోదేవే విశిష్యతే,

ముక్తులకు ఈశ్వరునికిని ఇట్టి గుణములు సమానములే. ముక్తుల కంటె దేవునియందు సర్వ కర్తృత్వమొకటి విశేషముగా నుండును.

ముక్తాస్తుశేషిణి (అంగిని) బ్రహ్మణ్యశేషి (అనంగే) శేషరూపిణః
సర్వానశ్నుతే కామాన్ సహతేన విపశ్చితా ఇతి

ముక్తులైతే సర్వాంగములు గల అంగములులేని బ్రహ్మమందు అంగ రూపులవుదురు. ముక్తుడు ఆ విజ్ఞానితోపాటు అన్ని కామములను పొందును.

కనుక తాపత్రయములచే బాధపడువారు మోక్షము పొందుటకు పురుషోత్తముడని తెలియదగిన బ్రహ్మమును తెలిసికొనఁగోరవలయునని చెప్పినట్లగుచున్నది. తెలిసికొనఁగోరుట యనఁగా తెలిసికొనఁగోరవలసినది విధేయమయినది ఇట జ్ఞానమె, కాని జ్ఞానవిషయకమైన కోరికయని చెప్పరాదు జిజ్ఞాస అను పదములోని ఇచ్ఛార్థకసన్ ప్రత్యయమునకు వ్యాకరణనియమము ప్రకా

రము చెప్పవలయును. ఆ జ్ఞానమును ధ్యానోపాసనాది శబ్దములచే జెప్పఁదగిన వేదనమె యనుభవముకాని వాక్యమువల్లఁ గలిగిన పైపై మిడిమిడి జ్ఞానము కాదు. వాక్యము విన్నపిదప వ్యుత్పత్తిగలవానికి విధానము లేకుండ గూడ మిడిమిడిజ్ఞానము కలుగును.

ఆత్మావా అరే ద్రష్టవ్యః శ్రోతవ్యో మంతవ్యో

నిధిధ్యాసితవ్యః (బృ 2-4 5) ఓసీ! ఆత్మ తెలిసికొనదగినది వినదగినది మనన ముచేయదగినది ధ్యానముచేయుదగినది ఆత్మేత్యేనముపాసీత (బృ. -4-7) ఆత్మలనియె ఉపాసింపుడు. విజ్ఞాయ ప్రజ్ఞాంకురీవత (బృ. 4-4-2) తెలిసికొని ప్రజ్ఞనుజేయుడు. అను విద్య విజ్ఞానాతి (బృ 8-7-1-) శ్రవణమనన ములచేత తెలిసికొని జ్ఞానముపొందవలెను." మొదలగు శ్రుతులనుబట్టి ధ్యానోపాస నాదులచేతఁ గలిగినజ్ఞానమె యర్థము ఇక్కడ శ్రోతవ్యము అను నది అనువాదము. స్వాధ్యాయోఽధ్యేతవ్యః" అను నధ్యయన విధిచేత అంగములతోగూడిన సాధ్యాయమునే గ్రహింపడు వేదముచదివిన పురుషునికి ప్రయోజనముగల యర్థమె అని తెలియుటవల్లన దాని నిర్ణయమునకై స్వరముగానె గురుముఖమునుండి గలిగి శ్రవణమందె ప్రవర్తించుచుండుట చేత అది ప్రాప్తించుచున్నవి. మంతవ్యము అనునదియును అనువాదమె. శ్రవణమునందు నిష్ఠగలిగినపిదప గలుగునది మననమె, ప్రాప్తింపనిదానిని తెలుపునదిగాన శాస్త్రము సార్థకము. ధ్యానమనఁగా తైలధారవలె ఎడతెగని స్మరణప్రవాహమె స్మృతిర్ధ్రువమై ఆస్మృతి గలుగఁగా సర్వబంధములు విడిపోవుట సిద్ధించును కనుక స్మృతివలననె ఆపరమాత్మ ధ్యానమువలన మోక్షముగలుగుచున్నది. ఆస్మృతియు ప్రత్యక్ష దర్శనములతో సమానమయినది

భిద్యతే హృదయగ్రంథిశ్ఛిద్యంతే సర్వసంశయాః
క్షీయంతే చాస్యకర్మాణి తస్మిన్దృష్టే పరావరే.

(ముం. 2-2. 8)

"పరమాత్మను జూచినపుడు జీవుని హృదయబంధనము భిన్నమగును సర్వసంశయములు విచ్ఛిన్నమగును ఇతని పాపపుణ్య కర్మలు నశించిపోవును."

కనుక "ఆత్మావా అరే ద్రష్టవ్యః (బృ. 2-4-5) ఓసీ! ఆత్మయె చూడఁదగినది" అనుదానిచే ఆస్మృతి ప్రత్యక్షదర్శనరూపమైనది. వేదనమనఁగా ఉపాసనయేయని వాక్యకారుఁడు ప్రపంచించెను. అధ్యానమునే శ్రుతివిశేషించి చెప్పుచున్నది.

నాయమాత్మా ప్రవచనేన లభ్యో నమేధయాన బహునా శ్రుతేన
యమేవైష వృణుతే తేనలభ్యస్తస్యైష ఆత్మావివృణుతే తనూంస్వాం
(కఠ. 2 23)

ఈయాత్మ ప్రవచనముచేగాని మననముచేతగాని మేధచేఁగాని యెక్కువ శాస్త్రము చదువులచే గాని లభింపదు. ఈపరమాత్మ ఏ గొప్ప యుపాసకుని వరించునో వానికే ఈయాత్మ తన్నుఁ బ్రకాశింపఁజేయును" ప్రియతముఁడే వరింపఁదగినవాఁడగును ఎట్లు ఈప్రియతముఁడు తన్నుఁబొందుమ అట్లు ఈ భగవంతుఁడు స్వయముగనే ప్రయత్నించునని భగవంతుఁడె చెప్పెను.

తేషాం సతతయుక్తానాం భజతాంప్రీతి పూర్వకమ్
దదామిబుద్ధియోగంతం యేనమా ముపయాంతితే
[భగ. 10- 0]

ప్రీతిపూర్వకముగా సేవించుచు సంతతము యుక్తులైనవారికి నన్నువారు పొందునట్లు అట్టిబుద్ధిని ఇచ్చెదను." అని.

పురుషః సపరః పార్థ! భక్త్యాలభ్యస్త్వ నన్యయా
[భగ. 8-22]

అనన్యభక్తిచేతనే ఆపరమాత్మ దగినవాఁడు భక్తియైతే నిరతిశయానందరూపమై ఇతర ప్రయోజనములేక ఇతరమైన సర్వమందు వైరాగ్యము గలిగిన జ్ఞాన విశేషమైనది. వివేకాదులవల్ల జ్ఞానముసిద్ధించునని వాక్యకారుడును చెప్పెను

"తల్లబ్ధిర్వివేక, విమో కాభ్యాస క్రియా కళ్యాణా
నవసా దానుద్ధర్షేభ్యః సంభవాత్ నిర్వచనాచ్చ ఇతి

వివేకము విమోకము అభ్యాసము క్రియ కళ్యాణములు అనవసాదము అనుద్ధర్ష ము లనునవి సంభవించుటవల్ల నిర్వచనమువల్ల ఆ జ్ఞానము సిద్ధించును. అందులో వివేకమనఁగా దోషములేని యాహారమువల్ల సత్త్వము సిద్ధించుట. ఇందు నిర్వచనము ఆహారశుద్ధివల్ల సత్త్వశుద్ధియు సత్త్వశుద్ధిచేత ధ్రువమైన స్మృతియుఁగలుగును. విమోకమనఁగా కామముచే మనోవికారము గలుగక పోవుట. శాంతముగా ఉపాసింపవలెనన్నది నిర్వచనము. మాటిమాటికి చింతించు అభ్యాసము ఇందులోనిర్వచనము భాష్యకారుడు స్మృతిసంబంధించినదె ఉదాహరింపఁబడినది" సదాసద్భావ భావితః (గీ 8-) ఎల్లపుడు ఆ పర మేశ్వరభావముచే భావింపఁబడినది. క్రియయనఁగా శక్తికొలది శ్రౌతస్మార్త కర్మలను జేయుట. ఆచరించు నితఁడు బ్రహ్మవేత్తలలో శ్రేష్ఠుడు అన్నది నిర్వచనము అనవసాదమనఁగా దైన్యములేకుండుట, నాయమాత్మ బలహీనే దలభ్యః [ముం. 3-2-4] ఈయాత్మ బల హీనునికి లభ్యముకాదు అన్నది నిర్వచనము. దేశకాలములఁబట్టి ప్రియవస్తుస్మృతిచే గలుగు మనశ్శైథిల్యము తగ్గి అదిలేకపోవు అనుద్ధర్షము. శాంతుడై దాంతుడునై యుండవలయు నన్నది నిర్వచనము.

ఈ విధముగా నిటువంటి నియమవిశేషముల నిట్లు పొందఁబడిన పురుషోత్తముని ప్రసాదముచేతఁ దమస్సుపోయిన మనస్సుగలవానికి పరమాత్మ కంటె నితరప్రయోజనములేని అనవరతమైన నిరతిశయ ప్రియముచేత నిర్మలమైన ఆత్మజ్ఞానముచే ప్రకాశించిన ధ్యానరూపముగా గల భక్తిచేత పురుషోత్తమపదవి పొందఁబడునన్నదని సిద్ధించినది. అది యామునాచార్యునిచే నిట్లు చెప్పఁబడినది. "ఉభయపరికర్మితస్వాంతస్య ఐకాంతికాంత్యంతిక భక్తియోగోలభ్యః". జ్ఞానకర్మలచే సంస్కరింపఁబడిన యంతఃకరణము గలయుపాసకునికి అవశ్యంభావియు అవినాశియునగు భక్తియోగము లభ్యమగును. అది "ఎటువంటిబ్రహ్మము తెలిసికొనఁదగినది అని ఆపేక్షింపఁబడినపుడు దానికి "జన్మాద్యస్యయతః" [బ్రహ్మ 1-1-2] ఈప్రపంచమునకు దేనివల్లజన్మ స్థితి లయములు గలుగును అదియె బ్రహ్మము" అని లక్షణము చెప్పఁబడినది.

అచింత్యమైన వివిధ విచిత్రరచనలుగలిగి, ఇంతప్రదేశము ఇంతకాలము ఇంతఫలానుభవము అను నియమము గల్గిన చీమ మొదలు బ్రహ్మపర్యంతము గల జీవులతోఁ గలసియున్న జగత్తు, నిఖిలత్యాజ్య విషయములులేని స్వరూపముగలిగి, సత్యసంకల్పము మొదలయిన హద్దులేని గొప్పవైన లెక్కలేని కళ్యాణగుణములు గలిగి సర్వజ్ఞుఁడై సర్వశక్తులుగలిగి సర్వేశ్వరుఁడైన పరమపురుషునుండి సృష్టిస్థితి ప్రళయములు ప్రవర్తించున్న ట్టివాఁడె బ్రహ్మము అని పై సూత్రమునకర్థము.

ఇటువంటి బ్రహ్మకుఁ బ్రమాణమేమి అను జిజ్ఞాసకు శాస్త్రమే ప్రమాణము అని శాస్త్రయోనిత్వాత్ [బ్ర. సూ. 1-1-3] శాస్త్రముచెప్పుచున్నది. కాన బ్రహ్మ సృష్టిస్థితిలయములకు కారణము అని చెప్పుచున్నది. బ్రహ్మకు శాస్త్రమె ప్రమాణము. ఇంకొకప్రమాణముచే గమ్యమగునా? అని శంకింపరాదు. ఏలయన బ్రహ్మము అతీంద్రియముగాన అందు ప్రత్యక్ష ప్రమాణము ప్రవర్తింపదు మహాసముద్రాదులు కర్తకలవి అవి కార్యములుగనుక, ఘటమువలె అను ననుమానముకూడ ప్రమాణముగాదు. ఏలయన ఆయనుమానము కుళ్ళుగుమ్మడికాయ వలె దూరముగాఁ బారవేయఁదగినదే. పైని చెప్పిన యనుమానోదాహరణము సరియైనదికాదు, సముద్రములను పర్వతాదులను ఎవరును చేసినట్లు తెలియుటలేదు. ఎక్కడ కార్యత్వముండునో అక్కడ శక్యమైన వ్యాపారము అనఁగా చేయగలిగియుండుట అన్నదుండవలెను. అది ఘటమనెడి సాధింపఁదగిన వస్తువునందు వ్యాపించియున్నది అవయవములుగలది కార్యమె. కాని ఎక్కడ అవయవములు గలిగియుండును అక్కడ చేయుటకు శక్యమైన వ్యాపారము గలిగియుండుట అన్నది నియమముగానుండదు పోనీ సముద్రములు పర్వతములు కార్యములు అని యంగీకరించినచో అవి యొక్కడే చేసినట్లు ప్రమాణములేదు. అందుచే వానిని ఈశ్వరుడొక్కఁడే చేసెనని చెప్పుటయెట్లు? కాని పర్వతాదులను గలిగించుటలో జీవులకుశక్తి లేదనరాదు. పుణ్యవిశేషముగల దేవతలకు విచిత్రశక్తులున్నట్లు కన్పించుటవల్ల పై వాక్యము సరికాదు. సరేపోనీ ఈశ్వరుఁడు జగత్తును నిర్మించెనన్నపుడు ఆ ఈశ్వరునికి శరీరమని యొకటున్నదా? లేదా? శరీరమున్నదన్నచో అది నశించిపోవలసివచ్చును. శరీరములేదన్నచో అదికర్త యెట్లగును? శరీరమున్నచో అదినిత్యమా? అనిత్యమా? అవయవములుగల శరీరము నిత్యమన్నచో అవయవములుగల జగత్తుకూడ నిత్యముకావలసి

వచ్చును. పోనీ జగత్తునిత్యమన్నచో బాధకములేదు గాన కార్యత్వమును సిద్ధింపదు దానినిబట్టి ఈశ్వరుఁడును సిద్ధింపఁడు. పోనీ జగత్తు అనిత్యమన్నచో అది ఎవనిచే నిర్మింపఁబడినది స్వయముగనె నిర్మితమైనదన్నచో శరీరము లేనిదనినపట్ల నిర్మాణము కుదరదుగదా. శరీరములేనపుడు జగత్తును సృజింప శక్తిగల వ్యాపారము సంభవింపదు. వ్యాపారములేనపుడు అదికర్త యనిచెప్పుట యెట్లు అందుచే అనుమానాలు ప్రమాణముగావు. శాస్త్రమె ప్రమాణము అని ఈ క్రింది శ్రుతితెలుపుచున్నది.

యతోవా ఇమాని భూతాని (తై, 2-1-1)

ఆలోచింపఁగా బ్రహ్మము శాస్త్రముకంటె నితరమైనదానివల్ల సిద్ధింపదు. అయినను సుఖ ప్రవృత్తికిని దుఃఖనివృత్తికిని ఉపయోగింపని బ్రహ్మమును ప్రతిపాదింపఁ జేయుటకు శాస్త్రము సమర్థముఁగాదను పశ్నను సహకరింపఁ జేయుట "తత్తుసమన్వయాత్" బ్రహ్మము పరమపురుషార్థమని తెలుపుటకుఁగా శాస్త్రము సమన్వయించుటవల్ల ఆ బహ్మము సృష్టిస్థితిలయ కర్తయని సిద్ధించుచునది" అని సుఖప్రవృత్తి దుఃఖనివృత్తులకు బ్రహ్మము ఉపయోగింపదుగదా అన్నచో సుఖప్రవృత్తిని దుఃఖనివృత్తిని గూర్చిని "నీకుఁబుత్రుడు కలిగెను. ఇది సర్పముగాదు" ఇత్యాది వాక్యములలో నీకు పుత్రుడుగలిగెనన్న దాన్నిబట్టి సంతోషమును ఇదిపాముకాదు అనువానినిబట్టి దుఃఖనివృత్తియు అను ప్రయోజనములు గలుగుట లోకమునఁ గనిపించుచున్నదేగదా. కనుక ఇట్లుఅనుటలో అనుపపన్నమైనది ఏదియులేదు ఇటనిది దిఙ్మాత్రముగ చూపఁబడినది. విస్తరమైతే రామానుజాచార్య యోగమునుండి తెలియఁదగును.

విస్తరభీతిచే అదియంతయుఁ బ్రస్తావింపఁబడుటలేదు. కనుక సర్వము అనుకూలమైనది.

ఇది

శ్రీ చర్ల వెంకమనారాయణశాస్త్రి దంపతుల పుత్రుడగు
చర్ల గణపతిచే తెనిగింపబడిన సాయణమాధవీయమగు
సర్వదర్శన సంగ్రహమున రామానుజ దర్శనము.

– ౦ –

## మధ్వాచార్యులు

మధ్వమతము వైష్ణవ సంప్రదాయములోనిదే. శంకరమతము శుద్ధాద్వైతమును బోధింపఁగా రామానుజము చిదచిద్విశిష్టమునకు అద్వైతమును బోధించుచున్నది. జీవులు అణువులు, జీవులు భగవద్దాసులు మొదలగు విషయములలో జీవులు జీవులుగానున్నపుడు లేరనియు ప్రళయకాలములో అద్వైతస్థితిని పొందుదురనియు రామానుజుని భావము. ఒకసారి దాసులై భిన్నులై యుందురనియు ఇంకొకసారి అభిన్నులై యుందురనుటయెట్లు ఇది పరస్పరము విరుద్ధముగా నున్నదని భావించి మధ్వాచార్యులు ద్వైతమతమును బోధించెను. ఇది సద్వైష్ణవ మతమనఁబడెను. అప్పుడు జీవుడు పరమేశ్వరుడును భిన్నులుగాన జీవుని ప్రార్థనయు, దేవుని వరదానాదులును యుక్తములగునని ద్వైతమతభావము. ఈద్వైతమతమును స్థాపించినవాడు మధ్వాచార్యులు.

ఈ మధ్వాచార్యునికి ఆనందతీర్థుఁడనియు, పూర్ణప్రజ్ఞుఁడనియు నామాంతరములు గలవు. తండ్రిపెట్టినపేరు మాత్రము వాసుదేవుఁడని. ఇతఁడు క్రీ. శ. 1239 (1199 అనికొందఱు) సంవత్సరమునఁబుట్టెను. తల్లిపేరు వేదవతి తండ్రిపేరు మధ్వగేహభట్టు. ఇతఁడు పుట్టుకచేత తుళుబ్రాహ్మణుఁడు. ఇతఁడు పుట్టినగ్రామము వేలాలికి దగ్గరనున్న ఉడిపిగ్రామము. ఇతఁడు చిన్నతనములో శారీరకపరిశ్రమ చేయువాఁడు. కుస్తీపట్టుట, పరుగులెత్తుట, దూకుట, ఈదుట మొదలగువానిలోను నేర్పరియగుటచేత ఇతనిని భీముఁడనికూడ పిలుచువారు. ఇతఁడు వేదవేదాంగములను జదివెను. అనంతేశ్వర మఠములో ఇతడు శంకరమతముననుసరించి సనకవంశజాతుడైన అచ్యుతప్రకాశుఁడను గురువుదగ్గర ఇరువదియైదవయేట సంన్యాసదీక్ష గ్రహించెను. అపుడతనికి పూర్ణ ప్రజ్ఞుఁడను నామముగలిగెను. ఇతనితెలివికి మెచ్చుకొని అతడు ఆమఠమునకు ప్రధానునిజేసెను. అపుడు అతడు ఆనంద తీర్థుఁడని పిలువబడెను.

అతఁడు శంకరుడు రామానుజుడు మొదలైన ధర్మాచార్యుల సిద్ధాంతములను మననముచేసెను. అతనికి ఆ శంకరుని అద్వైతముగాని, రామానుజుని త్రితత్త్వములతోగూడిన శ్రీసంప్రదాయముగాని నచ్చలేదు. అతఁడు సంన్యాసధర్మమును బోధింపక లోకరుచికి అనుకూలమైన ద్వైతతత్త్వమును బోధించెను. భగవంతునిమీదగల భక్తిని ప్రచారముచేయుటకై దక్షిణదేశమున ఉత్తరహిందూస్థానమున సంచారముచేసెను. బదరీనారాయణకు వెళ్ళివచ్చెను తిరిగివచ్చిదపిదప భగవద్గీతపైని వేదాంతసూత్రములపైని భాష్యమురచించెను. మధ్వమతమునకు కేంద్రమయిన యుడిపిలో చాల దేవాలయములను నిర్మింపఁజేసెను.

ద్వైతమతమును స్థాపించుటకితఁడె యాధారము. ఇతనివైష్ణవమతము సద్వైష్ణవ మతమనఁబడెను. రామానుజుని వైష్ణవమతము మధ్వాచార్యునిది సద్వైష్ణవమతము. ఇతఁడు విష్ణువునె సర్వజన్నియంతగా భావించెను. ఇతడు తన యుద్దేశమునకనుకూలముగా కొన్ని యుపనిషత్తులను ఇతరగ్రంథములను ప్రమాణముగాఁ జూపెను.

"ఏకోనారాయణ ఆసీత్. న బ్రహ్మనచశంకరః
ఆనంద ఏకఏవాగ్ర ఆసీన్నారాయణః ప్రభుః
విష్ణోర్దేహా జ్జగత్ సర్వమావిరాసీత్"

ఒకనారాయణుఁడే యుండెను. బ్రహ్మయు శంకరుఁడును లేరు మొదట ఆనందరూపుఁడైన ప్రభువైన నారాయణుఁడె యుండెను. అతఁడెవిష్ణువు ఆవిష్ణుని దేహమునుండి సర్వజగత్తును ఆవిర్భవమయ్యెను". అని యుండెను. ఇతని మతమునుబట్టి విష్ణువు రక్షించువాఁడును శిక్షించువాఁడును నగును. విష్ణువు అనఁగా బరమాత్మయు జీవాత్మయు ఒకటిగావు. పక్షియు దానికికట్టినత్రాడును నానావృక్షములు వానిరసములును, నదులును సముద్రములును, శుద్ధమైననావ ఉప్పునీరును, దొంగయు దొంగిలింపఁదగినదియు, పురుషుడును వానియింద్రియములును భిన్నములైనట్లే జీవేశ్వరులు భిన్నులు విలక్షణులు అని అతనిభావము.

"పరమాత్మ స్వతంత్రుడు జీవాత్మ అస్వతంత్రుడు. జీవుఁడు విష్ణుని దాసుఁడు. విష్ణువు నిర్దోషుఁడు సద్గుణస్వరూపుఁడు. జీవుఁడు పరమాత్మతో నెప్పటికిని సామ్యము పొందలేఁడు. అన్ని విధముల పరమాత్మ పూజనీయుఁడు" అని మధ్వాచార్యుల యభిప్రాయము. జీవాత్మ పరమాత్మలో లయముపొందుటను మధ్వాచార్యులు అంగీకరింపరు. సూర్యుని ప్రకాశములో దీపములకాంతి కనిపింపనట్లు పరమాత్మ చైతన్యముదగ్గర జీవుని చైతన్యము కనిపింపదు. పైకి రెండును ఒకరూపముపొందినట్లు కనఁబడును" అనిఅనును.

విష్ణువు వైకుంఠధామములో లక్ష్మి, భూమి లీలఅనుపత్నులతోనుండును. అతఁడు మాయతో సంపర్కమును పొందినపుడు సత్త్వరజస్తమో రూపుఁడై బ్రహ్మ విష్ణు శివరూపములతో విహరించి సృష్టిచేయునని అతని భావము. విష్ణువుయొక్క యుత్కృష్టగుణముల జ్ఞానము అయినపుడే జీవునికి విష్ణుని ప్రసాదము మోక్షములభించును. కాని పరమాత్మల జీవాత్మల అభేదము తెలిసినపుడు కాదు అతని యాశయము.

అతఁడు ఉడిపిలోనె యుండి సూత్రభాష్యము ఋగ్భాష్యదశోపనిషద్భాష్యములు భారతతాత్పర్యనిర్ణయము. గీతాతాత్పర్యము భాగవతతాత్పర్యములు మొదలయిన గ్రంథములనురచించెను; పిదపదేశసంచారముచేసి నిరీశ్వవాదుల మతములను ఖండించి తనమతమును ప్రచారముచేసెను. ఉడిపి మొదలైన చోట్ల ఎనిమిది మందిరములను గట్టించి సీతారాములు లక్ష్మణుడు కాళీయమర్దనుడు నృసింహుడు మొదలగు విగ్రహములను ప్రతిష్ఠింపజేసెను. ఈమందిరములనేగాక కొన్ని మఠములను స్థాపింప పద్మనాభతీర్థుడను సంన్యాసికిఅధికారమిచ్చెను. ఆమఠములలో విష్ణువుయొక్క రామునియొక్క మూర్తి అనునిలిపెను. మధ్వాచార్యమతసంన్యాసులు ఇతరసంన్యాసులవలెనే వేషమును ధరింతురు. వీరికి శివకేశవుల ద్వేషములేదు. మధ్వాచార్యులు మొదట శైవసంప్రదాయములోనివాడైనను శివకేశవులను పూజించి శైవవైష్ణవమతములకు సామరస్యమును గూర్చెను.

భగవంతుని స్మరించెడి యలవాటు చేసికొన్నచో మృత్యుసమయములో అతనిని జ్ఞాపకముంచుకొనుట సులభమగును. త్యాగముభక్తి ధ్యానముల ద్వారా మోక్షముగలుగును అవి యతనిభావము.

మధ్వసంప్రదాయములోని ఉపాసన మూడువిధములు. 1 అంకనము (విష్ణువుయొక్క శంఖచక్రగదాది పద్మాదులను శరీరముపై ముద్రించుకొనుట) 2 నామకరణము (విష్ణ్వాది దేవతానామములను తనసంతానములకుంచుట) 3 భజన (కాయిక వాచిక మానస రూప త్రివిధ భజనలు చేయుట) దయ స్పృహశ్రద్ధ అనునవి మానసికభజనలు. సత్యవచనము హితవచనము ప్రియ భాషణము శాస్త్రానుశీలనము అనునవి వాచికభజనలు. దానము పరిత్రాణము పరిరక్షణము ఇవి కాయికభజనము.

ప్రస్తుతమున దేశములోని దేవాలయములు మూర్తిపూజ దేవతోత్స వములు మొదలయిన వన్నియు ఈసంప్రదాయమునకు చెందినవే యన వలయును.

## పూర్ణప్రజ్ఞ దర్శనము

జీవాత్మ అణువు, అది మధ్యమపరిమాణముకాదు. వ్యాపకముకాదు. ఆ జీవాత్మ మోక్షముపొందినను పరమాత్మకు దాసుడె. వేదములు అపౌరషేయ ములు నిత్యము. అవి సిద్ధమైన బ్రహ్మమును బోధించినను ప్రమాణములె. వానికవే ప్రమాణములు. వానికితరమైన నానివల్ల ప్రామాణ్యములేదు. ప్రత్యక్షముఅనుమానము శబ్దముఅను ప్రమాణములు పాంచరాత్రమును అను సరించినవె. ఈ ఆకాశాదిప్రపంచము ఆత్మకంటె భిన్నము సత్యమును. అను విషయములు రామానుజ మతమునకును మాకును సమ్మతములె. అయినను విరుద్ధములయిన ఆత్మతత్త్వము భిన్నము అభిన్నము ఉభయముఅని పరస్ప రము విరుద్ధముగా - జైనులు ఉన్నది లేనిది, ఉన్నది లేనిది .అనిచెప్పినట్లు చెప్పుటచేత ఈరామానుజమతము ఉపేక్షింపదగినదే అనిచెప్పి "స ఆత్మా2

తత్త్వమసి (ఛాందా 6-8-71 అయాత్మనీవై వేరుగయున్నావు" ఇత్యాదులైన యుపనిషద్వాక్యములకు మరొకపద్ధతిగా నింకొకయర్థమును ప్రతిపాదించి బ్రహ్మమీమాంసా వివరణము అనువంకతో ఆనందతీర్థుడింకొక ప్రస్థానమును నిరూపించి స్థిరపఱచెను. అతనిమతమున ఆత్మతత్త్వము స్వతంత్రము పరతంత్రము అని రెండువిధములు. అది తత్త్వవివేకమందిట్లు చెప్పఁబడినది.

స్వతంత్రం పరతంత్రం చ ద్వివిధం తత్త్వముచ్యతే
స్వతంత్రోభగవాన్ విష్ణుర్నిర్దోషోఽశేషసద్గుణః

బ్రహ్మతత్త్వము స్వతంత్రము పరతంత్రము (పరాధీనము) అని అవిరెండు విధములు. అందు భగవంతుఁడైన విష్ణువు స్వతంత్రుఁడు. దోషములులేని వాఁడు. స్వాతంత్ర్యశక్తి, విజ్ఞానము ఆనందము మొదలైన యశేషములైన సద్గుణములుగలవాఁడు " అని

అయితేమరి "సదేవ సోమ్యేదమగ్ర ఆసీత్, ఏక మేవ అద్వితీయమ్ (ఛాం. 6-1- ) ఇత్యాద్యుపనిషత్తులు. బ్రహ్మతత్త్వము పరమాత్మ సజాతీయములయిన జీవాత్మలకంటె భిన్నము, విజాతీయములయిన యాకాశాదులకంటె అభిన్నము, తనయందున్న కారుణ్యాదిగుణములకంటెను భిన్నము అను నానావిధములయిన తత్త్వములులేనిది తత్త్వము ఒకటేఅయినపుడు రెండవది యుండనే యున్నది. అని ప్రతిపాదించుచుండఁగా పరమాత్మకు అశేషములగు గుణములుకలవని ఎట్లు చెప్పఁబడుచున్నది అన్నచో అట్లనుట సరికాదు. బ్రహ్మతత్త్వము భిన్నమైనదని నిరూపించుననేక ప్రమాణములతో పై యుపనిషద్వాక్యము విరోధించుటచే అవి ప్రమాణములని చెప్పుట యుపపన్నముకాదు. ఎట్లనఁగా-ప్రత్యక్షమైతే అనఁగా ప్రత్యక్షప్రమాణమువను పథనమైన యింద్రియము ఇది దీనికంటె వేరయినది అని నీలపీతాదివర్ణములకు భిన్నత్వమును సరిగాబోధించుచున్నది.

నీలవర్ణము పీతవర్ణముకంటె వేఱుఅన్నచోట నీలము భేదధర్మముగలది. పీతము నీలమును భేదధర్మమునకు ప్రతియోగి అనఁగా భిన్నము అందు నీల

మునకు భేదధర్మిగా జ్ఞానము కలుగుచున్నది. పీతమునకు నీలాదివర్ణభేద ధర్మికి ప్రతియోగిగా జ్ఞానముకలుగుచున్నది నీలాదిభేద జ్ఞానము ఆ ధర్మముగల వానికంటె ప్రతియోగియైన తనఁగా భిన్నమైన పీతాదిధర్మమును అపేక్షించు చున్నది. నీలము భేదధర్మముగలది అను జ్ఞానమును పీతము నీలాదిభేద ధర్మములుగల పీతాది వర్ణముకంటె ప్రతియోగి అనఁగా భిన్నము అనుజ్ఞానమే లేనిచో భేదజ్ఞానము ఏమాత్రము సంభవింపదు. భేదజ్ఞానము తద్భిన్న జ్ఞాన మును అపేక్షించుచున్నదిగదా, దీని అంగీకరింపవుగదా, సరేమంచిది అయితేమతి నీవు భేదమును ఒప్పవు ప్రత్యక్షము అన్నది భేదధర్మమునుబట్టి కలుగుచున్నదా లేక భేదధర్మముగలదానికంటె భిన్నమైనదానినిబట్టి గలుగుచున్నదా? భేద ధర్మముగలదానికంటె భిన్నమైన దాని జ్ఞానములేకుండ దానినిబట్టి కలుగు భేదమును నిశ్చయింపశక్యముగాదు కనుక మొదటి పక్షమును కాదు. నీల ఘటముభేదధర్మిగాను పీతఘటము ప్రతియోగిధర్మిగాను జ్ఞానముకలుగకపోయి నచో భేదజ్ఞానము ఏమాత్రముగలుగదు. ఏలయన భేదజ్ఞానము తద్భిన్నమైన ప్రతియోగినిబట్టి కలుగును గనుక భేదవిషయక ప్రత్యక్షమందు ధర్మియై నీలఘటము ధర్మిగాను తద్భిన్న పీతఘటము ప్రతియోగిగాను ప్రస్తుతము లగును అను రెండవపక్షమందును, మొదట ప్రత్యక్షజ్ఞానము ధర్మికిన్నిక ప్రతి యోగికిని తరువాత భేదమునకా లేక ధర్మిప్రతియోగి భేదములకు ప్రత్యక్ష జ్ఞానము ఒక్కమాటు అన్నిటికిని గలుగునా? అందు మొదటిది కాదు. బుద్ధి ఒకదానిని చెప్పి విరమించి యింకొకదానిని చెప్పుట అను వ్యాపారము గలది కాకపోవుటవల్లను, నీలఘటమునుబట్టి పీతఘటము పీతఘటమునుబట్టి నీలఘటము అను అన్యోన్యాశ్రయదోషముబట్టియు వేఱుగుటబట్టియు, ఇంకఅన్నియు కలుగ వను చివరిపక్షముకూడ సరికాదు. కార్యబుద్ధియు కారణబుద్ధియు ఒక్కమాటు గానే కలుగవు గావున, ధర్మిప్రతీతిల అభేదజ్ఞానమునకుకారణము ఇట్టి ప్రతియోగి జ్ఞానముకూడ. నీలఘటరూపధర్మి దగ్గరగానున్నపుడును దూరముగానున్న పీతఘటరూప ప్రతియోగి జ్ఞానము లేకుండ భేదజ్ఞానము కలుగదు కాన అది యున్నపుడు ఇది, ఇదిలేనపుడు అదికాదు అను అన్వయ వ్యతిరేకములబట్టియె కార్యకరణముల జ్ఞానముకలుగుచున్నది కనుక భేదప్రత్యక్షము సులభముగా ప్రసరించదు అన్నచో—

కుండ మొదలగువానికి కంబుగ్రీవాదిక స్వరూపమె భేదముగాని మరి యొకటి గాదని మాధ్వులందురు. కుండ మొదలగు వానికంటె ఇంకొక కుండ మొదలగు వస్తువులందు వానిలోని ధర్మమునుబట్టి భేదమని వైశేషి కాదులందురు. ఇచ్చట వస్తు స్వరూపమునుబట్టియె భేదమన్న వారిని గురించి పై దోషములు చెప్పబడుచున్నవా? లేక కుండ మొదలగువాని ధర్మమును బట్టియె భేదమన్న వారిని గురించి చెప్పబడుచున్నవా? మొదటి పక్షములో చోరుడనుకొని చోరుడు కాని* మాండవ్యఋషిని దోషిగా నిర్ణయించి నిగ్రహించినట్లు ఇచ్చట ధర్మ ప్రతియోగితో కూడిన భేదము రెండిటికి ఒక్క మాటుగా ప్రత్యక్షజ్ఞానము కలుగుట అసంభవముగాన పై యాక్షేపమును స్వీకరించుట దర్మభేదవాది మతమున కుదురదు. పై దోషములు వస్తు స్వరూప భేదమునకు విషయములు గావు.

ఒక వస్తువును బట్టి యితరమైన తద్గత దర్మరూపభేదము అయినచో కేవల భేదమును గ్రహింపవలెనా? లేక ధర్మి ప్రతియోగితోఁ గూడినదానినా? అందులోఁ గూడ ధర్మి ప్రతియోగి భేదములను గ్రహించుట క్రమముగానా? లేక ఒక్కమాటుగానా? అను పైని జెప్పిన వికల్పములు సంభవించునేగాని భేదము వస్తు స్వరూపమును బట్టి అన్నపుడు మాత్రము గావని గ్రహింప వలెను. వస్తుస్వరూపమె భేదము అన్నపుడు ప్రతియోగిని బట్టి అన్నది ఘటమువలె ఏర్పడదు. ఎట్లు ఘటప్రతీతి దీనికంటె ఈ ఘటము అని గలుగదో అట్లే దీనికంటె భిన్నము అను భేదప్రతీతి గలుగదు. లోకములోనైతే

---

* దొంగ అనుకొని మాండవ్యఋషికి రాజు శూలారోపణ శిక్ష వేయబోయి అసలైన చోరుని సంగతి తెలిసి ఋషిని క్షమింపజేసికొనెను. పిదప ఋషి యముని దగ్గరకు వెళ్ళి నాకీ శిక్ష ఎందుకైనదని యడుగగా చిన్నప్పుడు నీవొక పురుగును బంధించితివనగా తెలియని బాల్యములో చేసినదానికి ఇన్ని శిక్షించేసితివి గాన నీవు భూలోకములో పుట్టుమని శపించెను. ఆతడే విదురుడై పుట్టెనట. ఇంక అప్పటినుండి బాల్యములో చేసినది క్షంతవ్యమని యముడు నియమము చేసెనని కథ.

నియమముగా ఇంకొకదానిని బట్టియే కనిపించుచున్నది. కనుక భేదప్రతీతి యెప్పుడును ధర్మి ప్రతియోగినిబట్టి కలుగును కాన పరఘట ప్రతీతి లేకుండ ప్రతీతి కలుగు ఘటాది స్వరూపత్వము భేదమునకు ఉపపన్నము గాదు. ముందు అన్నిచోట్ల విలక్షణముగా వస్తుస్వరూపము తెలియబడగా ప్రతియోగిని బట్టియే విశిష్టవ్యవహారము ఉపపన్నమగును. కాబట్టి ప్రతియోగిని బట్టియే అన్నిచోట్ల భేదము గలుగుచున్నది అని యనరాదు. ఎట్లన, మొదట అన్నివిధముల విలక్షణమగుటచేత, వస్తుస్వరూపము తెలియబడగా, ప్రతియోగిని బట్టి విశిష్ట వ్యవహారము ఉపపన్నమగును గదా. ధర్మభేదవాదుల మతములో మొదట ధర్మికి ఘటరూపముగా జ్ఞానము కలుగును. పిదప ప్రతియోగి యగు పటాదులకు ఘటాదిరూపముగా జ్ఞానము గలుగును. పిదప ఆ రెండిటికి ధర్మిత్వ ప్రతియోగిత్వములకు అనుసంధానముచేయుటతో గూడిన భేదజ్ఞానము. పిదప ఘటము పటముకంటె భిన్నము అను వ్యవహారము. ఇది క్రమము. స్వరూప భేదవాదుల మతములోనైతే మొదట ఘటము అన్నివిధముల విలక్షణముగాన ఘటత్వస్వరూప జ్ఞానము. ఇదియే భేదజ్ఞానము. అన్నివిధముల విలక్షణమై కంబుగ్రీవాది సంస్థాన విశేష స్వరూపమునకే భేదము కనుక తరువాత ప్రతియోగియగు పటాదులకు పటాది జ్ఞానము. పిదప ప్రతియోగిత్వానుసంధాన పూర్వకమైన ఘటము పటముకంటె భిన్నము అని వ్యవహారము, ఇది క్రమము. ఎట్లన, ఏదోయొక పరిమాణము గల వస్తు స్వరూపము మొదట తోచును. తరువాత ప్రతియోగి విశేషమునుబట్టి ఇది పొట్టిది ఇది పొడుగుది అని అదే విశేషించి వ్యవహారమునకు స్థానము అగును. అదే విష్ణుతత్వ నిర్ణయములో నిట్లు చెప్పబడెను. "విశేషణ విశేష్య భావముకూడ భేదమును ఆపేక్షించినదే కలుగును ధర్మి ప్రతియోగినిబట్టి భేదసిద్ధి కలుగును. ధర్మి ప్రతియోగిత్వము కూడ భేదమును ఆపేక్షించినదే. ఇట్లు అన్యోన్యము దానిని బట్టి ఇది దీనిని బట్టి అది కలుగును గాన భేదము యుక్తియుక్తము గానేరదు. భేదము అన్నది పదార్థ స్వరూపమును బట్టి కలుగును గనుక "ఇత్యాదికముగ! కనుకనే గోశబ్దార్థమును తెలియగోరువారు గవయమృగ దర్శనమును బట్టి ప్రవర్తింపరు. గోశబ్దమును గూడ స్మరింపరు. క్షీరనీరాదులందు వాని స్వరూపము గ్రహింపబడగా భేదముకూడ ప్రతిభాసించుననరాదు.

సమానమైన వస్తువుతోకలియుటచే దూరమునకు కనిపించు పురుషుడు మొదట ఇది యొకానొక పదార్థమని తెలియబడును. పిదప పొడుగుది అని తరువాత ఇది ఒక జీవి అని పిదప పురుషుడు అని పిదప యువకుడు అని జ్ఞానము కలుగును. ఇట్లు ఒకే వస్తు స్వరూపము తారతమ్యముగా అనేక విధములుగా అనేక సాధనములను బట్టి గ్రహింపబడుచున్నది అదే యీ విధముగా చెప్పబడినది.

అతి దూరాత్సామీప్యాదింద్రియ ఘాతాత్ మనోవస్థానాత్, సౌక్ష్మ్యాత్ వ్యవధానాత్ అభిభవాత్ సమానాభిహారాచ్చ (సాంఖ్య కారిక. 7)

అతిదూరమైన పర్వత శిఖరమందున్న వృక్షాదులందు, అతి సమీపమైన కంటికాటుకలోనగు వానియందు ఇంద్రియముల కడ్డయినందువలన మెఱపు మొదలగువానియందు మనస్సు స్థిరముగా నుండకపోవుటవలన కామాదులచే కంగారుపెట్టబడిన మనస్సుగలవానికి దట్టమైన వెలుగులోనున్న ఘటాదులందు, సౌక్ష్మికమగుటవలన పరమాణువు మొదలగు వానియందు వ్యవధానమువలన గోడలచాటుననున్న వానియందు తిరస్కారము వలన పగలు దీపకాంత్యాదులందు సమానముగా చెప్పుటవలన నీర క్షీరాదులందు వస్తువు సరిగా కనిపింపదు. గోవువలెనున్న గవయ మృగమును చూచి గోవును తీసికొనిరా ప్రయుత్నింపదు గదా: ఇది గోవు గాదని మాత్రమే జ్ఞానము కలుగును.

ధర్మభేద వాదమె కానిమ్ము. అయినప్పటికి ఏమియు దోషము లేదు. ధర్మి ప్రతియోగిని గ్రహింపగా పిదప ధర్మి ప్రతియోగితోఁ గూడిన భేదమును గ్రహించుట ఉపపన్నమగుచున్నది గదా. ముందుగా ధర్మియైన ఘటమునకు ఘటరూపముగాను, ఘటమునకు ప్రతియోగియైన పటమునకు పటరూపముగాను గ్రహణము గలుగును. పిదప ఆ ఘటపటములకు ధర్మిత్వమును బట్టి ప్రతియోగిత్వమును బట్టి యీ భేదము సమూహముయొక్క ఆధారముచే గల్గిన జ్ఞానమువలె ఒకే వ్యాపారముచే గ్రహణము గలుగును. ఇదే ఘటపట ఘటితభేద గ్రహణము. ఇట కారణకార్య జ్ఞానములొకే మాటుగా

గలుగవు అను దోషము ఆపాదింపరాదు. ఘటము ధర్మిగాను పటము ప్రతియోగిగాను జ్ఞానము గలుగును గదా. అది భేద జ్ఞానమునకు కారణము కనుక ఘటమందు భేద ధర్మిత్వము, పటమందు భేద ప్రతియోగిత్వమును వస్తువులందు ఉన్నదే. భేద జ్ఞానమందైతే కారణము జ్ఞాతము కాదు కనుక దోషమేమియు లేదు. ఇందు పరస్పరాశ్రయ దోషమేమియు లేదు. ఇందుచే పరస్పరాశ్రయ దోషమగుననరాదు. ఘటజ్ఞానమునకు పటజ్ఞానమును, పటజ్ఞానమునకు ఘటజ్ఞానమును కారణముగాన పరస్పరాశ్రయదోషము. కాని ఘట జ్ఞానమన్నది అన్ని విధముల విలక్షణమైనది. అది ఘట పటములు పరస్పరము విలక్షణములుగా ఒకదానికొకటి విలక్షణమైనది. కనుక ఒకదాని యపేక్ష యొకదానికి లేకుండనే ఇది ఘటము అని ఘటజ్ఞానము ఇది పటము అని పట జ్ఞానము గలుగును. కాన పరస్పరాశ్రయదోషము లేదని భావము. ధర్మభేదవాదములో ఆయా భేదములకు ఇంకొక భేదముచేత భేదింపఁదోయుట చేత అనవస్థ గలుగుననరాదు. మొదటి ఘటముకంటె రెండవది రెండవదాని కంటె మూడవది అనునది యనవస్థ ఇంకొక భేద ప్రసక్తికి మూలమని యేదియు లేదు గనుక ఘటపటములు భిన్నములు అను వ్యవహారముచే అనవస్థ గలుగదు. భేదమును భేదము గలదియును భిన్నములని వ్యవహారము కనిపించుట లేదు కనుక ఇది దానికంటె భిన్నము అని ఒకదానియొక్క భేదముచేత ఇంకొక భేదమును అనుమానించుటయు కలుగదు. అపుడు బేదమును తెలుపు దృష్టాంతమె ఉండదు. కాన దోషము లేదు. ధర్మబేదము ఇతర బేదముచే బేదింపఁదగినది బేదము గలుగుటవలన ధర్మికి విశేషణమైన బేదమువలె అనునది అనుమానము. ఒకదానికి ఇంకొకదానితో సంబంధము గలుగును దానికింకొక దానితో దానికింకొకదానితో అను సంబంధ పరంపర ఉండును. అక్కడ అనవస్థా దోషము. ఈ సంబంధము కూడ కొన్ని యుదాహరణములలో అవసరము. కొన్నిటిలో అది నియతముగాదు గనుక అది అనవసరము. భూమికి జలము కారణము దానికి తేజస్సు దానికి వాయువు దానికి మూలకారణము ఈశ్వరుడు. ఇంక ఈశ్వరునికి కారణమో చెప్పబడదు. అనవసరము కూడ. ఇది ఎటువంటిదనఁగా మర్దనమునకు ఇంటిలో తైలము కలేపోతే పోనీ తెలికపిండిచేతనైనను ఈ పని చేయుదమని తెలికపిండిని

అడుగగా వానికి ఒక యుదారాశయుడు తెలికపిండినేకాక కొంత పరిమాణము గల తైలమునే యిచ్చుటకై అంగీకరించుటవలె. దృష్టాంత భేదము లేనపుడైతే అనుమానమె యుదయింపదు. వరుడు చచ్చిపోవునేమో అని కన్యకు వివాహము చేయకుండ నుండరు గదా. కాన మూలనాశము లేదు గాన అనవస్థ దోషము కాదు.

అనుమానము చేతఁ గూడ భేదము నిశ్చయింపఁబడును. పరమేశ్వరుఁడు జీవునికంటె భిన్నుఁడు. జీవునిఁ గూర్చి పరమేశ్వరుఁడు సేవింపఁదగినవాఁడగుటవలన. ఎవఁడు ఎవనినిగూర్చి సేవింపఁదగిన వాఁడగునో అతఁడు వానికంటె భిన్నుఁడు. ఎట్లనఁగా భృత్యునికంటె రాజు భిన్నుఁడైనట్లు. నాకు సుఖము గలుగుఁగాక, నాకుఁ గొంచెము గూడ దుఃఖము కలుగకుండుఁగాక, అని పురుషార్థమును గోరు పురుషులు రాజపదవిని కోరుచున్నవారైనచో సత్కారమునకు అర్హులు కానేరరు గదా. పైఁగా సర్వానర్థములకు భాజనమగుదురు. ఎవఁడు తనకు హీనత్వమును పరునికి గుణోత్కర్షమును జెప్పునో అతఁడు స్తుతింపఁదగినవాఁడై ప్రీతి పొంది స్తుతించిన వాని యభీష్టమును ఇచ్చును. అది యిట్లు చెప్పబడెను.

"ఘాతయంతి హి రాజానో రాజాఽహ మితి వాదినః
దదత్యఖిల మిష్టంచ స్వగుణోత్కర్షవాదివాం".

'నేను రాజును' అని పలుకువారిని రాజులు చంపెదరు. ఏలయన వారు తన రాజ్యపదవికే మోసము తెచ్చుచున్నారు గాన. తన గుణోత్కర్షమును జెప్పువారికి మాత్రము అంతయును వారికిష్టమైనదానిని గూడ ఇచ్చెదరు" అని.

కనుక పరమేశ్వరునితో అభేదము పొందునాశచే విష్ణువుయొక్క గుణోత్కర్షను ఎండమావులతో సమానముగాఁ జెప్పుట పెద్ద యరఁటి పండ్లను పొందు కోరికచే నాలుకను గోసికొనుటవంటిదగును. దీనిలో కారణ కార్యభావము లేదు. పోనీ నాలుక కోసికొన్నచో అరటిపండ్లు దొరకినను తినగలడా? కనుక ఇటువంటి విష్ణుద్వేషమువలన గాఢాంధకారమునందు ప్రవేశించుటయె

ప్రసక్తమగును. ఇది మధ్యదేహుని పుత్రుడగు మధ్యమందిరునిచే మహా భారత తాత్పర్య నిర్ణయములో నిట్లు ప్రతిపాదింపఁబడెను. ఈ మధ్య మందిరుని పూర్ణ ప్రజ్ఞాచార్యుడని ఆనందతీర్థుడని యందురు.

"అనాది ద్వేషిణో దైత్యా విష్ణౌ ద్వేషో వివర్ధితః
తమ స్యంధే పాతయతి దైత్యానంతే వినిశ్చయాత్"

'దైత్యులు అనాదినుండి ద్వేషము గలవారు. వారికి విష్ణువునందు ద్వేషము వృద్ధి పొందినది. వారి యా చెడు నిశ్చయమువలనఁ జివర ఆ దైత్యులను విష్ణువు గాఢాంధకారమందుఁ బడవేయుచున్నాఁడు.' అని ఆ సేవయు అంకనము నామకరణము భజనము అని మూఁడు విధములు. ఆ విష్ణు రూపమును స్మరించుటకును అపేక్షితమైన యర్థము సిద్ధించుటకును నారాయణుని యాయుధాదులను కాల్చి తన శరీరమున ముద్రించుట అంకనము. అట్లును శాకల్య సంహితా పరిశిష్టమును జెప్పుచున్నది.

"చక్రం బిభర్తి పురుషోఽభి తప్తం
బలం దేవానా మమృతస్య విష్ణోః
స యాతి నాకం దురితా వధూయ
విశంతి యద్యతయో వీతరాగాః"

దేవతలకును అమృతుఁడైన విష్ణువునకును బలమైన చక్రమును కాచఁబడినదానిని ఏ పురుషుడు ధరించునో వాఁడు—పాపమును బోగొట్టుకొని వీత రాగులైన యతులు దేనిని పొందుదురో అట్టి స్వర్గమును ప్రవేశించును.

"దేవాసో యేన విధృతేన బాహునా సుదర్శనేన ప్రయాతా స్తమాయన్
యేనాంకితా మనవోలోక సృష్టిం వితన్వంతి బ్రాహ్మణా స్తద్వహంతి"

దేవతలు ముద్రలు ధరించిన బాహువులందు సుదర్శనముతోఁ గూడిన వారై ఆ యీశ్వరుని పొందిరి. దేనిచే మనువులు అంకితులై లోకసృష్టిని విస్తరింపఁజేసిరో దానిని బ్రాహ్మణులు దాల్చుచున్నారు.

"తద్విష్ణోః పరమం పదం యేన గచ్ఛంతి లాంఛితాః
ఉరుక్రమస్య చిహ్నై రంకితా లోకే సుభగా భవామః"

విష్ణు చిహ్నములతో లాంఛితులైనవారు ఆ విష్ణువుయొక్క పరమ పదమును పొందుదురు. ఆయురు విక్రముఁడైన విష్ణువుయొక్క చిహ్నము లచే అంకితులమై లోకమున సుభగులమగుదుము గాక అని.

అతప్త తనూర్న తదామో అశ్నుతే, శ్రితాస ఇద్వహంత స్తత్సమాసత (తై. ఆ.)

ముద్రలచేఁ దప్తముగాని శరీరము గల యా యపక్వము ఆ భగవం తుని బొందదు. దానిని ఆశ్రయించినవారు దానిని ధరించినవారే ఆ భగ వంతుని బొందెదరు. అని తైత్తిరీయారణ్యోపనిషత్తును చెప్పుచున్నది.

ఏయేచోట ఏవి ముద్రించవలయునో ఆగ్నేయ పురాణమునఁ జూపఁ బడెను.

"దక్షిణేతు కరే విప్రో బిభృయాచ్చ సుదర్శనం
సవ్యేన శంఖం బిభృయా దితి బ్రహ్మ విదో విదుః"

విప్రుఁడు కుడికరమందైతే సుదర్శనమును ధరింపవలయును. ఎడమ చేతిలో శంఖమును ధరింపవలెనని బ్రహ్మవేత్తలందురు.

మఱొకచోట చక్రధారణ సమయములో మంత్రవిశేషము చూపఁ బడెను.

"సుదర్శన మహాజ్వాల సూర్యకోటి సమప్రభ
అజ్ఞానాంధస్య మే నిత్యం విష్ణోర్మార్గం ప్రదర్శయ"

ఓ సుదర్శనమా! గొప్ప జ్వాలలు గలదానా! కోటిసూర్యుల ప్రభతో సమమైన ప్రభగలదానా! అజ్ఞానముచే గుడ్డినగు నాకు నిత్యమును విష్ణు మార్గమును జూపుము.

త్వం పురా సాగరోత్పన్నో విష్ణునా విధృతః కరే
నమితః సర్వదేవైశ్చ పాంచజన్య నమోఽస్తుతే

నీవు పూర్వము సముద్రమునుండి పుట్టితివి. శ్రీ మహావిష్ణువుచేత చేతి యందు ధరింపఁబడితివి. సర్వదేవులచే నమస్కరింపఁబడితివి. ఓ పాంచ జన్యమా! నీకు నమస్కారము.

ఎల్లపుడు విష్ణునామమును స్మరించుటకై కేశవాది నామములతో పుత్రాదులను వ్యవహరించుట నామకరణము.

భజనము పది విధములు. వాక్కుతో 1 సత్యము పలుకుట, 2 హితము పలుకుట, 3 ప్రియము పలుకుట, 4 స్వాధ్యాయము చదువుట, 5 శరీరముచే దానము చేయుట, 6 పరిత్రాణము, 7 పరిరక్షణము మనస్సుచే, 8 దయ, 9 స్పృహ, 10 శ్రద్ధ గలిగి యుండుట. ఇందు ఒక్కొక్కదానిని సంపాదించుకొని నారాయణునికి సమర్పించుట భజనము. అది యిట్లు చెప్పఁబడెను.

అంకనం నామకరణం భజనం దశధాచతత్ అంకనము, నామకరణము పది విధములైన భజనము అని.

ఇట్లు జ్ఞేయత్వాది రూపముగా (జ్ఞేయము జ్ఞాత జ్ఞానము) భేదము ఊహింపఁదగినది. అట్లు శ్రుతిచేతఁ గూడ భేదము తెలిసికొనఁదగినది. సత్యమేన మను విశ్వే మదంతి రాతిం దేవస్య గృణతో మఘోనః సత్యః సో అస్య మహిమాగృణేశవో యజ్ఞేషు విప్రరాజ్యే సత్య ఆత్మా సత్యో జీవః సత్యం భిదా సత్యం భిదా సత్యం భిదా మైవారువణ్యో మైవారువణ్యో మైవారువణ్య ఇతి.

స్తుతించుచున్న దేవుడైన యింద్రుని మిత్రుడైన (రాతిం) ఈ విష్ణువును గూర్చి విశ్వప్రాణులు సంతోషించుచున్నవి. ఇది సత్యము. అతని మహిమ అది సత్యమైనది. ఈ విష్ణువును విప్రరాజ్యరూపములైన యజ్ఞములందు శవము=సుఖమునుగూర్చి స్తుతించుచున్నాను. "ఆత్మ సత్యము, జీవుఁడు సత్యము, భేదము సత్యము భేదము సత్యము, భేదము సత్యము. మా ఏవ అరుభిః=దుష్టులచే, వణ్యః=భజనీయుఁడు, దుష్టులచే భజనీయుఁడు కానేకాఁడు అని ముమ్మారు చెప్పఁబడెను." అని మోక్షానంద ప్రతిపాదక శ్రుతులవల్ల భేదము తెలియనగు.

"ఇదం జ్ఞాన మాశ్రిత్య మమసా ధర్మ్య మాగతాః
సర్గేఽపి నో పజాయంతే ప్రళయే న వ్యథంతి చ (గీ.

"ఈ జ్ఞాన మాశ్రయించియె, పొందిరి నాదు రూపమున్
సృష్టియందును పుట్టరు, చావరు ప్రళయంబునన్ (తె. గీ.)

జగద్వ్యాపార వర్జం (బ్ర. సూ 4 4.) సృష్ట్యాది జగద్వ్యాపారము లను గాక మిగిలినవానిని ముక్తుడు పొందును. "ప్రకరణా దసన్నిహిత త్వాచ్చ (బ్ర. సూ. 4. 4. 12) జీవ ప్రకరణము నుబట్టియు జీవునికి సృష్ట్యాది సామర్థ్యము లేకపోవుటవలనను.

ఇత్యాదులను బట్టి ముక్తునికి సృష్ట్యాది శక్తులుండవు. బ్రహ్మవేద బ్రహ్మైవ భవతి (ముం 3-2-6) బ్రహ్మమును దెలిసినవాఁడు బ్రహ్మమే యగును. అను శ్రుతి బలమునుబట్టి జీవునికి పారమైశ్వర్యమును శంకింప శక్యము గాదు. "సంపూజ్య బ్రాహ్మణం భక్త్యా శూద్రోఽపి బ్రాహ్మణో భవేత్" బ్రాహ్మణునిని భక్తితోఁ బూజించిన శూద్రుఁడును బ్రాహ్మణుఁడగును. అనుదానివలె వివరింపఁబడినదగును. అని అర్థపరముగాఁ జెప్పకొనవల యును. మఱి

"ప్రపంచో యది విద్యేత వివర్తేత న సంశయః
మాయామాత్రమిదం ద్వైత మద్వైతం పరమార్థతః (గౌ. కా. 1-1-7)
'ద్వైత బుద్ధిన్ జగంబెల్ల, వేఱుచూచుట మాయయే, అద్వైతమె యదా ర్థంబు, జగంబు లేదు పోవుదున్' అను వచనమువల్ల ద్వైతము కల్పితమని తెలియఁబడునన్నచో ఆ చెప్పినది నిజమె. కాని దాని భావమును దెలియక చెప్పఁబడెను. ఎట్లనఁగా-ఇదేగనుక పుట్టినచో నివర్తింపదు నిస్సంశయము. కనుక

పంచ భేదాంశ్చ విజ్ఞాయ విష్ణోః స్వాభేదమే వచ
నిర్దోషత్వం గుణోద్రేకం జ్ఞాత్వా ముక్తిర్నచాన్యథా (మహాభారత 1-82).

ఈ ప్రకృష్టమైన పై అయిదు విధములు పొందిన ప్రపంచము అనా దియె. మాయామాత్రమగుటవలన ఇది లేనిదని యనరాదు. మాయ యనఁగా భగవదిచ్ఛ.

"మహామాయే త్యవిద్యేతి, నియతి ర్మోహినీతిచ
ప్రకృతిర్వాసనేత్యేవ తవేచ్ఛానంతః కథ్యతే.

ఓ యనంతుఁడా! మహావిద్య అన్నను అవిద్య యన్నను నియతి అన్నను మోహిని అన్నను ప్రకృతి అన్నను వాసన అన్నను నా యిచ్ఛయే. నా యిచ్ఛయే అట్లు చెప్పఁబడుచున్నది.

ప్రకృతిర్ప్రకృష్టకరణా ద్వాసనా వాసయేద్యతః
అఇత్యుక్తో హరి స్తస్య మాయాఽ విద్యేతి సంజ్ఞితా

ప్రకృష్టముగాఁ జేయుటవలన ప్రకృతి సంసారమున వసింపఁజేయును. దానిచే జగత్తు పుట్టింపఁబడును. వాసయేత్=ఉత్పాదయేత్ గాన వాసన అనఁబడు. అ అనఁగా హరి. అ=హరియొక్క (అ + విద్య) మాయ అవిద్య అనఁబడును.

మాయే త్యుక్తా ప్రకృష్టత్వాత్ ప్రకృష్టేహి మయాభిధా
విష్ణోః ప్రజ్ఞప్తి రేవైకా శబ్దై రేతై రుదీర్యతే.

ప్రకృష్టమగుటవలన మయ అనునది ప్రకృష్టార్థమందున్నది. విష్ణువు యొక్క ప్రజ్ఞప్తి యొక్కటియె ఈ శబ్దములచేతఁ జెప్పఁబడుచున్నది.

ప్రజ్ఞప్తి రూపోహి హరిః సాచస్వానంద లక్షణా

"హరి ప్రజ్ఞప్తి రూపముగలవాఁడు. ఆ ప్రజ్ఞప్తియును ఆనందమె లక్షణముగఁ గలది." ఇత్యాది వచనముల ప్రామాణ్య బలమువలన 'మాయ' అనఁగా భగవదిచ్ఛయె చెప్పఁబడును.

అనాది మాయయా విష్ణోరిచ్ఛయా స్వాపితో యదా
తయా ప్రబోధ మాయాతి తదా విష్ణుం ప్రపశ్యతి.

అనాది మాయ యయిన విష్ణువు కోరికచే ఎప్పుడు మేల్కొనునో అపుడె విష్ణువును చూచును అని భాష్యము. ఆ ప్రజ్ఞయే మాన త్రాణములను జేయునది. పరమేశ్వరునికి అది మాయామాత్రము. కనుకను పరమేశ్వరునిచేతఁ దెలియఁబడుట వలన రక్షింపఁబడుటవలనను ద్వైతము భ్రాంతిచేత గల్పింపఁబడినది కాదు. ఈశ్వరుని విషయమున సర్వులకు భ్రాంతి సంభవింపదు. భ్రాంతి యన్నది విశేషములను జూడకపోవుటవలనఁ గలిగినదే గదా అయితే మఱి ఆ వ్యవహారమెట్లు అనుచోట పరమార్థముగా

అద్వైతము అని సమాధానము. పరమార్థతః అనగా పరమార్థాపేక్షవల్ల అని యర్థము. అందుచేత అన్నిటికంటె ఉత్తమమైన విష్ణుతత్త్వమునకు సమమైనదిగాని అధికమైనదిగాని యింకొకటి లేదు. అని చెప్పినట్లయినది. అట్లును గూడ శ్రుతి గలదు.

1 జీవేశ్వర భిదాచైవ 2 జడేశ్వర భిదా తథా
3 జీవ భేదో మిథశ్చైవ 4 జడ జీవ భిదా తథా

1 జీవేశ్వరులు భిన్నులు 2 అట్లే జడము ఈశ్వరుఁడు భిన్నులు 3 పరస్పరము జీవులు భిన్నులు 4 అట్లే జడము జీవులును భిన్నులు.

5 మిథశ్చ జడ భేదోయః ప్రపంచో భేద పంచకః
సోఽయం సత్యో హ్యనాదిశ్చ సాదిశ్చేన్నాశ మాప్నుయాత్

5 జడములును పరస్పరము భిన్నములు. ప్రపంచము ఈ పై పంచ భేదములచేత భిన్నము. ఈ ప్రపంచము సత్యమైనను అనాది. ఆది గలదన్నచో నశించిపోయెడిదే.

నచనాశం ప్రయాత్యేష నచాసౌ భ్రాంతి కల్పితః
కల్పితశ్చేన్నివర్తేత, నచాసౌ విని వర్తతే

ఇది నాశమును పొందదు. ఇది భ్రాంతిచే కల్పితము గాదు. అట్లు కల్పింపఁబడినచో నివర్తించిపోవును. మరి ఇది నివర్తించుట లేదు.

ద్వైతం న విద్యత ఇతి తస్మాదజ్ఞానినాం మతం
మతం హి జ్ఞానినా మేతన్మతం త్రాతం హి విష్ణునా

'ద్వైతము లేదు' అన్నది యజ్ఞానుల మతము. ద్వైతము గలదన్నది జ్ఞానుల మతము. ఇది ప్రమాణయుతము విష్ణువుచేత రక్షింపఁబడినది.

తస్మాన్మాత్ర మితి ప్రోక్తం పరమోహరి రేవతు"

కనుక మా (ప్రమాణ యుక్తము) త్రము (త్రాణ యుక్తము) అని చెప్పఁబడినది. హరియే పరమ స్వరూపుఁడు ఇత్యాది శ్రుతులు గలవు.

కనుక 'విష్ణువు సర్వోత్కర్షుఁడు' అను దానిలోనే సర్వాగమములకు

తాత్పర్యము గలదు. ఇది యంతయు ఉద్దేశించియే భగవంతునిచే నిట్లు చెప్పఁబడినది.

"ద్వా విమౌ పురుషౌ లోకే క్షరశ్చాక్షర ఏవచ
క్షరః సర్వాణి భూతాని కూటస్థోఽక్షర ఉచ్యతే.

'క్షరుండు నక్షరుండంచున్, గలరిద్దరు పురుషుల్
క్షరుండౌ సర్వ తంబుల్, కూటస్థుఁ డక్షరుండగున్'

ఉత్తమః పురుషస్త్వన్యః పరమాత్మే త్యుదాహృతః
యోలోక త్రయ మావిశ్య బిభర్త్య వ్యయ ఈశ్వరః

పరమాత్ముఁడనంబడు, పురుషోత్తముఁ డన్యుఁడు
వాఁడే లోకత్రయంజొచ్చి, బ్రోచు న వ్యయుఁ డీశుఁడై"

యస్మాత్క్షర మతీతోహ మక్షరాదపి చోత్తమః
అతోఽస్మి లోకే వేదేచ ప్రథితః పురుషోత్తమః

అక్షరు కన్న శ్రేష్ఠుండన్, క్షరాతీతుఁడఁ గావునన్
లోక వేదములన్ నన్నుఁ, బురుషోత్తముఁ డందురు.

యోమామేవ మసమ్మూఢో, జానాతి పురుషోత్తమం
ససర్వ విద్భజతి మాం సర్వభావేన భారత

మూఢుండు గాక నన్నిట్లు, పురుషోత్తము నెంచెడి
సర్వజ్ఞుఁ డెల్ల రీతుల, నన్నే భజించు నర్జునా.

ఇతి గుహ్యతమం శాస్త్ర మిద ముక్తం మయాఽనఘ
ఏతద్బుద్ధ్వా బుద్ధిమాన్ స్యాత్కృతకృత్యశ్చ భారత

ఇట్టి పరమ గూఢమౌ, నీ శాస్త్రమేను జెప్పితిన్
దీనిం దెలియు ధీశాలి, కృతకృత్యుండయయ్యెడున్ (గీ. 15-16-0)

మహావరాహమందు గూడ నిటు చెప్పఁబడెను.

ముఖ్యంచ సర్వవేదానాం, తాత్పర్యం శ్రీపతౌ పరే
ఉత్కర్షేతు తదన్యత్ర, తాత్పర్యం స్యాదవాంతరం

విష్ణువుయొక్క సర్వోత్కర్షమందు మహాతాత్పర్యము యుక్తము. మోక్షమె సర్వ పురుషార్థములలో నుత్తమము.

ధర్మార్థ కామాః సర్వేపి ననిత్యాః, మోక్ష ఏవహి
నిత్య, స్తస్మాత్తదర్థాయ యతేత మతిమాన్నరః

ధర్మార్థ కామములన్నియు నిత్యములు గావు. మోక్షమే నిత్యము. కనుక మోక్షము కొఱకు మతిమంతుఁడైన నరుఁడు యత్నింపవలెను.
అని భాల్లవేయ శ్రుతివల్ల దెలియఁ దగును.
మోక్షమును విష్ణుప్రసాదము లేక లభింపదు.

యస్య ప్రసాదాత్ పరమార్తి రూపా
దస్మాత్ సంసారా న్ముచ్యతే, నాఽపరేణ
నారాయణోఽసౌ పరమో విముచ్యతే
ముముక్షుభిః కర్మ పాశా దముష్మాత్.

ఎవని యనుగ్రహము వలన జీవి దుఃఖరూపమైన యీ సంసారమునుండి ముక్తుఁడగునో ఇతరముచేత ముక్తుఁడు కాడో అట్టి యీ నారాయణుఁడు ఈ కర్మ బంధమునుండి ముక్తి పొందగోరు వారిచేఁ జింతింపదగినవాడు అని నారాయణ శ్రుతి.

తస్మిన్ ప్రసన్నే కిమిహా స్త్యలభ్యం
సర్వార్థికామై రలమల్పకాస్తే
సమాశ్రితా ద్బ్రహ్మ తరో రనంతా
న్నిస్సంశయం ముక్తి ఫలం ప్రయాంతి

(విష్ణు పురాణ 1-17-61)

'ఆ విష్ణువు ప్రసన్నుఁడైనచో ఇందు పొందరానిదేమున్నది. సర్వార్థ కామములింకఁ జాలును. అవి అత్యల్పములు. అనంతమైన యీ బ్రహ్మమనెడి వృక్షమును ఆశ్రయించినచో నిస్సంశయముగా ముక్తి ఫలమును పొందుదురు. అని విష్ణుపురాణమునఁ జెప్పఁబడినది కూడ. ప్రసాదముకూడ గుణోత్కర్ష జ్ఞానమువల్లనే కాని అభేదజ్ఞానమువల్లఁ గాదు అని చెప్పఁబడినది.

అయితే మఱి 'తత్త్వమసి' 'అది నీవై యున్నావు' ఇత్యాది తాదాత్మ్య శ్రుతులకు వైరుధ్యము గలుగునని యనరాదు. విరోధము కలుగుననుట శ్రుతి తాత్పర్యాపరిజ్ఞాన విజృంభణమె యగును.

'ఆహ సత్య పరోక్షంతు తచ్ఛబ్దో హ్యవిశేషతః
త్వం శబ్దశ్చాఽపరోక్షార్థం, తయోరైక్యం కథం భవేత్
ఆదిత్యో యూప ఇతివత్ సాదృశ్యార్థా (తు) సా శ్రుతిః'

అ విశేషముగా 'తత్' (అది) అను శబ్దము నిత్య నిరపేక్షమైన దానినైతే చెప్పెను. 'త్వం' (నీవు) అను పదమును అపరోక్షార్థము గలది. వానికి ఐక్యము ఎట్లు కలుగును. "ఆదిత్యుఁడు యూపస్తంభము" అనునట్లు ఆ శ్రుతియైతే సాదృశ్యార్థము గలది."
అట్లును పరమ శ్రుతి గలదు.

"జీవస్య పరమైక్యంతు బుద్ధి సారూప్యమేవతు
ఏకస్థాన నివేశో వా వ్యక్తిస్థానమపేక్ష్య సః"

జీవునికి పరమైక్యమైతే బుద్ధి సారూప్యమే యయితే యగును. ఏకస్థాన నివేశముగాని అది వ్యక్తిస్థానమును అపేక్షించి కలుగును.

"న స్వరూపైకతా తస్య ముక్తస్యాపి విరూపతః
స్వాతంత్ర్య పూర్ణతేఽల్పత్వ పారతంత్రే విరూపతే"

ఆ ముక్తునికి విరూపమును బట్టి ఈశ్వరునితో స్వరూపములో ఐక్యము లేదు (ఈశ్వరుని) స్వాతంత్ర్య పూర్ణత్వములు (జీవుని) అల్పత్వ పారతంత్ర్యములును విరూపములు.

పోనీ 'తత్త్వమసి' తస్య=ఈశ్వరస్య, త్వం అసి=దాస రూపుడవు. అనుచోట స్వాతంత్ర్యాది గుణోపేతుఁడగుటవలన అతఁడే ఆత్మ. 'అతత్త్వమసి' నీవు (అతత్+త్వం అసి) తద్భిన్నమవు, ఆత్మ తత్త్వమవు కావు. స్వాతంత్ర్యాది గుణరహితుఁడవగుట వలన అని జీవేశ్వరులకు ఏకత్వము ఎక్కువగా నిరాకరింపఁబడినది. అదియుఁ జెప్పఁబడినది. 'స ఆత్మాఽతత్త్వమసి శ్వేతకేతో' అనుచోట 'అతత్త్వమితివా ఛేదస్తేనైక్యం సునిరా

కృతం' ఇతి. అత త్త్వమసి పదచ్ఛేదము. అందుచే ఐక్యము బాగుగా నిరాక రింపఁబడెను అని. ఇది యుద్దాలకుడు శ్వేతకేతుపునకుఁ జేయబడిన యుప దేశ వాక్యము.

తస్మా ద్దృష్టాంత నవకేఽపి "సయథా శకునిః సూత్రేణ ప్రబద్ధః (ఛాం 6-8-2).

కనుక తొమ్మిది దృష్టాంతములందును జూడఁదగు.

"బంధనపుఁ ద్రాటఁ గట్టిన పక్షి మిగుల
నిట్టటులు దిక్కు దిక్కుకు నెగిరి యెగిరి
మఱొకచోట నాశ్రియ మిఁకం బడయ కపుడు
బంధనపుఁ దాఁటినే యాశ్రయం బందుఁ జుమ్మ.

ఇత్యాదులచేత భేదమె దృష్టాంతములందు చెప్పఁబడుటవలన. ఇది యభేదోపదేశముగాదని త త్త్వవాద రహస్యము. అట్లును మహోపనిషత్తు.

యథా పక్షీచ సూత్రంచ నానావృక్ష రసాయథా
యథా నద్యః సముద్రాశ్చ యథాజీవ మహీరుహా
యథాఽణి మాచధానాచ, శుద్ధోద వణే యథా
చోరాపహార్యౌచ యథా యథాపుం విషయానపి
యథాఽజ్ఞో జీవ సంఘశ్చ ప్రాణాదేశ్చ నియామకః
తథా జీవేశ్వరౌ భిన్నౌ సర్వదైవ విలక్షణౌ.

పక్షియు పక్షినిగట్టిన సూత్రమువలె (వ్యాధునిచే బద్ధమైన పక్షి ఇం కొకచోటికి వెళ్ళలేక పాశమును వలె) నానావృక్షములు తద్రసములువలె (ఇది పువ్వుతేనె ఇది ఈ పువ్వుతేనె అని తెలియనట్లు జీవులును తమకాశ్ర మగు నాత్మను ఎఱుగనట్లు) జీవవృక్షములువలె, అణిమయు ధానమువలె (సూక్ష్మతర త త్త్వమును మఱిగింజయు) శుద్ధ జల లవణ జలములువలె, చోరుడు అపహరింపదగినది వలె (చోరుడు అబద్ధమాడినచో త ప్తపరశువు కాల్చును లేనిచో కాల్చదు అనునట్లు) పురుషుడు విషయములువలె అచేతనము ప్రాణనియామకుడైన జీవుడువలె) జీవేశ్వరులు భిన్నులు విలక్షణులు.

తథాఽపి సూక్ష్మరూపత్వాన్న జీవాత్పరమో హరిః
భేదేన మంద దృష్టీనాం దృశ్యతే ప్రేరకోఽపిసన్
వైలక్షణ్యం తయోర్జ్ఞాత్వా ముచ్యతే బధ్యతేఽన్యథా

అయినను సూక్ష్మరూపుఁడగుటవలన జీవునికంటె హరి పరముఁడుగా తలపబడలేదు. ప్రేరకుడై మంద దృష్టులకు విభిన్నముగా కనిపించుచున్నాఁడు.

వారిలోని వైలక్షణ్యమును తెలిసికొని ముక్తుఁడగును. అట్లు తెలిసికొననిచో బద్ధుఁడగును.

బ్రహ్మ శివః సురాద్యాశ్చ శరీర క్షరణాత్ క్షరా
లక్ష్మీ రక్షర దేహత్వా దక్షరా తత్పరోహరిః

వారి శరీరములు క్షయించుటవలన బ్రహ్మ శివుఁడు దేవతాదులు క్షరములు. క్షయింపకపోవుటవలన లక్ష్మి అక్షరురాలు. హరి లక్ష్మి తత్పరుడు.

స్వాతంత్ర్య శక్తి విజ్ఞాన సుఖాద్యైరఖిలైర్గుణైః
నిస్సీమత్వేన తే సర్వే తద్వశాః సర్వదైవచ.

స్వాతంత్ర్యము శక్తి విజ్ఞానము సుఖము మొదలైన సకల గుణముల చేత వారందఱు నిస్సీములగుట వలన ఎల్లపుడును ఈశ్వరవశులై యుందురు అని.

విష్ణుం సర్వ గుణైః పూర్ణం జ్ఞాత్వా సంసార వర్జితః
నిర్దుఃఖానంద భుఙ్నిత్యం, తత్సమీపే స మోదతే

సంసార వర్జితుఁడైనవాఁడు సర్వగుణ పూర్ణుఁడైన విష్ణువును దెలిసికొని నిత్యము దుఃఖములేని యానందమును భుజించుచు ఈశ్వర సమీపమందు మోదించుచున్నాఁడు.

ముక్తానాం చాఽఽశ్రయో విష్ణురధి కోఽధి పతిస్తథా
తద్వశా ఏవతే సర్వే సర్వదైవ స ఈశ్వరః

ముక్తులకు విష్ణువు ఆశ్రయుఁడు. అధికుఁడు అట్లే అధిపతి. ముక్తులందఱు ఈశ్వరుని వశమందు ఉండువారు. ఎల్లపుడు అతఁడె ఈశ్వరుఁడు.

ఏకవిజ్ఞానముచేత సర్వ విజ్ఞానములు తెలియుట అనునది ప్రధానము. ప్రకృతి జగత్తునకుఁ గారణమను సాంఖ్యునికి యుక్తమగును గాని సర్వము మిథ్య అని వాదించువానికి యుక్తము గాదు. సత్య జ్ఞానముచేత మిథ్యా జ్ఞానము సంభవింపదు గదా. ప్రధాన పురుషులకు జ్ఞానముచే గ్రామము తెలియఁబడినదియుఁ, అజ్ఞానముచేతఁ దెలియఁబడదనియు ఇత్యాదిక వ్యవహారము దృష్టమో, ఎట్లును, కారణమైన తండ్రి తెలియఁబడఁగా వీడు వీని పుత్రుఁడని తెలియునో ఎట్లుగాని ఒక స్త్రీ జ్ఞానమువలన అన్యస్త్రీ జ్ఞానము తెలియునో, అట్టి సాదృశ్యమె ఇక్కడఁగూడ. ఎట్లు సౌమ్యుడా ఒక మట్టిముద్ద చేత సర్వము మట్టియు తెలియఁబడినదగును. ("యథా సోమ్యైకేన మృత్పిండేన సర్వం మృణ్మయం విజ్ఞాతం స్యాత్"). ఇత్యాదికముచేత వివక్షితము. అట్లుగానిచో 'సోమ్యుఁడా'! ఒక మట్టిముద్దచేత సర్వము మట్టి వికారము తెలియఁబడినదగును. (సోమ్యైకేన, మృత్పిండేన సర్వం మృణ్మయం విజ్ఞాతం' అనుచోట 'ఏకపిండ' 'ఒక్కముద్ద' శబ్దములు వ్యర్థముగా ప్రసక్తములగును. 'మట్టిచేత తెలిసికొనుము' అన్నమాత్రము చేతనే వాక్యము పూర్ణమగును గదా. 'వాచారంభణం వికారో నామధేయం మృత్తికా ఇత్యేవ సత్యం' (వాక్కుచే ఆరంభింపఁబడిన వికారమె నామధేయము. మట్టి వల్ల ఏర్పడిన కుండ మొదలైనవి వికారములు. మట్టి అన్నదే ఎల్లపుడును సత్యముగా నున్న రూపము) అన్నది కార్యమునకు మిథ్యాత్వమును శ్రుతి చెప్పెనని యనరాదు. వాచారంభణ (వాక్కుచే ఆరంభింపఁబడిన) వికారము దేనికో అది అవికృతము నిత్యము, నామధేయము, మట్టి అనువచనమె సత్యము అని యర్థమును స్వీకరింపవలయును. అట్లు గానిచో 'నామధేయం అన్నదియు మృత్తికేత్యేవ అనుచోట ఉన్న ఇతి అను శబ్దమును వ్యర్థములు కావలసివచ్చును. కనుక ఎక్కడను జగత్తునకు మిథ్యాత్వము సిద్ధించుట లేదు.

మఱియు 'ప్రపంచము మిథ్య' అనుచోట మిథ్యాత్వము తథ్యమా? అతథ్యమా? ప్రపంచము మిథ్య అన్నది తథ్యము అన్నచో సత్యమైన యద్వైతమునకు భంగము ప్రసక్తము కావలసి వచ్చును. ప్రపంచము

మిథ్య అన్నది అతథ్యము అన్నచో ప్రపంచము సత్యము అన్నది ఆపాత మగును. మఱి అనిత్యత్వము నిత్యమా? అనిత్యమా? రెండు పక్షములలో అనుపపత్తి కలుగునని యాక్షేపమువలె ఈ మిథ్యాత్వ ధర్మముగూడ నిత్య సమమనునది హేత్వాభాసజాతిలో ఒక రకమగును. అది న్యాయ నిర్మాణ బ్రహ్మయగు గౌతమునిచేతఁ జెప్పఁబడెను. "నిత్యమనిత్య భావాదనిత్యే నిత్యత్వోపపత్తేర్నిత్య సమః (గౌ. సూ. 5-1-35) అనిత్య వస్తువునందు అనిత్యత్వము నిత్యముగా నుండుటచే ఆ వస్తువులందు నిత్యత్వము సిద్ధించు చున్నది గాన నిత్యసమమను జాతి యగును. అని తార్కిక పక్షమందును ఇట్లు చెప్పఁబడెను.

ధర్మస్య తద తద్రూప వికల్పానుపపత్తితః
ధర్మిణస్త ద్వి శిష్టత్వ భంగో నిత్య సమో భవేత్.

ధర్మమునకు తద్రూపా తద్రూప వికల్పముల యనుపపత్తి వలన ధర్మికి తద్విశిష్టత్వ భంగము నిత్య సమమగును". అని.

ఈ సంజ్ఞను ఉపలక్షణముగా అంగీకరించి ప్రబోధ సిద్ధిలో అన్వర్థము గలదగుటవలన ఉపరంజక ధర్మసమమని చెప్పఁబడినది. కనుక ఇది సముత్తరము గాదన్నచో ఇట్లనుట నేర్పకుండ భయపెట్టుటే యగును. దుష్టత్వ మూలములను నిరూపింపక పోవుటవలన.

అది సాధారణము, అసాధారణము అని రెండు విధములు. అందు సాధారణము స్వవ్యాఘాతకము. రెండవది యుక్తాంగ హీనము, అయుక్తాంగాధికము, అవిషయ వృత్తి అని మూఁడు విధములు. అందు సాధారణము అసంభావితమె. ఏలయన-ఉక్తమైన యాక్షేపమునకు స్వాత్మ వ్యాపనము ఉపలబ్ధము గాకపోవుట వలన. ఇట్లు అసాధారణము గూడ. ఘటము యొక్క నాస్తికత్వములో-నాస్తిత్వములో అస్తిత్వము వలె-ప్రకృతములోఁ గూడ ఉపపన్నమగుటవల్ల

మఱి ప్రపంచము మిథ్య అని గాని ప్రపంచము అసత్తు అని గాని యంగీకరింపఁబడదు, అన్నచో-ఇది వీఁడు శిరచ్ఛేదము చేసినను నూఱు

ఇవ్వఁడు అయిదు ఇరవైలు మాత్రమె ఇచ్చును. అను శాకటికుని (కూలికి బండికట్టువాని) న్యాయము వంటిది. ఇక్కడ 100 అన్నను, $20 \times 5$ అన్నను ఒకటె గదా. కావు అనువాడు పరిహాసాస్పదుడగును. మిథ్యాత్వము అసత్త్వము అనునవి పర్యాయములు గదా. అందు "అథాతో బ్రహ్మ జిజ్ఞాసా" మఱి యిందువల్ల బ్రిహ్మను జిజ్ఞాస చేయవలసియున్నది. (బ్ర. సూ. 1-1-1) అను సూత్రమునకు అర్థమిది.

అందు 'అథ' 'మఱి' శబ్దము మంగళార్థము. అధికారానంతర్యార్థముగాఁ గూడ స్వీకరింపఁబడును. 'అతః' ఇందువలన అనునది హేత్వర్థకము. అది గారుడమునఁ జెప్పఁబడినది.

అథాతః శబ్ద పూర్వాణి సూత్రాణి నిఖిలాన్యపి
ప్రారభ్యంతే నియత్యైవ తత్క్రమత్ర నియామకం

సమస్త సూత్రములు 'అథ తఅః' శబ్దములు పూర్వమందు ఉండునట్లు నియతిచేతనే ప్రారంభింపఁబడుచున్నవి. ఇందు నియామకమేమున్నది

కశ్చార్థ స్తుతయోర్విద్వన్ కథ ముత్తమతా తయోః
ఏతదాఖ్యాహిమే బ్రహ్మన్ యథాజ్ఞాస్యామి తత్త్వతః
ఏవ ముక్తో నారదేన బ్రహ్మ ప్రోవాచ సత్తమః

'ఓ విద్వాంసుఁడా! వానికి ఏది యర్థము వానిలో ఉత్తమత్వము ఎట్లు. ఓ బ్రహ్మ! నేను తెలిసికొనునట్లు సరిగాఁ జెప్పుము' అని నారదుఁడడుగఁగా సత్తముఁడైన బ్రిహ్మ చెప్పెను.

ఆఽనంతర్యాధి కారేచ మంగళార్థే ఽ థైవచ
అథ శబ్దస్త్వతః శబ్దో హేత్వర్థే సమదారితః"

అథ అను శబ్దము ఆనంతర్యాధికరమందును మంగళార్థమందును చెప్పఁబడెను. అతః అనునది హేత్వర్థకము అని. "ఎందువలన నారాయణుని యనుగ్రిహము లేకుండ మోక్షము లభ్యము కాదో, జ్ఞానము లేకుఁడ అనుగ్రిహమును లభింపదో, అందువలన బ్రహ్మ జిజ్ఞాస చేయవలసియున్నది." అని సిద్ధించినది.

జిజ్ఞాసింపఁదగిన బ్రహ్మము యొక్క లక్షణమీ విధముగాఁజెప్పఁబడినది.
'జన్మాద్యస్య యతః' (బ్ర. సూ. 1-1-2) సృష్టిస్థిత్యాదులు దేనివలన నగునో
అది బ్రహ్మము అని వాక్యార్థము. అట్లును స్కాందములోఁ జెప్పఁబడినది.

ఉత్పత్తి స్థితి సంహారా నియతిర్జ్ఞాన సమావృతిః
బంధమోక్షౌచ పురుషాద్యస్మాత్స హరి రేకరాట్

ఉత్పత్తి స్థితి ప్రళయములు నియతి, జ్ఞానము, ఆవరణము, బంధము,
మోక్షము ఏ పురుషునివల్ల గలుగునో అతఁడే హరి. ఏకాధిపతి.

'యతో వా ఇమాని భూతాని జాయంతే'

ఎందువల్ల ఈ భూతములు పుట్టుచున్నవో ఇత్యాది శ్రుతులవలనను బ్రహ్మ
లక్షణము చెప్పఁబడెను. అందు ప్రమాణము గూడఁ జెప్పఁడినది.

'శాస్త్రయోనిత్వాత్' శాస్త్రములు ప్రమాణమగుటవలన (బ్ర సూ. 1-1-3)
అని. నావేదవిన్మనుతే తం బృహంతం (తై. బ్రా. 3-5-9-7) ఆ గొప్ప
బ్రహ్మను వేదవేత్త కానివాఁడు తలఁపలేఁడు.

త్వం త్వౌవ నిషదం త్వా పృచ్ఛామి"

ఉపనిషత్తులచే గమ్యమైన యా పరమాత్మనే అడుగుచున్నాను.

(బృ. 3-9-2-6)

ఇత్యాది శ్రుతులను బట్టి అది కేవలము అనుమానికము కాదని నిరాకరింపఁ
బడుచున్నది। అనుమాన ప్రమాణము స్వతంత్రముగా ప్రమాణము గాదు.
అట్లు కూర్మ పురాణముఁ జెప్పఁబడినది.

'శ్రుతి సాహాయ్య రహితమనుమానం న కుత్రచిత్
నిశ్చయాత్సాధయేదర్థం ప్రమాణాంతర మేవచ'

శ్రుతి సాయములేని యనుమానముగాని ఇంకొక ప్రమాణముగాని ఎక్కడను
నిశ్చయమువల్ల అర్థమును సాధింపలేదు.

శ్రుతి స్మృతి సహాయం యత్ప్రమాణాంతర ముత్తమం
ప్రమాణ పదవాన్ గచ్ఛే, న్నాత్ర కార్యా విచారణా

శ్రుతి స్మృతుల సాయముగల యుత్తమమైన యితర ప్రమాణము ప్రమాణ పదమును పొందును. అందు ఆలోచింపఁ బని లేదు'. అని

శాస్త్ర స్వరూపము స్కాందములో నిట్లు చెప్పఁబడెను.

"ఋగ్యజుః సామాథర్వాచ భారతం పాంచరాత్రకం
మూల రామాయణం చైవ శాస్త్ర మిత్య భిధీ యతే"

ఋగ్వేదము, యజుర్వేదము, సామవేదము, అథర్వవేదము, భారతము, పాంచరాత్రము, మూల రామాయణము ఇవి శాస్త్రములని చెప్పఁబడును.

యచ్చానుకూలమే తస్య తచ్చశాస్త్రం ప్రకీర్తితం
అతోఽన్యో గ్రంథ విస్తారో నైవ శాస్త్రం కువర్త్మ తత్

పైదానికి అనుకూలమైనదియు శాస్త్రమనఁబడును. దీనికంటె నితరమైన గ్రంథ విస్తరము శాస్త్రము గాదు. అది కుమార్గము" అని.

పైఁ జెప్పిన ప్రమాణముచే "పాశుపతాది శాస్త్రములకంటె శాస్త్రార్థము అన్యలభ్యము కాదు. అనన్య లభ్యము శాస్త్రార్థము. అను న్యాయముచేత భేదము ప్రాప్తమగుటచేత 'అందు వేదవాక్యములకు తాత్పర్యము లేదు. కాని యద్వైతమందె తాత్పర్యము అను నద్వైతవాదుల ప్రత్యాశ నిరస్త మైనది. అనుమాన ప్రమాణమువలన ఈశ్వరుఁడు సిద్ధించక పోవుటచేత ఈశ్వరభేదము కూడ అందువలన సిద్ధించుట లేదు గాన. కనుక అవి భేదాను వాచకములు గావు అని శాస్త్రమునకు తత్పరత్వమె అవగతమగుచున్నది. కనుకనే యిట్లు చెప్పఁబడినది.

సదాగమైక విజ్ఞేయం సమతీతక్షరాక్షరం
నారాయణం సదావందే నిర్దోషా శేష సద్గుణం

(వి. త. 1)

ఒక్క సదాగమములచేతనే తెలియఁదగినవాఁడును, క్షరాక్షరముల దాటినవాఁడును, నిర్దోషుఁడు, అశేష సద్గుణములు గలవాఁడునగు నారాయణుని సర్వదా నమస్కరింతును. తత్తు సమన్వయాత్. ఆ శాస్త్ర ప్రమాణమైతే సమన్వయమువలన (బ్ర. సూ. 1-1-4) అనుదానిచే శాస్త్రము ప్రమా

ణము అని ప్రతిపాదింపఁబడినది. సమన్వయమనఁగా ఉపక్రమాది లింగము. అది బృహత్సంహితయందుఁ జెప్పఁబడెను.

"ఉప క్రమోప సంహారా వభ్యాసోఽపూర్వతా ఫలం
అర్థవాదోప పత్తీచ లింగతాత్పర్య నిర్ణయే"

ఉపక్రమము, ఉపసంహారము, అభ్యాసము, అపూర్వత, ఫలము, అర్థవాదము, ఉపపత్తి అనునవి తాత్పర్య నిర్ణయములో లింగము అని.

ఇట్లు వేదాంత తాత్పర్య నిర్ణయవశము వలన ఆ బ్రహ్మమే శాస్త్ర గమ్యము అని చెప్పఁబడినదగుచున్నది. ఇందు దిఙ్మాత్రముగా ప్రదర్శింపఁబడినది మిగిలినది పూర్ణప్రజ్ఞుఁడైన మధ్యమందిరునిచే (మధ్వాచార్యునికిది నామాంతరము) వాయువుయొక్క తృతీయావతారమని తలఁచుకొనునతనిచేత నిరూపింపఁబడెను.

"ప్రథమస్తు హనూమాన్స్యాద్ద్వితీయో భీమ ఏవచ
పూర్ణప్రజ్ఞ స్తృతీయశ్చ భగవత్కార్య సాధకః"

భగవంతుని కార్యమును సాధించు మొదటివాఁడైతే హనూమంతుఁడు (హనూ=జ్ఞానము, మంతుడు=జ్ఞాని అని దానికి అర్థము) రెండవవాఁడు భీముఁడు. మూఁడవవాఁడు పూర్ణప్రజ్ఞుఁడు.

కనుక సర్వశాస్త్రమునకు "విష్ణుతత్త్వమే సర్వోత్తమము" అను దానియందు తాత్పర్యము కాన సర్వము నిరవద్యము.

దీనినే ఉద్దేశించి అక్కడక్కడ గ్రంథసమాప్తియందు ఈ పద్యము లిఖింపఁబడుచున్నది.

యస్యత్రీణ్యుదితాని వేదవచనే దివ్యాని రూపాణ్యలం
వట్ తద్దర్శత మిత్థమేవ నిహితం దేవస్య భర్గో మహత్

ఏ వాయుదేవునియొక్క (అలందివ్యాని) అనుత్తమమైన క్రీడాది గుణయుక్త త్రిరూపములు వేదవచనమందు చెప్పఁబడెనో అవి ఆ వాయుదేవునియొక్క సమ్యగ్రూపము (మూలరూపము బట్) బలరూపమై (దర్శతం) దర్శనము=జ్ఞాన పూర్ణము భర్గః భరణ గమనగుణమైన మహద్రూపము. ఇట్లే ప్రేరితమై ముందుచెప్పఁబోవు రీతిలో రూపత్రయావతారముకై నిహితము యవతీర్ణమైనది.

వాయో రామవచో నయం ప్రథమకం పృక్షో ద్వితీయం వపు
ర్మధ్వో యత్తు తృతీయమేత దమునా గ్రంథః కృతః కేశవే
(మ. భా. తా. 28-181).

వాయువుయొక్క రామవాక్కుల నయము ఆజ్ఞారూపము గలిగినది. అనగా ఆంజనేయునిది మొదటిరూపము. పృక్షః కౌరవసేనాక్షయ (పృతం=సేనను క్షిణోతీతి పృక్షః) కరమైన రెండవ రూపము భీమునిది. మధ్వ మతమును నడిపిన రూపము మూడవది. అది ఈ మధ్వాచార్యునిచే మధు=ఆనంద, వ=తీర్థః ఆనందకరతీర్థము కేశవ విషయమై రచితము.

ఇక్కడ మధు అనఁగా ఆనంద తీర్థుడని భావము పదములో ఉకారమునకు లోపము ఆర్షము.

ఈ పద్యార్థమైతే "వళిత్థా తద్వ పుషే ధాయి దర్శతం
దేవస్య భర్గః సహసో యతోఽజని (ఋ. సం. మం)

బట్=ఇత్థా, బలము, ఇత్థా=ఇత్థం = ఈ విధముగా నున్నది. తద్వపుషే=వ్యవహారము కొఱకైన శరీరముకొఱకు, ధాయి=జఠరాగ్నిగా ధరింపబడుచున్నది దేవుని భర్గః=తేజస్సు సహసో=బలముగ అజని=పుట్టినది. (దీనిని సాయణుడు ఆదిత్యపరముఁగ వ్యాఖ్యానించెను.)

(సూ. 141) ఇత్యాది శ్రుతి పర్యాలోచనచే తెలియఁబడుచున్నది. అని. కనుక సర్వశాస్త్రముఁనకు విష్ణుతత్త్వమె సర్వోత్తమము అను దానియందు తాత్పర్యము కాన సర్వము అనవద్యము.

ఇది పూర్ణప్రజ్ఞ దర్శనము.

## — నకులీశుడు —

నకులీపాశుపత ప్రవర్తకుడగు నకులీశుడు దక్షిణ భారత దేశములో క్రీ. శ. అయిదవ శతాబ్దములో పుట్టెనని తెలియుచున్నది. అతఁడు పాశుపతమను పేరుగల గ్రంథమును రచించెను. ఈ మార్గము ననుసరించువారు నుదుటిపైని, రొమ్ముపైని, బొడ్డు మొదలగుచోట్ల శివలింగపు గుర్తులు ధరింతురు. హఠయోగముతో వీరికి గట్టి సంబంధము గలదు. ఈ మతము ననుసరించువారు కాపాలికులతో అఘోరజనులతో సంబంధము గలవారని యందురు. ఈ మత పద్ధతుల నవలంబిఁచువారిని గురువులందురు. ఈ మతానుయాయులు గురువుద్వారా జ్ఞానము పొందుదురు. భిక్ష యడిగి దారిలో పడిన అన్నముగాని, ఎంగిలి అన్నముగాని తినుటచే వారి మల దోషములు తగ్గునని తలతురు, ధ్యానాది క్రియలవలన ఆత్మతో ఈశ్వరునితో సంబంధము స్థిరపడును. వీరికి భస్మస్నానము, భస్మ శయనము మొదలగు క్రియలు వ్రతములు. మేల్కొన్నప్పటికిని నిద్రపోవువారివలె కనుపట్టుట, శరీర కంపము మొదలగునవి వారికి యోగద్వారములు. దుఃఖనాశము, ఐశ్వర్య ప్రాప్తియు ఈ రెండు వీరి శాస్త్రఫలములు. వీనిని వారు మోక్షములుగా తలతురు. ఈ మతావలంబులు దక్షిణదేశములో ఎక్కువగా కనిపింతురు.

ఈ నకులీశుని లకులీశుఁడనియు అందురు. లగుడి + ఈశుఁడు = దండధారి. బొమ్మలలో నిట్లు గలదందురు.

## — ఇంక నకులీశపాశుపత దర్శనము —

వైష్ణవమతము దాసత్వాది పదములచేఁ దెలియఁదగియున్నది. పరతంత్రుఁడై యుండుట దుఃఖావహము కనుక దుఃఖాంతాదికము ఈప్సితము నకు ఆస్పదము కాదు. "మోక్షమునందుఁగూడ పారతంత్ర్య నిమిత్తమైన దుఃఖమున్నది. వీరు విష్ణుసేవకులె. అని దీనినిష్టపడక" ఇతరులచే నంగీకరింపఁబడిన పారమైశ్వర్యమును గోరువారు అస్వతంత్రులు గాన ముక్తులుగారు పారమైశ్వర్య రహితులగుటవలన అస్మదాదులవలె"; "ముక్తాత్ములును పరమేశ్వర గుణసంబంధముగలవారు పురుషత్వము ఉండఁగా సమస్త దుఃఖబీజ విధురులగుట వలన-పరమేశ్వరునివలె" ఈ మొదలైన యనుమానమును ప్రమాణముగ గ్రహించి కొందఱు మాహేశ్వరులు పరమ పురుషార్థ

సాధనమైన పంచార్థ ప్రపంచన పరమైన పాశుపత శాస్త్రమును ఆశ్రయించు చున్నారు.

బ్రహ్మాద్యాః స్థావరాంతాశ్చ పశవః పరికీర్తితాః
తేషాం పతిర్మహాదేవః స్మృతః పశుపతిః శ్రుతౌ

అందులోని మొదటి సూత్రమిది. "అథాతః పశుపతేః పాశుపతయోగ విధిం వ్యాఖ్యాస్యామః" 'మతి యిఁక పశుపతియొక్క పాశుపత యోగవిధిని వ్యాఖ్యానింతుము అని. ఇందు అథ శబ్దము పూర్వ ప్రకృతమును అపేక్షించును. పూర్వ ప్రకృతమును గురువుగూర్చి శిష్యుని ప్రశ్నము. గురు స్వరూపము గణకారికలో నిరూపింపఁబడెను.

పంచ కాస్త్వష్ట విజ్ఞేయా గణశ్చైక స్త్రికాత్మకః
వేత్తా నవ గణస్యాస్య సంస్కర్తా గురు రుచ్యతే

అయిదేసి యవాంతర భేదములు గల లాభాదులు ఎనిమిది. మూఁడు విధములుగా నున్న గణము ఒకటి. మొత్తము ఈ తొమ్మిది గణములను దెలిసినవాఁడును సంస్కర్తయైనవాఁడును గురువని చెప్పఁబడును.

లాభా, మలా, ఉపాయాశ్చ, దేశావస్థా విశుద్ధయః
దీక్షాకారి, బలాన్యష్టౌ పంచకా, స్త్రీణివృత్తయః

లాభము, మలము, ఉపాయము, దేశము, అవస్థ, విశుద్ధి, దీక్షాకారులు, బలములు అని యెనిమిదియు ఇయిదేసి భేదములు గలవి. వృత్తులు మూఁడు. శ్లోకములో తిస్రః వృత్తయః అని స్త్రీ లింగము ప్రయోగింపవలసియుండఁగా త్రీణి అనుట ఆర్ష ప్రయోగము. అందు విధింపఁబడెడి యుపాయ ఫలము లాభము. అది 1 జ్ఞానము, 2 తపస్సు, 3 నిత్యత్వము, 4 స్థితి, 5 శుద్ధి అని యయిదు విధములు. ఆత్మను ఆశ్రయించిన దుష్టభావము మలము. అది 1 మిథ్యా జ్ఞానము, 2 అధర్మము, 3 సక్తి హేతువు, 4 చ్యుతి పశుత్వ మూలము అని యయిదు విధములు.

సాధకుని శుద్ధికి హేతువు ఉపాయము. అవి వాస చర్య, జపము, ధ్యానము, సదారుద్ర స్మృతి, ప్రపత్తి అని లాభముల యుపాయములు ఈ యయిదు.

అర్థాను సంధాన పూర్వకముగా జ్ఞాన తపోవృద్ధులను పొందఁజేయు గురు జనాదికము దేశము. అది గురువు, జ్ఞానము, గుహాదేశము, శ్మశానము, రుద్రుఁడు అని యయిదు విధములు.

లాభము ప్రాప్తించువఱకు ఒక విధముగా నున్నవాఁడు ఎట్లుండునో అది యవస్థ. అది వ్యక్తము, అవ్యక్తము, జయము (ఇంద్రియ జయము) దానము (సర్వస్వ త్యాగము), నిష్ఠ (భక్తి) అని అయిదు విధములు.

మిథ్యా జ్ఞానాదులకు అత్యంతము వ్యపోహము విశుద్ధి. అది అజ్ఞాన హాని, అధర్మహాని, సంగకరహాని, చ్యుతిహాని, పశుత్వ శుద్ధి అని యయిదు విధములు.

ద్రవ్యము, కాలము, క్రియ, మూర్తి, గురువు అని దీక్షాకారి అయిదు విధములు. 1 గురుభక్తి, 2 మతి ప్రసాదము, 3 ద్వంద్వ జయము, 4 ధర్మము, 5 అప్రమాదము అని బలము అయిదు విధములు.

పంచ మలములను లఘువుగాఁ జేయుటకు ఆగమ విరోధులు కాని యన్నార్జనోపాయము లు వృత్తులు. అవి భైక్ష్యము, ఉత్కృష్టము, యథా లబ్ధము అని పేరు గలవి. మిగిలినదంతయు ఆ మూల గ్రంథమందె కన వలయును.

ఇందు సూత్రము లోని అతః అనుశబ్దముచేత దుఃఖాంత ప్రతిపాద నము అగును. అది ఆధ్యాత్మికాధి దైవికాది భౌతిక రూప దుఃఖత్రయవ్య పోహ ప్రశ్న దుఃఖాంతమునుగూర్చి చేయబడును గదా. పశుశబ్దము పర తంత్రమును జెప్పునది గాన అది కార్యమునకు ప్రతిపాదనము. పతి శబ్దము ఈశ్వరుఁడు పతి ఈశిత అని జగత్తునకుఁ గారణమైన ఈశ్వరునిఁ జెప్పుట వలన పతి శబ్దము కారణమును జెప్పును. యోగవిధులైతే ప్రసిద్ధములే.

అందు దుఃఖాంతము ద్వివిధము. అనాత్మకము, సాత్మకము అని. అందు అనాత్మకము, సర్వదుఃఖములకు అత్యంతోచ్ఛేద రూపము. సాత్మక మైతే దృక్క్రియాశక్తి లక్షణమైన యైశ్వర్యము. అందు దృక్శక్తి ఏకరూప మైనను దర్శనము, శ్రవణము, మననము, విజ్ఞానము, సర్వజ్ఞత్వము అని

విషయభేదమును బట్టి ఉపచరింపఁబడుచున్నది. అందు దర్శనమనఁగా, సూక్ష్మవ్యవహిత విప్రకృష్టాశేష చాక్షుష స్పర్శాది విషయమైన జ్ఞానము. అశేష శబ్ద విషయమైన సిద్ధి జ్ఞానము మననము. నిరవశేష శాస్త్ర విషయకమైన నట్టియు, గ్రంథమువల్లను, అర్థమువల్లను గలిగిన సిద్ధిజ్ఞానము విజ్ఞానము. అందు ఇటువంటిది పంక్తి ఇటువంటిదా యర్థము. సంశయము లేకుండ దేనిచేతఁ జెప్పఁబడునో అది స్వశాస్త్రము. అదే శాస్త్ర ప్రవచనమునకు ఉపయోగించునది.

ఉక్తానుక్తాశేషార్థములందు సమాస విస్తర విభాగ విశేషముల రూపముగాను (సమాసాది వివరణము. చూ. 27 పుట.) తత్త్వమందు వ్యాప్తమై సదా ఉదితమైన సిద్ధి జ్ఞానము సర్వజ్ఞత్వము. అది బుద్ధి శక్తి, క్రియా శక్తి ఒక్కటైనను మూఁడు విధములుగా ఉపచరింపఁబడుచున్నది. మనోజవిత్వము, కామరూపిత్వము, వికరణ ధర్మిత్వము అని. అందు నిరతిశయ శీఘ్రకారిత్వము మనోజవిత్వము. కర్మాదులందు అపేక్ష లేనివాడు స్వేచ్ఛగానే అనంత సలక్షణ. విలక్షణ సరూపకరణములందు అధిష్ఠాతయై యుండుటయే కామరూపిత్వము. ఇది క్రియా శక్తి.

అస్వతంత్రమైనదంతయు కార్యము. జీవవర్గము జడవర్గము స్వస్వ గుణములతోఁ గూడినదంతయు స్వతంత్రము గాదు జీవులకు జడవర్గము అధీనమై యుండును. జీవులలో గూడ స్త్రీలు స్వతంత్రులు గారు పత్యధీనలు. సర్వము పరమేశ్వరాధీనము అది విద్య, కళ, పశువు అని త్రివిధము. వీనిని దెలిసికొన్నందువలన సంశయాదులు నివర్తించును. అందు పశుగుణము విద్య. అది 1 బోధ స్వభావములు 2 అబోధ స్వభావములు అని రెండు విధములు. బోధ స్వభావములు వివేకప్రవృత్తి, అవివేకప్రవృత్తి అని రెండు విధములు. అది చిత్తమనఁబడును. చిత్తము చేత సర్వప్రాణులును బోధరూపమైన ప్రకాశముచేత అనుగ్రహింపబడినవై సామాన్యముగా వివేచింపఁబడినట్టియు, వివేచింపఁబడనట్టియును నర్థమును తెలిసికొనును. అందు వివేకప్రవృత్తి ప్రమాణములచేత వ్యంగ్యమగును. పశువుల (జీవుల)

కొఱకైన ధర్మాధర్మముల రూపమైనది అబోధ రూపవిద్య. చేతనమునకు పరతంత్రమై యచేతనమగునది కళ. అదియుఁ గార్యకళ అని కారణకళ అని ద్వివిధము. అందు కార్యకళ పృథివి నీరు తేజస్సు వాయువు ఆకాశము లను పంచతత్త్వములును, రూప రసగంధ శబ్దస్పర్శలని గుణములైదు. కారణకళ పదమూఁడు విధములు జ్ఞానేంద్రియములైదు, కర్మేంద్రియము లైదు, అంతఃకరణములు అధ్యవసాయ వృత్తిగల బుద్ధి అభిమాన వృత్తి గల యహంకారము, సంకల్ప వృత్తిగల మనస్సు అని యంతఃకరణ భేదములు. పశుత్వ సంబంధము గలది పశువు. అదియు సాంజనము, నిరంజనము అని ద్వివిధము. శరీరేంద్రియ సంబంధము గలది సాంజనము, శరీరేంద్రియ సంబంధము లేనిది నిరంజనము. దాని విస్తరమైతే పచార్థ భాష్య దీపికాదులందుఁ జూడవలయును.

సమస్త సృష్టి సంహారములను అనుగ్రహించునది కారణము. అది యొక్కటైనను గుణకర్మ భేదములనుబట్టి పతి సాధ్యము, ఇత్యాదులచే విభాగము చెప్పఁబడినది. అందు పతిత్వము అనఁగా నిరతిశయ దృక్క్రియా శక్తి (పతి=ఆప్తి, పాతిచతాన్ పశూన్ ఇతిపతిః) గలిగియుండుట. దానితో ఈశ్వరునికి నిత్యసంబంధము గలదు. సాధ్యత్వమనఁగా ఆనాగంతుకమైన యైశ్వర్య సంబంధము గలిగియుండుట అని ఆదర్శకారాదులైన తీర్థంకరులచే నిరూపింపఁబడినది.

చిత్తము ద్వారా ఆత్మకు ఈశ్వరునికి సంబంధముండుటకుఁ గల హేతువు యోగము. అది క్రియాలక్షణము; క్రియోపరమలక్షణము అని ద్వివిధము. అందు క్రియా లక్షణము జపధ్యానాది రూపమైనది. క్రియోపరమ లక్షణమైనదైతే నిష్ఠ, సంవిత్తు, గతి మొదలైన పేర్లు గలది.

ధర్మార్థమును సాధించు వ్యాపారము విధి. అది ప్రధాన భూతము, గుణభూతము అని ద్వివిధము. అందు ప్రధానభూతము సాక్షాత్తుగా ధర్మమునకు హేతువైన చర్య. అది వ్రతము, ద్వారములు అని రెండు విధములు అందు భస్మము, స్నానము, శయనము, ఉపహారము, జపము, ప్రదక్షిణ

ములు వ్రతమనఁబడును. అది భగవంతుఁడైన నకులీశునిచేత నిట్లు చెప్పఁబడినది. భస్మముతో త్రిషవణము స్నానము చేయవలయును. భస్మమందు పరుండవలెను." అని. అందు ఉపహారము నియమము. అది ఆఱు అంగములు గలది. 'హసిత, గీత, నృత్య, హృడుక్కార, నమస్కార, జప్యరూప షడంగముల చేత ఈశ్వరుని సేవింపవలె' నని సూత్రకారుఁడు చెప్పెను. అందు హసితమనఁగా నోరు పెదవులు తెఱచి 'అహహహ' అని యట్టహాసము చేయుట. గాంధర్వ శాస్త్ర సమయమునను సరించి మహేశ్వరుని గుణ ధర్మాది నిమిత్తములను చింతించుట గీతము. నాట్యశాస్త్రమునను సరించి హస్త పాదాదులను ఉత్క్షేపణాదుల ద్వారా అంగ ప్రత్యంగోపాంగములతో భావాభావ సహితముగా ప్రయోగించుట నృత్యము. జిహ్వాతాలువుల సంయోగమువలనఁ గలిగిన పవిత్రమైన వృషభనాద సమానమైన నాదము హుడుక్కారము 'హుడుక్' అన్నది 'వషట్' అనుదానివలె శబ్దానుకరణము. లౌకికులున్నచోట ఇదియంతయు గూఢముగా ప్రయోగింపవలయును. మిగిలినది ప్రసిద్ధము. 1 క్రాథనము 2 స్పందనము 3 మందనము 4 శృంగారణము 5 అవితత్కరణము 6 అవితద్భాషణము అనునవి ద్వారములు. మేల్కొనియుండియే నిద్రించువాని చిహ్నములను జూపుట క్రాథనము, వాతరోగివలె శరీరావయవములను గదల్చుట కంపనము. కాళ్ళు ఇంద్రియములు విఱిఁగినవానివలె నడచుట మందనము. కామినిని జూచి తన్నుఁ గాముకునివలె విలాసాలను ప్రదర్శించుట శృంగారణము. కార్యాకర్య వివేకము లేనివానివలె లోకనిందితకర్మ లాచరించుట అవి (పి) తత్కరణము. వ్యాహతాసార్థకాది శబ్దములను పలుకుట అవి (పి) తద్భాషణము.

గుణభూతమైన విధియైతే చర్యను అనుగ్రహింపజేయు అను స్నానాదికము. భైక్ష్యోచ్ఛిష్టాదికము. అది నిర్మితమైన యయోగ్యతా ప్రత్యయనివృత్తికొఱకు. అదియు సూత్రకారునిచేత "అనుస్నాన నిర్మాల్య లింగధారి" అని చెప్పఁబడియె. అనుస్నానమనఁగా స్నానమునకు బదులుగా చేయు జలస్పర్శాచమన భస్మస్నానాదికము.

అందు సమాసమనఁగా ధర్మి మాత్రమును (ప్రస్తుత విషయమును

మాత్రమే) చెప్పుట. అది మొదటి సూత్రమందె చెప్పఁబడెను. అయిదు పదార్థములను ప్రమాణములను బట్టి అయిదు అని చెప్పుట విస్తరము. అది రాశికార భాష్యమునఁ జూడవలయును. (చూ. భైక్ష్యము ఉత్కృష్టము యథాలబ్ధము అనుచోట) వీనిని యథాసంభవముగా లక్షణమును బట్టి సాంకర్యము లేకుండఁ జెప్పుట విభాగము. అదియైతే చేయఁబడినదే. ఇతర శాస్త్రములకంటె గుణాతిశయముగా వీనిని జెప్పుట విశేషము. అది యెట్లనగా ఇతరమగుచోట దుఃఖాంతమనఁగా దుఃఖ నివృత్తియే. ఇందైతే పారమైశ్వర్య ప్రాప్తికూడ దుఃఖాంతమే. ఇతరమైనచోట కార్యమనఁగా ఇదివఱకుఁ గాకుండ ఇంకఁ గాఁబోవునది కార్యము. ఇందైతే నిత్యము పశ్వాదులు కార్యము. ఇతరమగుచోట కారణము అనఁగా అపేక్ష గలది. ఇందైతే కర్మకామములు మహేశ్వరుని అపేక్షించుట భగవానుడీశ్వరుడు. అతడు కర్మనుగాని పురుషునిగాని అపేక్షింపఁడు గాన నిరపేక్షుఁడైన భగవానుఁడే కారణము. ఇతరమగుచోట యోగమనఁగా కైవల్యాదిఫలములు గలది. ఇందైతే పారమైశ్వర్య దుఃఖాంతఫలము గలది. ఇతరమగుచోట విధి అనఁగా పునరావృత్తి రూపస్వర్గాది ఫలములు గలది. ఇందైతే పునర పునరావృత్తి రూప సామీప్యాది ఫలము గలది. (పునరావృత్తి లేని సామీప్య సారూప్య సాయుజ్య ఫలములు గలది.)

మఱి నిరపేక్షుఁడైన పరమేశ్వరుఁడు కారణమని యిట్లు చెప్పుట ఇది గొప్ప యింద్రజాలము. నిరపేక్షుఁడగు పరమేశ్వరుఁడు కారణమన్నచో కర్మలకు వైఫల్యమును, సర్వకార్యము ఒకే సమయమునఁ బట్టుట యను రెండు దోషములు ప్రాదుర్భవించును. వ్యధికరణమగుట (భిన్నాధారమగుట) వలన ఇట్లు తలఁపకుము. నిరపేక్షుడైన భగవంతుఁడు కారణమైనచో అప్పుడు కర్మ విఫలము కాఁగా వచ్చినదేమి? ప్రయోజనము లేకపోవుటే అన్నచో దేనికి ప్రయోజనము లేకపోవుట కర్మ వైఫల్యములోఁ గారణము.

కర్మికా లేక భగవంతునికా? ఈశ్వరునిచే ననుగ్రహింపఁబడిన కర్మ సఫలమగుట యుపపన్నమగుటవలన మొదటిది సరికాదు. ఈశ్వరునిచే

అనుగ్రహింపఁబడని దానికి యయాతి ప్రభృతుల కర్మవలె ఒకప్పుడు నిష్ఫలమగుట సంభవించుచున్నది. కనుకనుఁ ఇంతమాత్రముచేత కర్మలందు అప్రవృత్తి యుండదు. ఏలయన కర్షకాదులకువలె ఉపపన్నమగుచున్నది. పశువుల ప్రవృత్తి ఈశ్వరేచ్ఛకు అయత్తమగుటవలనను. పరమేశ్వరుఁడు పర్యాప్తకాముఁడగుటచేత కర్మచే సాధింపఁదగిన ప్రయోజనాపేక్ష లేకపోవుటవలన రెండవ పక్షమును సరికాదు. ఒకే సమయమందు పుట్టుక కలుగునని చెప్పఁబడినదియు అచింత్యశక్తి గల పరమేశ్వరుని యిచ్ఛను అనుసరించి జరుగు నవ్యాహత క్రియాశక్తి కార్యకారిణి యగునని యంగీకరించుటవల్ల యుక్తము గాదు. అది సంప్రదాయవేత్తలచే నిట్లు చెప్పఁబడెను.

> కర్మాది నిరపేక్షస్తు స్వేచ్ఛా చారీయతో హ్యయం
> తతః కారణతః శాస్త్రే సర్వకారణ కారణం.

కర్మాది నిరపేక్షుఁడైన యితఁడైతే ఎందువలన స్వేచ్ఛాచారియో అతఁడు ఆకారణము వలన శాస్త్రమునందు సర్వకారణములకు కారణము అని.

ఆయితే మఱి 'ఈశ్వర జ్ఞానము వలన మోక్షము లభించు చునే యున్నది.' అని యితర దర్శనమునందుఁ జెప్పఁబడినది కాన ఎందువలన దీనికి విశేషము గలదు అని. వికల్పముల యనుపపత్తివల్ల – ఇట్లు చెప్పకుము. ఈశ్వర విషయ జ్ఞానమాత్రమే నిర్వాణమునకుఁ గారణమా? లేక ఈశ్వర సాక్షాత్కారమా లేక తగినరీతిగా తత్త్వ నిశ్చయమా? మొదటిది కారణము కాదు శాస్త్ర జ్ఞానము లేకుండఁ గూడ ప్రాకృత జనులవలె 'మహాదేవుఁడు దేవులకు అధిపుఁడు' అను జ్ఞానోత్పత్తి మాత్రముచేతనే మోక్షము సిద్ధించు చుండగా శాస్త్రాభ్యాసము విఫలము కావలసివచ్చును. ఈశ్వర సాక్షాత్కరము కూడఁ గారణము కాదు. అనేక మల ప్రచయములచే వృద్ధి పొందిన, చర్మచక్షువులగు పశువులకు ఈశ్వర సాక్షాత్కారము అనుపపన్నమగుచున్నది గాః, ఇంక తగినరీతిగా తత్త్వ నిశ్చయము కారణమన్నచో అపుడు అది పాశుపత శాస్త్రము లేకుండ తగినట్లు తత్త్వ నిశ్చయము అనుప

పన్నమగుట వలన – అది మా మతములోనికే వచ్చిపడుచున్నది. అది యిట్లు ఆచార్యులచేఁ జెప్పఁబడినది.

జ్ఞానమాత్రే వృథాశాస్త్రం సాక్షాద్దృష్టిస్తు దుర్లభా
పంచార్థా దన్యతో నాస్తి యథావత్ తత్త్వ నిర్ణయః

ఆచరణలేని జ్ఞానమాత్రముచేత శాస్త్రము వ్యర్థము. సాక్షాద్దృష్టియైతే దుర్లభము. పంచార్థముకంటె నితరమైనదానివలన తగినట్లు తత్త్వ నిశ్చయము కలుగదు." అని.

కనుక పురుషార్థమును గోరు పురుష దురంధరులచేత పంచార్థములను ప్రతిపాదించుటయె తాత్పర్యముగాఁ గల సమర్థమైన పాశుపత శాస్త్రమును ఆశ్రయింపవలయును.

ఇది నకులీశ పాశుపత దర్శనము.

———

## శైవులు

ఈ శైవ సంప్రదాయమెప్పుడు బయలుదేఱెనో తెలియదు. పురాణములలో శైవ పురాణములు కూడ నున్నవి. మేవాడుకు పడమరగా సిరోహి ప్రదేశమందున్న అర్బుదగిరి దగ్గర శివమందిరములో క్రీ. శ. 727 నుండి 1877 వరకు శైవమత సంబంధి శాసనములున్నవి. క్రీ. శ. 2వ శతాబ్దిలో కాన్యకుబ్జ ప్రదేశములోని గుప్తరాజులు శైవులె, బసవేశ్వరుడు శైవుడు. మాలవపతి, విక్రమాదిత్యుడును శివోపాసకులె పురాణములలో కొన్ని లింగాది పురాణములు శైవములు. గుప్తరాజుల పాలనలో నాణెములమీద నంది, త్రిశూలము, సింహవాహన, శివశక్తి మొదలగు గుర్తులు ముద్రింపబడినవి. బసవరాజు దగ్గర మహాదేవభట్టు కుమారుడైన బసవన్నరాజు బావమరిది మంత్రిగానుండి శైవమత ప్రచారము చేసెను.

భట్టనాయకుని కుమార్తె పద్మావతిని వివాహమాడెను. బ్రాహ్మణుడయ్యు రాజునకు తన కూతురును ఇచ్చుటచే ఆ బ్రాహ్మణులు పద్మావతి సోదరుడైన బసవన్నను వెలివేసిరి. అందుచే బసవన్న జాతి కులములను ఏకము చేసెను. పిదప ఆ సంప్రదాయమె వీరశైవము లింగాయతము అను పేర్లతో ప్రసిద్ధికెక్కెను. అందఱు కలిసి పంక్తి భోజనములు చేసిరి. ఈ సమయములో బ్రాహ్మణులకు జైనులకు పెద్ద జగడమయ్యెను. పిదప బసవనికి జయమయ్యెను. ఆ విధముగ బసవని ద్వారా శైవము ప్రసిద్ధి పొందెను. బసవన్న బసవ పురాణమును రచించెను.

## శైవ దర్శనము

ఫలసిద్ధికి కర్మాదులను అపేక్షింపని పరమేశ్వరుఁడు అన్నిటికి కారణము అనెడి ఈ పక్షము లో విషయము నిర్దయుడు అగును అను దోషములచే దూషితమగుటవలన దీనిని ద్వేషించువారైన కొందఱు మాహేశ్వరులు శైవాగమ సిద్ధాంత తత్త్వము సరియైనదని తలఁచి 'కర్మాదులను బట్టి ఫలితముల నిచ్చెడి యీశ్వరుఁడే కారణము'. అను పక్షమును కక్షముగాఁ

జేయుచు' పతి (ఈశ్వరుడు), పశువు (జీవుడు), పాశము (సంసారబంధము) అని పదార్థములు మూఁడు' అని పక్షాంతరమున జెప్పుచున్నారు. అది యిట్లు తంత్ర తత్త్వజ్ఞులచేఁ జెప్పఁబడినది. బీజమున్నను మబ్బు నీరు లేనిదే మొలవనట్లు అన్నియున్నను పతిలేక ఫలితము కలుగదు.

"త్రిపదార్థం చతుష్పాదం మహాతంత్రం జగద్గురుః
సూత్రేణైకేన సంక్షిప్య ప్రాహ విస్తరతః పునః"

పతి పశువు పాశము అను మూఁడు పదార్థములు విద్య క్రియ యోగము చర్య అను నాలుగు పాదములు గల మహా తంత్రమును జగద్గురువు ఒక సూత్రముచే సంక్షేపించి ఇటుల విస్తరించి చెప్పెను. అందు పశువులు (జీవులు) అస్వతంత్రులుగాన పాశములు అచైతన్యములు గాన వానికంటె విలక్షణమైన పతి స్వరూపము ముందు చెప్పఁబడెను.

చేతనత్వమైన పతితో సాదర్శ్యముండుట వలన పశువులు తరువాత చెప్పఁబడెను. ఇంక మిగిలినవి పాశములుగాన తరువాతఁ జెప్పఁబడెను. ఇది వీని క్రమము. దీక్షపరమ పురుషార్థమునకు హేతువుగాన అది పశు పాశేశ్వర స్వరూపమును నిర్ణయించుటకు ఉపాయమైన మంత్ర తంత్రేశ్వ రాది మాహాత్మ్య నిశ్చయకమైన జ్ఞానము లేకుండఁ గలుగఁజేయుట అశక్య మగుటవల్ల దానిని దెలుపు విద్యాపదము ముందుగాఁ జెప్పఁబడెను. అది పదముచే విద్య ఈశ్వరుడు పశువిశేషములు గ్రహింపబడును. దివ్యజ్ఞానమిచ్చి పాపక్షయము చేయునది దీక్ష అని తత్త్వవేదులు, అనేక విధమైన సాంగ విధులను జూపు క్రియాపదము దాని పిదపఁ జెప్పఁబడెను. యోగము లేకుండ అభిమతము సిద్ధింపదు గాన అంగములతోఁ గూడిన యోగమును దెలుపు యోగపధము తరువాతఁ జెప్పఁబడెను. విహితమైనదానిని ఆచరించుట నిషిద్ధమైన దానిని వర్జించుట అను రూపము గల చర్య లేకుండ యోగము కూడ నిర్వహింపదుగాన దానిని దెలుపు చర్యాపదము చివర చెప్పఁబడెనని తెలియునది.

అందు పతి యనఁగా శివుఁడు. ఆలోచింపఁగా ముక్తాత్ములగు విద్యేశ్వరాదులకు శివత్వమున్నది. అయినను వారు పరమేశ్వర పరతంత్రులు

గాన వారికి స్వాతంత్ర్యము లేదు. కనుకను తనువులు కరణములు భువనములు మొదలగు భావములు సంనివేశ (అవయవ రచనా) విశిష్టములుగాన కార్యములని తెలియుచున్నది. ఆ కార్యత్వముచేత ఇవి బుద్ధిపూర్వకముగాఁ జేయఁబడినవని యనుమానము చేయఁబడుచున్నది. కాన అనుమాన ప్రమాణమును బట్టి పరమేశ్వర సిద్ధి యుపపన్నమగుచున్నది.

సరేకాని దేహమె కార్యమని సిద్ధించుట లేదె. ఒకచోటను ఎవనిచేతను ఒకప్పుడును దేహము చేయఁబడుచున్నట్లు ఇదివఱలోఁ జూడఁబడుట లేదే. అన్నచో నిజమె. అట్లు అయినను ఎవరో యొకరిచేఁ జేయఁబడుచున్నట్లు దేహము చూడఁబడుట లేదు గాన కర్త కనిపించుటలేదు. అనుట యుక్తము గాదు. ఆ కర్త కలఁడనుట అనుమేయముగాఁ గూడ ఉపపన్నమగును. ఎట్లనః– దేహాదికము కార్యమగుటకు వీలున్నది. సంనివేశ విష్టమగుట వలన వినశ్వరమగుటవలనఁ గాని ఘటాదులు వలె ఆ కార్యత్వముచేత ఇది బుద్ధిపూర్వకముగా రచింపఁబడినదని యనుమానించుట సులభమె. విమతము (వివాదగ్రస్తమైన దేహాదికము) కార్యమగుటవలన ఘటమువలె కర్త గలది. ఏది చెప్పఁబడిన సాధనములు గలదో అది చెప్పఁబడిన సాధ్యములు గలది ఎట్లన అర్థాదులు. ఏది ఇట్లు కాదో అది యిట్లు కాదు. ఎట్లన, ఆత్మ మొదలైనవి. పరమేశ్వరుఁ డున్నాఁడని యనుమానించు ననుమాన ప్రామాణ్య సాధనము ఇంకొకచోట చేయఁబడినది గాన విరమింపఁ బడుచున్నది.

> అజ్ఞో జంతు రనీశో౽య మాత్మనః సుఖదుఃఖయోః
> ఈశ్వర ప్రేరితో గచ్ఛేత్ స్వర్గం వా శ్వభ్ర మేవ వా"

"అజ్ఞుఁడైన ప్రాణి తన సుఖ దుఃఖములకుఁ బ్రభువు కాఁడు. ఆ ప్రాణి ఈశ్వర ప్రేరితుఁడై స్వర్గమును గాని, శ్వభ్రమును (నరకమును) గాని పొందును."

అను న్యాయముచేత ప్రాణులచేతఁ జేయుబడిన కర్మలను అపేక్షించుట చేత ఈశ్వరునికి కర్తృత్వము ఉపపన్నమగుచున్నది. కారణములను అపేక్షించినంత మాత్రముచేత కర్త అస్వతంత్రుఁడుగ కానేరఁడు. కనుక పర

మేశ్వరునికి స్వాతంత్ర్యము లేదనరాదు. కోశాధ్యక్షుని యపేక్ష యున్నంత మాత్రమున రాజు అనుగ్రహించి దానము చేయుటలో అస్వతంత్రుఁడగునా. ఇది సిద్ధ గురువులచేత నిట్లు చెప్పఁబడినది.

"స్వతంత్రస్యా ప్రయోజ్యత్వం కరణాది ప్రయో క్తృతా
కర్తుః స్వాతంత్ర్యమే తద్ధి న కర్మా ద్యనపేక్షతా"

కరణాదులను ప్రయోగించుట స్వతంత్రునికి విఘాతకము గాదు. ప్రయోజక శూన్యత్వము కాదు. ఇది కర్తకు స్వాతంత్ర్యమె. కాని కర్మాదులను అపేక్షింపక పోవుట కాదు. అని.

స్వతంత్రునికి స్వానభీప్సిత కార్యప్రవర్తన యుండదు లేక స్వాభీప్సిత కార్య విఘాతకత్వము ఉండదు. కరణాదులను ప్రయోగించుట యుండును.

కనుక తత్తత్కర్మాశయ వశము వలన భోగ భోగసాధన భోగోపాదానాది విశేషజ్ఞుఁడైన కర్త అనుమానాదులచే సిద్ధించుచున్నాఁడని సిద్ధించినది. ఇది పూజ్యుడైన బృహస్పతిచేతఁ జెప్పఁబడినది.

"ఐహిక భోగ్య భోగ సాధన తదుపాదానాది యో
విజానాతి, తమృతే భవేన్నా హీదం పుంస్కర్మాశయ విపాకజ్ఞం

"ఇందు భోగ్యమును భోగ సాధ్యములను భోగోపాదానాదులను ఎవ డెఱుగునో వాఁడు లేకుండ ఇది పురుష కర్మాశయ పరిణామమును దెలిసినది కానేరదు అని. ఇట్లు ఇతరమగు చోట్లను జెప్పఁబడినది.

"వివా దాధ్యసితం సర్వం బుద్ధి మత్కర్తృ పూర్వకం
కార్యత్వా దావయో స్సిద్ధం కార్యం కుంభాదికం యథా"

"బుద్ధిగల కర్త పూర్వమునుండునట్లు గలదంతయు వివాదముతోఁగూడినది. మనము దేహాదికము (జీవేశ్వరుల) కార్యమగుటవలన ఘటాదులవలె కార్యమని సిద్ధించినది" అని.

అన్నిటికిఁ గర్తయగుట వలననే ఇతఁడు సర్వజ్ఞుఁడు. అజ్ఞుఁడు

ముఖ్య కారణమనుట సంభవింపదు గదా. శ్రీ మన్మృగేంద్రులచేఁ జెప్పఁ బడినది కూడ –

సర్వజ్ఞః సర్వ కర్తృత్వాత్ సాధనాంగ ఫలైః సహ
యో యజ్జానాతి కురుతే సత దేవేతి సుస్థితం"

సర్వజ్ఞుఁడు సర్వకర్త కాన సాధనాంగ ఫలములతోఁ గూడ ఎవఁడు దేనిని దెలియునో వాఁడు దానినే చేయును. అని స్థిరపడినది.

అయితే మరి స్వతంత్రుఁడైన యీశ్వరుఁడే కర్త యగుఁ గాక. అతఁడు శరీరము లేనివాఁడు మాత్రము కాఁడు. ఘటాది శరీరము, శరీరము గల కుమ్మరి మొదలగువారి చేతఁ జేయఁబడుచున్నట్లు చూడఁబడుచున్నది గనుక ఈశ్వరునికి శరీరము ఉన్నపుడు మనబోటివారివలె ఈశ్వరుఁడు క్లేశ యుక్తుఁడై సర్వజ్ఞుడు కాకుండఁ బరిమితమైన శక్తి గలవాఁడయి యుండవలసి వచ్చును గద. అన్నచో ఇట్లు తలఁపరాదు. శరీరము లేకున్నను ఆత్మ శరీర చాలనాదులలో కర్తగాఁ గనఁబడుచున్నది గదా. సరే పోనీ నీవు చెప్పినదానిని సరేయని అంగీకరించి కూడఁ జెప్పుచున్నాము. భగవంతునికి శరీరమున్నదన్నను ఇదివఱలోఁ జెప్పఁబడి దోషములు పట్టవు. పరమేశ్వరునికి దోషములు కర్మాది పాశజాలములు సంభవింపవు గనుక. ప్రాకృత శరీరము ఉండుట సంభవింపదు. కాని శక్తికి సంబంధించిన శరీరము సంభవించును. శక్తి రూపము గల యీశానాది పంచ మంత్రముల చేత మస్తకాదులను గల్పింపఁగా ఈశ్వరుఁడు ఈశాన మస్తకుఁడై తత్పురుష వక్త్రుఁడై, అఘోర హృదయుఁడై, వామదేవ గుహ్యుఁడై, సద్యోజాత పాదుఁడై యుండునను ప్రసిద్ధిచేత వరుసగా అనుగ్రహము తిరోభావము ఆదానము స్థితి ఉద్భవము అను వీని లక్షణములు గల కృత్య పంచకము కారణముగాఁ గల స్వేచ్ఛా నిర్మితమైనది ఆ యీశ్వరుని శరీరము మన శరీరమువంటిది గాదు. అది శ్రీ మన్మృగేంద్రులచేఁ జెప్పఁబడెను.

"మలా ద్యసంభవా చ్ఛక్త్రం వపుర్నైతాదృశం ప్రభోః"

మలాదులు సంభవింపకపోవుట వలన ప్రభువుయొక్క శరీరము శాక్తమైనది గాని ఈ మన శరీరమువంటిది గాదు." అని.

ఇంకొకచోటను జెప్పఁబడినది.

తద్వపుః పంచభి ర్మం త్రైః పంచకృత్యోపయోగిభిః
ఈశ తత్పురుషా ఘోర వామాద్యై ర్మస్తకాది మత్"

పంచకృత్యములందు ఉపయోగించు ఈశ, తత్పురుషాఘోర, వామాదులైన పంచ మంత్రములచేత ఆ యీశ్వరుని శరీరము మస్తక, ముఖ, హృదయ, గుహ్య, పాదములనునవి గలది.

అయితే మఱి "పంచ వక్త్రిఁడు త్రిపంచ దృక్" ఇత్యాది రూపముగా ఆగమములందు పరమేశ్వరునికి ముఖ్యముగనే శరీరేంద్రియ సంయోగము లినఁబడుచున్నదే' అన్నచో నిజమే నిరాకారునియందు ధ్యాన, పూజాదులు సంభవింపవు గాన భక్తులకు అనుగ్రహించుటకై ఆయా యాకారములను గ్రహించుటలో విరోధము లేదు అది శ్రీమత్పౌష్కరమందుఁ జెప్పఁబడినది.

"సాధకస్యతు రక్షార్థం తస్యరూప మిదం స్మృతం"

సాధకుని రక్షణకొఱకై అతనికి ఈ రూపము స్మృతమైనది" అని ఇంకొక చోటను జెప్పఁబడినది.

"ఆకార వాం స్త్వం నియమా దుపాస్యో
న వస్త్వ నాకార ముపైతి బుద్ధిః"

అకారముగల నీవు నియమమువల్ల ఉపాసింపఁదగినవాఁడవు. ఆకారములేని వస్తువును బుద్ధి పొందదు" అని. కృత్య పంచకముకూడ భోజరాజుచే విస్తరించి చెప్పఁబడినది.

పంచవిధం తత్కృత్యం సృష్టి స్థితి సంహార తిరోభావః
తద్వ దనుగ్రహకరణం ప్రోక్తం సతతోదితస్యాస్య"

'సంతతము ఉదయించి యున్న ఈశ్వరునికిఁ గల యాకృత్యము అయిదు విధములు. 1 సృష్టి 2 స్థితి 3 సంహారము 4 తిరోభావము 5 అనుగ్రహ కరణము. అని.

ఈ యయిదు కృత్యములకు శుద్ధమార్గ విషయములో సాక్షాత్తు శివుడె కర్త. కృచ్ఛ్రమార్గ విషయములో అనంతాదుల ద్వారా శివుఁడు కర్త అని తెలియఁదగును. అది శ్రీమత్కరణమందు ఇట్లు చెప్పఁబడెను.

'శుద్ధేఽధ్వని శివః కర్తా, ప్రోక్తోఽనంతోఽహితే ప్రభోః
శుద్ధ మార్గమున శివుఁడు కర్త. ప్రభువుయొక్క అహిత మార్గమున అనంతుఁడు కర్త." అని.

ఇట్లును శివ శబ్దముచేత శివత్వ యోగము గల సమాధవాచకులైన మంత్ర, మంత్రేశ్వర, మహేశ్వర, ముక్తాత్మ శివులకు శివత్వ ప్రాప్తికి సాధనమైన దీక్షాద్యుపాయ కలాపములోఁ గూడ పతి శివ పదార్థమందు సంగ్రహము చేయఁబడెనని తెలియఁదగును. ఇట్లు పతి పదార్థము నిరూపింపఁబడెను.

ఇపుడు పశుపదార్థము నిరూపింపఁబడుచున్నది. అణువు కానట్టియు, క్షేత్రజ్ఞాది పదములచేఁ దెలిసికొనఁ దగినట్టియునగు జీవాత్మ పశువు. చార్వాకాదులు చెప్పినట్లు దేహాదిరూపమైనది పశువు కాదు. అట్లన్నచో 'అన్యునిచేఁ జూడఁబడినదానిని అన్యుఁడు స్మరింపఁడు' బాల్యమునందుఁ జూడఁబడినదానిని తరుణావస్థయందు స్మరింపడు అను న్యాయముచేత ప్రతిసంధానము అనుపపన్నము కావలసివచ్చును. నైయాయికులు చెప్పినట్లు ప్రకాశింపఁ దగినదియుఁ గాదు. అట్లన్నచో అది యింకొకదానిచే ప్రకాశింపఁ జేయఁదగినది, అది యింకొకదానిచే, అది యింకొకదానిచే అని యిట్లు అనవస్థా దోషము పట్టును.

అది యిట్లు చెప్పఁబడినది —

"ఆత్మా యది భవేన్మేయ స్తస్య మాతా భవేత్పరః
పర ఆత్మా తదా నీంస్యాత్స పరో యది దృశ్యతే"

ఆత్మ మేయము (ప్రమాణ వేద్యము) అయినచో దానికి ఇంకొకఁడు మాత (ప్రమాణ విదుఁడు) ఉండవలెను. ఆ ఇంకొకఁడు చూడఁబడినచో అపుడు ఆత్మ యింకొకటి యగును" అని.

దేశకాలములచే అనవచ్ఛిన్నుఁడు గాన (కొలవరానివాఁడు, లేక ఈ దేశమున్నవాఁడు ఈ కాలమందున్నవాఁడు అని చెప్పరానివాఁడు గాన) జైనులు చెప్పినట్లు అవ్యాపకమును, బౌద్ధులు చెప్పినట్లు క్షణికమును గాదు. అదియు నిట్లు చెప్పఁబడినది.

"అనవిచ్ఛిన్న సద్భావం వస్తు య ద్దేశ కాలతః
తన్నిత్యం విభు చేచ్ఛంతీ త్యాత్మనో విభునిత్యతా"

దేశ కాలములను బట్టి ఏ వస్తువుయొక్క యునికి సంకుచితము కాదో ఆ వస్తువు నిత్యము విభువు అని యందురు. కాన ఆత్మ విభువు నిత్యమును." అని.

పురుష బహుత్వమును దెలుపు భోగములను గూర్చిన నియమము సంభవించుట వలన అద్వైతవాదులు చెప్పినట్లు ఆత్మ ఏకము ను గాదు. పాశ జాలములను గప్పివైచుటలో అందు నిత్య నిరతిశయ దృక్క్రియా రూప చైతన్యాత్మక శివత్వము వినిపించుటవలన సాంఖ్యులు చెప్పినట్లు ఆత్మ అకర్తయుం గాదు. అది శ్రీ మన్మృగేంద్రులచేఁ జెప్పఁబడినది.

'పాశాంతే శివతా శ్రుతేః' పాశాంతమున జీవాత్మలకు శివత్వము సిద్ధించునని వినఁబడుటవలన" అని.

చైతన్యం దృక్క్రియా రూపం తదస్త్యాత్మని సర్వదా
సర్వతశ్చ యతో ముక్తౌ శ్రూయతే సర్వతోముఖం.

'అన్నివైపుల నెందువలన ముక్తియందు చైతన్యము సర్వతోముఖమై వినఁబడుచున్నదో అట్టి చైతన్యము దృక్కుయొక్క క్రియ రూపము గలదై ఆత్మయందు ఎల్లపుడు ఉన్నది. అని తత్త్వ ప్రకాశమందును నిట్లు చెప్పఁబడినది —

ముక్తాత్మనోఽపి శివాః కింత్వేతే యత్ప్రసాదతో ముక్తాః
సోఽనాది ముక్త ఏకో విజ్ఞేయః పంచమంత్ర తనుః"

"ముక్తాత్మలు గూడ శివములే. కాని యివి ఏ శివుని ప్రసాదము వల్ల ముక్తములైనవో ఆ శివుఁడు అనాదినుండియు ముక్తుఁడే. ఒక్కఁడే యని తెలియఁదగినవాడు. పంచ మంత్రములే శరీరముగాఁ గలవాఁడు" అని.

పశువు త్రివిధము, విజ్ఞానాకలము, ప్రళయాకలము, సకలము అని.

అందు మొదటిది విజ్ఞాన, యోగ, సంన్యాసములచేతఁ గాని భోగము చేతఁగాని కర్మక్షయము కలుగఁగా, కర్మ క్షయము కొఱకైన కలాది భోగ

బంధము లేకపోవుట వలన కేవల మలము మాత్రము కలది విజ్ఞానాకలము అని వ్యవహరింపఁబడుచున్నది. రెండవదైతే ప్రళయముచేత కలాదులు ఉపసంహరించుట వలన మలకర్మ యుక్తమైనది ప్రళయాకలమని వ్యవహరింపఁబడుచున్నది. మూఁడవదైతే మలమాయా కర్మల రూపమైన బంధత్రయముతోఁ గూడినది సకలము అని చెప్పఁబడుచున్నది.

అందు మొదటిది సమాప్త కలుషము అసమాప్త కలుషము అని రెండు విధములు అందు కాలుష్య పరిపాకముగల, పురుష ధౌరేయులను అధికార యోగ్యులైన మొదటివారైన సమాప్త కలుషులను అనుగ్రహించి అనంతాది విద్యేశ్వరాష్ట పదమును పొందించును. బహు దైవత్వములో ఆ విద్యేశ్వరులు ఎనమండుగురు ఇట్లు నిర్దేశింపఁబడిరి.

"అనంతశ్చైవ సూక్ష్మశ్చ తథైవ చ శివోత్తమః
ఏకనేత్ర స్తథైవైక రుద్రశ్చాపి త్రిమూర్తికః
శ్రీ కంఠశ్చ శిఖండీచ ప్రోక్తా విద్యేశ్వరా ఇతి"

"అనంతుఁడు, సూక్ష్ముఁడు, శివోత్తముఁడు, ఏకనేత్రుఁడు, ఏకరుద్రుఁడు, త్రిమూర్తికుఁడు, శ్రీకంఠుఁడు, శిఖండి అని విద్యకు ఈశ్వరులు ఎనమండుగురు." అని. చివరి యసమాప్త కలుషులు ఏడుకోట్లమంది. వారు మంత్రములచేత అనుగ్రహింపఁబడని కరణములు గలవారు. ఈ సంగతి తత్త్వ ప్రకాశమునఁ జెప్పఁబడినది.

పశవస్త్రి విధాః ప్రోక్తా విజ్ఞాన ప్రళయ కేవలౌ సకలః
మలయుక్త స్తత్రాద్యో మల కర్మయుతో ద్వితీయః స్యాత్

పశువులు మూడు రకములుగా చెప్పఁబడిరి. 1 విజ్ఞాన కేవలములు (విజ్ఞానాకలములు) ప్రళయ కేవలములు (ప్రళయా కలములు) సకలము అని. అందు మొదటిది మలయుక్తము రెండవది మలకర్మయుతము అని. కళలు=ఏడు. =మనోబుద్ధి చిత్తము లు మూఁడు. ఇంద్రియములు పది. శబ్దాది తన్మాత్రలు అయిదు పంచభూతాలు. మొత్తము ముప్పయి. ఇది సకలము.

మలమాయా కర్మయుతః సకల స్తేషు ద్విధా భవేదాద్యః
ఆద్యః సమాప్త కలుషోఽ సమాప్త కలుషో ద్వితీయః స్యాత్

ఆద్యాననుగృహ్య శివో విద్యేశత్వే నియోజయత్యష్టౌ
మంత్రాంశ్చ కరోత్స పరాంస్తే చోక్తాః కోటయః సప్త.

మలమాయా కర్మయుక్తము సకలము. వానిలో మొదటిది రెండు రకములు. అందులో మొదటిది సమాప్త కలుషము. రెండవది అసమాప్త కలుషము. శివుడు మొదటి రెండిటిని అనుగ్రహించి విద్యేశ్వత్వమునందు ఎనమండురను నియోగించు మంత్రి మలములను చేయును. మిగిలిన వారు ఏడుకోట్ల మంది. సోమశంభువు కూడ చెప్పెను —

విజ్ఞానాకలనా మైకో ద్వితీయః ప్రళయా కలః
తృతీయః సకలః శాస్త్రేను గ్రాహ్యస్త్రివిధోమతః
తత్రాద్యో మల మాత్రేణ యుక్తో ఽన్యో మల కర్మభిః
కలాది భూమి పర్యంత తత్త్వైస్తు సకలోయుతః ఇతి.

౧ విజ్ఞానాకలము 2 ప్రళయాకలము 3 సకలము శాస్త్రములందను గ్రహింపఁ దగినది మూడు విధములు. అందు మొదటిది మలమాత్ర యుక్తము. మల కర్మలతో గూడినది ఇంకొకటి. కళలు మొదలు భూమివరకు గలది సకలము అని.

ప్రళయాకలముకూడ ద్వివిధము. పక్వపాశద్వయము తద్విలక్షణము అని. అందు మొదటి పక్వపాశద్వయము మోక్షమును పొందును. రెండవదైతే అష్టపురములతోఁ గూడినదై కర్మవశమువలన నానావిధ జన్మలను పొందినదగును. ఇట్లు తత్త్వ ప్రకాశమందును జెప్పఁబడెను. అష్ట పురములు గూడ అందే యిట్లు నిర్దేశింపఁబడినవి.

"స్యాత్పుర్యష్టక మంతః కరణం ధీకర్మకరణాని"

1 మనస్సు 2 బుద్ధి 3 అహంకారము 4 చిత్తము అను నంతః కరణము బుద్ధి కర్మయైన 5 భూతములు 6 తద్గుణములు 7 జ్ఞానేంద్రియములు 8 కర్మేంద్రియము లనుకరణములు ఈ యెనిమిది యష్టపురములు". అని.

పై శ్లోకమునకు అర్థము అఘోరశివాచార్యునిచేత నిట్లు వివరింపఁబడి

నది. అష్ట పురములనఁగా ప్రతి పురుషునికి నియతమై, సృష్టి మొదలుకొని కల్పాంతము వఱకుఁగాని మోక్షాంతము వఱకుఁగాని యున్న, పృథివ్యాది కళలవఱకు గల ముప్పది తత్త్వముల రూపమైన సూక్ష్మదేహములు. అట్లను తత్త్వ సంగ్రహమందుఁ జెప్పఁబడినది —

వసుధా ద్యస్తత్త్వ గణః ప్రతిపుం నియతః కలాంతోఽయం
పర్యటతి కర్మవశాద్భువ నజ దేహే ష్వయం చ సర్వేషు

"భూమి మొదలైన తత్త్వ గణము ప్రతి పురుషునియందు నియతమైనది కలల చివరవరకు ఉండును. ఇది కర్మవశము వలన లౌకిక సర్వదేహము లందు పర్యటించును." అని.

ఇందువలన దీనికి ఇట్లు అర్థము కలుగుచున్నది. మనో బుద్ధ్యహం కార చిత్తవాచియయిన యంతఃకరణ శబ్దముచేత పురుషునికి భోగవ్యాపార మందు అంతరంగములైన కలా కాల, నియతి, విద్యా, రాగ, ప్రకృతిః గణములనెడి యితరమైన యేడు తత్త్వములును ఉపలక్షింపఁబడుచున్నవి. ధీ కర్మ శబ్దముచే జ్ఞేయములైన పంచభూతములు, తత్కారణములు, తన్మాత్రలును వివక్షింపఁబడుచున్నవి. కరణశబ్దముచేత జ్ఞాన కర్మేంద్రియములు పది సంగ్రహింపఁబడు చున్నవి. అయితే సరే మఱి శ్రీ మత్కాలోత్తర మందు—

"శబ్దః స్పర్శ స్తథారూపం రసోగంధశ్చ పంచకం
బుద్ధిర్మన స్త్వ హంకారః పుర్యష్టక ముదాహృతం"

శబ్దస్పర్శ రూప రసగంధములును బుద్ధి, మనస్సు, అహంకారములు పుర్యష్టమని చెప్పఁబడెను." అని వినఁబడుచున్నదే. పైని వేఱుగఁ జెప్పఁ బడినదేమి అన్నచో నిజమే. కనుకనె పూజ్యుఁడైన రామకాండునిచేత ఆ సూత్రము ముప్పది తత్త్వముల పరముగా వ్యాఖ్యానింపఁబడినది. అయినను ఇది యష్ట పురములు గలదెట్లగును. 1 భూతములు, 2 తన్మాత్రలు, 3 జ్ఞానేంద్రియములు, 4 కర్మేంద్రియములు, 5 అంతఃకరణములు అను పేరు గల యయిదు వర్గములచేతను, 6 తత్కారణముచేతను, 7 కలాది పంచక

రూపమైన వర్గముచేతను, 8 పరమేశ్వరునిచేత ఆరంభింపఁబడిన దగుటవల్ల అష్టపురములు గలది. కాన విరోధము లేదు. అందు అష్టపురములతోఁగూడిన, విశిష్ట గుణసంపన్నులైన కొందఱను అనుగ్రహించి యిందు మహేశ్వరుఁడైన యనంతుఁడు భువనపతిత్వమును ఇచ్చును. అదియు నిట్లు చెప్పఁబడినది —

"కాంశ్చి దనుగృహ్య వితరతి భువన పతిత్వం మహేశ్వర స్తేషాం"

కొందఱను అనుగ్రహించి మహేశ్వరుఁడు వారికి భువన పతిత్వమును ఇచ్చును." అని.

సకలము కూడ ద్వివిధము. పక్వ కలుషము అపక్వ కలుషము అని. అందు మొదటి పక్వ కలుషులను పరమేశ్వరుఁడు వారి పరిపాక పరిపాటిచేత వారికి అనుగుణమైన శక్తి పాతముచేత మండల్యాద్యష్టోత్తర శతమైన మంత్రేశ్వర పదమును పొందించును. అది యిట్లు చెప్పఁబడెను.

"శేషా భవంతి సకలాః కలాది యోగాదహర్ముఖే కాలే
శత మష్టాదశ తేషాం కురుతే స్వయమేవ మంత్రేశాన్

"మిగిలిన సకలులు కలాది సంబంధము వలన దినముఖ కాలమందు శేషులు అగుదురు. "స్వయముగనే పరమేశ్వరుఁడు వారిలో పదునెనిమిది వందల మందిని మంత్రేశులను జేయును." అని.

తత్రాష్టౌ మండలినః క్రోధాద్యా స్తత్సమాశ్చ వీరేశః
శ్రీకంఠః శతరుద్రాః శతమిత్యష్టా దశాభ్యధికం"

అందు క్రోధాదులు మండలులు ఎనమండుగురు. వీరేశుఁడు శ్రీ కంఠుఁడు శతరుద్రుఁడు అను వారు తత్సములు. నూట పదునెనమండుగురు" అని.

వారి పరిపాకాధిక్యమును నిరోధించుట రూపమైన శక్త్యుప సంహార రూపమైన దీక్షాకరణముచేత ఆచార్యమూర్తిని పొంది పరమేశ్వరుఁడు మోక్షప్రదుఁడగును. అదియునిట్లు చెప్పఁబడెను —

"యథాఽనాది ర్మల స్తస్య కర్మాల్పక మనాదికం
యద్య నాది న సంసిద్ధం వైచిత్ర్యం కేన హేతునా"

'ఎట్లు దాని మలము అనాదియో అట్లే అల్పకమైన కర్మయు అనాదియే. అది యనాది యైనచో ఎందుచేత దానికి విచిత్రత్వము సిద్ధము కాదు" అని.

దీని యందు శక్తి రూపముగా ప్రళయమందు సర్వ జగత్తును మాతిదు పట్టుచున్నది, సృష్టి యందు వ్యక్తిని (మాతి+ఆయాతి=పట్టుచున్నదై వచ్చుచున్నది) పొందుచున్నది గాన మాయ అని వ్యుత్పత్తి. అది శ్రీమత్పౌర భేయు మందు జెప్పఁ బడినది–

శక్తి రూపేణ కార్యాణి తల్లీనాని మహాక్షయే
వికృతౌ వ్యక్తి మాయాతి సా కార్యేణ కలాదినా"

'మహాక్షయ మందు కార్యములు శక్తి రూపముగా ఆపరమేశ్వరుని యందు లీనమగును. వికృతిలో అది కలాది రూప కార్యములో వ్యక్తమగు చున్నది'.

ఇందుఁ జెప్పవలసినది చాల యున్నది. కాని గ్రంథ విస్తర భీతిచే ముగింపఁబడుచున్నది. ఇట్లు పతి పశు పదార్థములు మూఁడు ప్రదర్శింపఁ బడెను.

పతి విద్యే తథాఽవిద్యా పశుః పాశశ్చ కారణం
తన్ని వృత్తా వితి ప్రోక్తాః పదార్థా షట్ సమాసతః

1. పతి (ఈశ్వరుడు) 2. విద్య 3. అవిద్య 4. పశువు (జీవుడు) 5. పాశము (మలాదికము) 6. పాశవృత్తి యందు కారణము (జపధ్యానాదికము) అని ఆఱు పదార్థములు సంగ్రహముగాఁ జెప్పఁ బడినవి' అని యీ విధముగా జ్ఞాన రత్నావళి మొదలగు వాని యందు ఇతర విధముగాఁ జెప్పఁ బడెను. అది యంతయు అందుండియె" తెలియఁ దగినది.

ఇది

చర్ల గణపతి శాస్త్రిచే తెనిఁగింపఁ బడిన
సాయణ మాధవీయమైన సర్వ దర్శన సంగ్రహమున
శైవదర్శనము

ఇది

## ప్రత్యభిజ్ఞా దర్శనకర్త

ప్రత్యభిజ్ఞా దర్శన మార్గము కాశ్మీర దేశములో క్రీస్తు శకము 6వ శతాబ్దిలో స్థాపింపబడెను. ఈ సంప్రదాయములలో గోసాయి సాధువులు ఎక్కువ మంది కనిపింతురు. త్రిపుండ్రములు, భస్మ, రుద్రాక్షలు ధరింతురు. శివలింగమును పూజించుచు శివభక్తులై యుందురు. వీరు కాశ్మీరములో ఎక్కువగా నుండిరి. దీనిని అభినవ ప్రచారము చేసెను. అభినవగుప్తుడు క్రీ.శ. 960-1030 లో నుండెను. భరత నాట్య శాస్త్ర టీక, కావ్య కౌతుక సారము, తంత్ర సారము, తంత్రాలోకము, నాట్యలోచనము, పరమార్థ సారము మొదలు 5 గ్రంథముల రచించెను. ప్రత్యభిజ్ఞా దర్శనమును సోమానంద నాథుడు, ఉత్పలాచార్యుడు, ఉదయాకర వసూనుడు మొదలగు వారు దీని వర్తకులు.

శైవ సూత్రములకు కర్త వసుగుప్తుడు వీనికి కారిక వ్రాసిన వారు. భట్ట కల్లటుడు కాశ్మీర రాజు అనంత వర్మ యాస్థానములో నుండెను. క్రీ.శ. 8.30 లో నుండెను.

ఉత్పల దేవుడు ప్రత్యభిజ్ఞ అను గ్రంథము రచించెను. రాజానక క్షేమ రాజు పండితుడు. ఈశ్వర ప్రత్యభిజ్ఞా హృదయము అను గ్రంథము రచించెను.

## ప్రత్యభిజ్ఞా దర్శనము

ఇందుఁ అపేక్ష ఈశ్వరుని యిచ్ఛ) లేని జడములకుఁ గారణత్వము దూషిత మగు చున్నదని తలంచి సంతోషింపని వారై ఇంకొక మతము అన్వేషించుచు పరమేశ్వరుని యిఛ్ఛా వశము వలననే జగత్తు నిర్మాణమగు చున్నదని పరిఘోషించుచు స్వానుభవముచేత అనుమానముచేత స్వసంవేద పపత్తి చేత శైవాగమ సిద్ధమైన ప్రత్యగాత్మల తాదాత్మ్య మందు నానా విధ మైన మాన మేయాది భేదా భేదములను పొందు పరమేశ్వరుఁడు అనన్య ముఖ లక్షణములు గల స్వాతంత్ర్యమును పొందిన వాఁడై తన యాత్మ

దర్పణ మందు భావములను ప్రతిబింబములను వలె భాసింపఁ జేయుచున్నాడు అని చెప్పుచు బాహ్యాభ్యంతర చర్యలు ప్రాణాయామాది క్లేశ ప్రయాసకలాపములు లేకుండనె సర్వులకు సులభమైన ప్రత్యభిజ్ఞా మాత్రమైనకొత్తదైన పరాసిద్ధికి పరాశక్తి=అవరసిద్ధి=దేవలోకప్రాప్త్యా సిద్ధి ఉపాయమును అంగీకరించుచు ఇతరులైన మహేశ్వరులు ప్రత్యభిజ్ఞా శాస్త్రమును నేనీశ్వరుడనే కాని అన్యుడను కాను అనెడి సాక్షాత్కారమును బోధించుశాస్త్రమును అభ్యసించు చున్నారు. దాని ఇయత్త కూడ పరీక్షకులచే నిరూపింపఁబడినది.

"సూత్రం వృత్తి ర్వివృత్తి ర్లఘ్వీ బృహతీత్యుభే విమర్శిన్యౌ
ప్రకరణ వివరణ పంచకమితి శాస్త్రం ప్రత్యభిజ్ఞాయాః
'పరిపక్వ మలానేతా నుత్పాదన హేతుశక్తి పాతేన
యోజయతి పరే తత్త్వేస దీక్షియాననచార్య మూర్తిస్థః

పరిపక్వము గల వీరిని ఉత్పాదనమునకు హేతువైన శక్తిపాతము చేత ఆ పరమేశ్వరుడు ఆచార్యమూర్తి యందు ఉన్నవాడై దీక్షచేత పరతత్త్వమందుఁ గూర్చును." అని.

శ్రీ మన్మృగేంద్రమందును జెప్పఁబడెను.
'పూర్వం వ్యత్యాసిత స్యాణోః పాశజాల మపోహతి"

పూర్వము వ్యత్యాసము చేయబడిన జీవత్వములు పొందుచు అనాది సంస్కార జీవాణువు యొక్క పాశజాలమును పోగొట్టి మోక్షమిచ్చును.

నారాయణ కంఠుని చేత వ్యాకరింపఁబడినది కూడ. ఆది యంతము అందుండియె తెలియఁ దగినది. విస్తర భీతి చేత ప్రస్తావింపఁ బడుటలేదు. అపక్వ కలుషులును ద్ధులును నగు నణువులను (జీవులును) పరమేశ్వరుఁడు వారి. కర్మ వశము వలన భోగ భాజనులను జేయును. అదియుఁ జెప్పఁబడెను

బద్ధా నవశేషా నపరాన్ వినియుంక్తే భోగ భుక్తయే పుంసః
తత్కకర్మణా మనుశయా దిత్యేవం కీర్తితాః పశవః"

బద్ధులైన మిగిలిన యితరులైన పురుషులను వారి కర్మలను అనుసరించుట

వలన భోగానుభవము కొఱకు వినియోగించును.' అని ఇట్లు పశువులు చెప్పఁబడెను." అని

ఇంక పాశ పదార్థము చెప్పఁబడుచున్నది. 1. మలము 2. కర్మ 3. మాయా నిరోధము 4. శక్తి అని పాశము నాలుగు విధములు. సరే కాని—

'శైవాగమేషు ముఖ్యం పతి పశు పాశా ఇతిక్రమాత్త్రి తయం
తత్ర పతిః శివ ఉక్త పశవో హ్యణవోఽర్థః పంచకం పాశాః'

'శైవాశమము లందు పతి, పశువులు, పాశములు అని మూడు ముఖ్యము.' అందు పతి యనఁగా శివుఁడు. పశువులు, అణువులు అర్థ పంచకము పాశములు" అని పాశము అయిదు విధములుగఁ జెప్పంబడినదే మఱి యిందు నాలుగు విధములని చెప్పంబడినదేమి అన్నచో - దాని విషయము ఇటఁ జెప్పఁబడుచున్నది— శివ తత్త్వ పదము చేతఁ దెలుపఁ దగిన మాయారూపమైన బిందువునకు శివ పద ప్రాప్తి లక్షణము గల పరము ముక్తిని అపేక్షించుట చేత పాశత్వము అన్నను దాని సంబంధమునకు విద్యేశ్వరాది పద ప్రాప్తికి హేతువగుట చేత ఆ పరము క్తి కలదగుట వలన పాశముగా స్వీకరింపఁ బడలేదు కాన విరోధము లేదు. కనుకనే తత్త్వ ప్రకాశములో "పాశాశ్చతు ర్విధాః స్యుః" పాశములు నాలుగు విధములై యుండునని చెప్పఁబడెను. శ్రీ మన్మృగేంద్ర మందును జెప్పంబడెను—

పాప్రవృతీశౌ బలం కర్మ మాయాకా ర్యం చతుర్విధం
పాశజాలం సమాసేన ధర్మా నామైవ కీర్తితాః"

ప్రావృతి (అశుచిమలము) ఈశుఁడు బలము కర్మ అని మాయా కార్యము నాలుగు విధములు. పాశములతో సంగ్రహముగా నామము చేతనే వాని ధర్మములు చెప్పఁ బడెను. ప్రకర్షముగా తన స్వాభావిక దృక్కును క్రియను ఆవరించును గాన ప్రావృతి అశుచి మలము.

స్వతంత్రముగా (ఈష్టే) శక్తి గలవాఁడు అగుచున్నాఁడు. కాన ఈశుఁడు అని వ్యుత్పత్తి. అది యిట్లు చెప్పఁబడెను—

(ఈ క్రిందిది 195 పుట తరువాత చదువుకొనవలెను.)

'ఏకో హ్యనేక శక్తిర్దృక్ క్రియయో శ్చాదకో మలః పుంసః
తుష తండులవద్ జ్ఞేయ స్తామ్రాశ్రిత కాలికా వద్వా"

'ఒకటే అనేక శక్తులు గలదై దృష్టిని క్రియను ఆచ్ఛాదించును. అది పురుషులలోని మలమె. అది బియ్యము పైని గల యూక వంటిది, రాగిని ఆశ్రయించిన కాలికము వంటిది గాని యగును." అని.

రోధశక్తియె. బలము ఈ శక్తిని పాశాధిష్ఠానము చేత పురుషులకు తిరోధాయకమగుట వలన ఉపచారము చేత (లక్షణ చేత) పాశము అనఁ బడెను. అది యిట్లు చెప్పఁ బడెను.

'తాసాం మహం వరా శక్తిః సర్వానుగ్రాహికా శివా
ధర్మాను వర్తనా దేవ పాశ ఇత్యుప చర్యతే"

'వానిలో సర్వమును అనుగ్రహింపఁ జేయు శివమైన వరశక్తిని నేను. ధర్మములను అనుసరించుట చేతనే పాశమని యుపచరింప బడుచున్నది. అని.

ఫలార్థులచేతఁ జేయఁ బడుచున్నది.' కాన కర్మ అని వ్యుత్పత్తి., అది ధర్మా ధర్మ రూపమైనది. అది చెట్టుముందా విత్తుముందా అను దాని వలె ప్రవాహ రూపముగా అనాది యైనది. అట్లును శ్రీమత్కిరణ మందు జెప్పఁ బడినది-

("ఏకో" నుండి) ఇంతవరకు 195 పుటలోను అక్కడిది ఇక్కడను ఇక్కడది అక్కడను చేర్చి చదువుకొనవలెను.)

'సూత్రము, వృత్తి, వివృతి ప్రకరణ వివరణము అను ఈ ఆయిదు గలది. ప్రత్యభిజ్ఞా శాస్త్రములో లఘ్వి, బృహతి అనునవి ఎక్కువ విమర్శ గలవి" అని అందు మొదటి సూత్రమిది.

'కథంచి దాసాద్య మహేశ్వరః స్యాత్,
దాస్యం జనస్యా ప్యుపకార మిచ్ఛన్
సమస్త సంపత్సమ వాప్తి హేతుం,
తత్ప్రతి జ్ఞాముప పాదయామి-

'ఏదో విధముగా పరమేశ్వరుని కంటె నభిన్నుఁడైన గురువు యొక్క చరణార వింద యుగళమును పరమేశ్వర ఘటితముగా ఆరాధించుట చేత పరిపూర్ణముగా అడ్డులేని స్వాత్మోప భోగ్యత్వమును పొందించి మహేశ్వరుఁడు కావలెను. ఆమహేశ్వరుని దాస్యమును జనులకు కూడ ఉపకారమును గోరుచు సమస్త సంప దవ్యాప్తికి కారణమైన యీ ప్రత్యభిజ్ఞను ఉపపాదింతును: అని. మాయను దాటిన వారైనను మహా మాయచే నియుక్తులైన విష్ణు బ్రహ్మాదులు ఎవని యైశ్వర్య లేశముచే ఈశ్వరులైరో అట్టి అనవచ్ఛిన్న (దేశకాలముచేఁ గొలువరాని) ప్రకాశానంద స్వాతంత్ర్య పరమార్థము గల భగవంతుడు మహేశ్వరుడునగు. ప్రభువుచే నితఁడు కోరిన దంతయు నివ్వఁబడును. (దీయతే అస్మై సర్వం ఇతి దాసః) గాన దాసుఁడు పరమేశ్వర స్వరూప స్వాతంత్ర్యమునకు పాత్రమని భావము. అట్టి దాసుని భావము దాస్యము. జన శబ్దము చేత అధికారి విషయ నియమము లేకపోవుట ప్రదర్శింపఁ బడెను. ఎవని కెవనికి ఈ స్వరూప కథన ముండునో వాని వానికి మహాఫలము కలుగును. ప్రజ్ఞానమే గదా పరమార్థము నకు ఫలము. అట్లు శివదృష్టి యందు పరమ గురువులైన భగవత్సోమానంద నాథ పాదులచే నిట్లు ఉపదేశింపఁ బడినది.

'ఏకవారం ప్రమాణేన శాస్త్రాద్వా గురు వాక్యతః
జ్ఞాతే శివత్వే సర్వస్థే ప్రతి పత్త్యా దృఢాత్మనా'
కరణేన నాస్తి కృత్యం క్వాపి భావనయాఽపివా
జ్ఞాతే సువర్ణే కరణం భావనాం వా పరిత్యజేత్

ఒకసారి ప్రమాణము చేత శాస్త్రము వల్లఁగాని గురు వాక్యమువల్లఁగాని సర్వ మందున్న శివత్వము ప్రతిపత్తిచే దృఢాత్మచే తెలియఁ బడఁగా కరణముతోఁ బ్రయోజనము లేదు. భావనచేఁ గాని ఎచ్చటను బ్రయోజనము లేదు. సువర్ణము తెలియఁ బడఁగా కరణమును భావనను గాని పరిత్యజింపవలెను." అని. పై సూత్రములో 'జనులకుఁగూడ' అనుచోట కూడ అను సముచ్చయము చేత తనకు వారితో అభేదమును ఆవిష్కరించు పూర్వత్వము చేత తన యందు పరార్థ సంపత్తికంటె నితరమైన ప్రయోజనాంత

రావకాశమును నిరాకరింపఁబడినది. తల్లక్షణ సంబంధము వలన పరార్థము కూడ ప్రయోజనమె యగును. స్వార్థమందే ప్రయోజన ముండ వలయునని పరార్థమందు ఉండరాదని నియమము లేదు గదా. కనుక అక్షపాదునిచే నిట్లుఉక్తము.

'యమధి కృత్య ప్రవర్తతే తత్ప్రయోజనం (న్యాయ దర్శ 1.12.4.) దేనిని గుఱించి ప్రవర్తించునో అదే ప్రయోజనము 'అని. 'ఉపపాదింతును' అనుచోట ఉపశబ్దము సమీపార్థకము కనుక జనులకు పరమేశ్వర సామీప్యము గలిగించుట యెల్ల ఫలమె. కనుకనె 'సమస్త అని చెప్పఁబడెను. పరమేశత్వము సిద్ధింపఁగా, మేరు పర్వతము లభింపఁగా రత్న సంపదలు వలె సర్వ సంపదలు పరమేశ్వర నిష్యంద మయములైె సంపన్నములె అగును. ఇట్లు పరమేశ్వరత్వము లభింపఁగా ఇంక ప్రార్థింపఁ దగినదేమి. అది యిట్లు ఉత్పలా చార్యులచేఁ జెప్పఁబడెను–

'భక్తి లక్ష్మీ సమృద్ధానాం కిమన్య దుపయాచితం
వీతయావా దరిద్రాణాం కిమన్య ద వయాచితం"

"భక్తి రూపమైన లక్ష్మీ సమృద్ధిగా నున్నవారలు యాచింపవలసిన దేమున్నది. ఈ భక్తి లక్ష్మీ లేని వారలు యాచింప రానిదింక నేమున్నది." అని.

ఇట్లు 'సమస్త సంపదల అవాప్తికి హేతువైన ప్రత్యభిజ్ఞ' అని షష్ఠీ సమాస పక్షమునఁ బ్రయోజనము చెప్పఁ బడినది. ఇంక బహుప్రీహి సమాస పక్షమునఁ బ్రయోజనమును జెప్పుదుము. సమస్త (బాహ్యాంతర నిత్య సుఖాదికము యొక్క సంపద యొక్క (సిద్ధికి అట్టి ప్రకాశము యొక్క) సమ్యగవాప్తి ఏ ప్రత్యభిజ్ఞకు హేతువో అది (సమ్యగవాప్తిః హేతుః యస్యాః సా) సమస్త సంప దవాప్తి హేతువు. ఆ మహేశ్వరుని ప్రత్యభిజ్ఞ అనఁగా అభిముఖ్యముగా జ్ఞానము. లోకమున 'ఈ చైత్రుఁడతఁడే' అని ప్రతి సంధానముచేత అభిముఖముగాఁ జేయఁ బడిన వస్తువు నందు జ్ఞానము ప్రత్యభిజ్ఞ అని వ్యవహరిఁ బడుచున్నది. ఇందుఁ గూడఁ బ్రసిద్ధమైన పురాణములచే సిద్ధమై, ఆగమాను మానాదుల చేత జ్ఞాతమై పరిపూర్ణ శక్తి కల పరమేశ్వరుడు ఉన్న తన యాత్మ యందు అభిముఖుఁడు కాఁగా అ పరమేశ్వరుని

శక్తిని ప్రతి సంధానము చేయుటచేత 'నిజముగా ఆ పరమేశ్వరుఁడే నేను' అని జ్ఞానము ఉదయించు చున్నది. ఆయీ ప్రత్యభిజ్ఞను ఉప పాదించు చున్నాను. ఆ ప్రత్యభిజ్ఞ యొక్క ఉపపత్తి అనఁగా సంభవము. ఆ ప్రత్య భిజ్ఞ సంభవించు చున్నదని తత్సమర్థా చరణ రూపమైన ప్రయోజనము వ్యారపాముచేత సంపాదించుచున్నాను అని యర్థము.

ఈశ్వర స్వభావ మందే ఆత్మ ప్రకాశించుచున్నచో అపుడు ఈ ప్రత్య భిజ్ఞ ప్రదర్శన ప్రయాస చేతఁ బ్రయోజనమేమి అన్నచో అందు గల సమాధి యిది. ముఖ్యాశయము స్వ ప్ర కా శ ము గా ఎల్లప్పుడు ఆత్మ ప్రకాశించు చున్నను మాయా వశము వలన భాగముగా ప్రకాశించు చుండగా పూర్వత్వావ భాస సిద్ధి కొఱకు దృక్క్రియా రూపశక్తి అవిష్కరించుట చేత ప్రత్యభిజ్ఞ ప్రదర్శింపఁ బడుచున్నది. అపు డనుప్రయోగ మిది— ఈ యాత్మ పరమేశ్వరుఁడు కాఁదగి యుండును జ్ఞాన క్రియా శక్తి గల వాఁడు గాన. ఎవఁడు ఎంత మాత్రమందు జ్ఞాతయును కర్త యునగునో ఆతఁడు అంత మాత్రమందు ఈశ్వరుఁడు ప్రసిద్ధేశ్వరుఁడు వలెఁ గాని రాజు వలెఁ గాని 'ఆత్మ విశ్వ జ్ఞాతయు కర్తయును. కనుక' 'ఇది ఈశ్వరుఁడె' అని. మాయను అంగీకరించి నట్లే నైయాయిక మతమును అంగీకరించుట వలన అను మానావయవ పంచకము. ఆశ్రయింపఁ బడినది. ఆది యుదయకర సూనునిచే నిట్లు చెప్పఁ బడినది.

కర్తరి జ్ఞాతరి స్వాత్మ న్యాది సిద్ధే మహేశ్వరే
అజడాత్మా నిషేధంవా సిద్ధివా విదధీతకః

"కర్తయు జ్ఞాతము ఆది సిద్ధుడు తన యాత్మ యందు మహేశ్వరుఁడు అయిన మహేశ్వరుని విషయము జడాత్మగాని యెవఁడు నిషేధమును గాని ఈశ్వ రత్వ సిద్ధిని గాని చేయును.

"కింతు మోహవశా దస్మిన్ దృష్టేఽ ప్యనుప లక్షితే
శక్త్యా విష్కరణే వేయం ప్రత్యభిజ్ఞోప దర్శ్యతే"

కాని మోహవశము వలన ఇతఁడు చూడఁ బడినను ఉపలక్షితుఁడు గాని వానియందు శక్తిచే అవిష్కరించుట చేత ఈ ప్రత్యభిజ్ఞ అతడే యితఁడని

చూపఁబడుచున్నది. ఎట్లనఁగా

"సర్వేషామిహ భూతానాం ప్రతిష్ఠా జీవ దాశ్రయా
జ్ఞానం క్రియాచ భూతానాం జీవతాం జీవనం మతం

ఇందు సర్వ భూతములకు ప్రతిష్ఠ జీవించిన వారినాశ్రయించినది. జ్ఞానము క్రియయును జీవించుచున్న భూతములకు జీవనము.

తత్ర జ్ఞానం స్వతస్సిద్ధం క్రియా కార్యా శ్రితా సతీ
పరైర ప్యుప లక్ష్యేత తదాన్య జ్ఞానముచ్యతే

'అందు జ్ఞానము స్వతస్సిద్ధమైనది. క్రియ కార్యమును ఆశ్రయించినదై యితరుల చేతఁగూడ ఉపలక్షింపఁబడును. అపుడు అది అన్యజ్ఞాన మనఁబడును. అని

యా చై షాం ప్రతిభా తత్తత్పదార్థ క్రమరూపితా
అక్రమానంద చిద్రూపః ప్రమాతా స మహేశ్వరః

వీరి ప్రతిభ ఆయా పదార్థముల క్రమముచే నిరూపింపఁబడినది. ప్రమాత క్రమములేని యానంద చిద్రూపుఁడు. అతఁడే మహేశ్వరుఁడు అనియును సోమానంద నాథ పాదులచేతను గూడఁ జెప్పఁబడినది.

'సదా శివాత్మనా వేత్తి, సదా వేత్తి మదాత్మనా'

"ఎల్లపుడును శివాత్మచే నెఱుగును. ఎల్లపుడును శివశక్తి రూపముగా నెఱుంగును". ఇత్యాదికము. జ్ఞానాధికార పరిసమాప్తి యందును జెప్పఁబడెను.

'తదైక్యేన వినా నాస్తి సంవిదాంలోకపద్ధతిః
ప్రకాశై క్యాత్తదేకత్వం మాత్రైకః స ఇతి స్థితిః

'తదైక్యము లేకుండ జ్ఞానములకు లోకపద్ధతిలేదు ప్రకాశైక్యమువల్ల తదైక్యము కలుగును. మాత(ప్రమాత) ఒకఁడె అతఁడు అని స్థితి.

" స ఏవ విమృశత్వేన నియతేన మహేశ్వరః
విమర్శ ఏవ దేవస్య శుద్ధే జ్ఞాన క్రియే యతః"

'ఎందువలన శుద్ధమైన జ్ఞానక్రియలు దేవునికి విమర్శమో అందువలన అతఁడే జ్ఞానక్రియాశక్తి రూపముగ నియతముగ మహేశ్వరుఁడు" అని. ఇది యభినవ గుప్త పాదాచార్యులచే వివరింపఁబడినది కూడ.

'తమేవ భాంత మనుభాతి సర్వం తస్యభాసా సర్వమిదం విభాతి'
(కఠ. 2-2)

అనుశ్రుతిచేత ప్రకాశ చిద్రూప మహిమచేత సర్వమైన భావజాతము భాసకమగునని యంగీకరింపఁబడుచున్నది. అందువలనను నీల ప్రకాశము పీతప్రకాశము అని విషయ ప్రకాశమునకు విషయముల యుపరాగ భేదమును బట్టి భేదము కలుగుచున్నది. వాస్తవమునకు దేశకాలాకార సంకోచము లేక పోవుట వలన అభేదమె. ఆ చైతన్య రూపమైన ప్రకాశమె ప్రమాత అని చెప్పఁబడుచున్నది. అట్లును శివ సూత్రములందు పఠింపఁబడినది. 'చైతన్య మాత్మ' 'చైతన్యము ఆత్మ' అని. చిద్రూపము, అనవచ్ఛిన్న విమర్శము, అనన్యోన్ముఖము, ఆనందైక ఘనము, మాహేశ్వరము అని దానికిఁ బర్యాయములు. ఈ భావరూపమైన విమర్శము శుద్ధమైన పారమార్థిక జ్ఞానక్రియలు అదే గదా. అందు ప్రకాశ రూపత్వము జ్ఞానము. స్వతస్సిద్ధముగా జగన్నిర్మాతృత్వము క్రియ. అదియును క్రియాధికారమందు నిరూపింపఁబడినది.

'ఏషచానంద శక్తిత్వాదేవ మా భాసయత్యమూన్
భావా నిచ్ఛావశా దేషాం క్రియా నిర్మాతృతాఽస్యసా'

'ఇతఁడును ఆనందశక్తి గలవాఁడు గాన ఇట్లు ఈ భావములను ఇష్టవశము వలనఁ బ్రకాశింపఁజేయుచున్నాఁడు. ఇతని యా నిర్మాతృత్వమె వీనియొక్క క్రియ' అని. ఉపసంహారమందును నిట్లు చెప్పఁబడినది —

'ఇత్థం తథా ఘట పటాద్యాకార జగదాత్మనా
తిష్ఠాసో రేవమిచ్ఛైవ హేతు కర్తృతా క్రియా॥'

'ఇట్లు ఆ విధముగా ఘట పటాద్యాకారములు గల జగద్రూపముగా నుండ గోరు నితని యుట్టి యిచ్ఛయే హేతు కర్తృతా రూపమైన క్రియ' అని.

తస్మిన్ సత్యేవ మస్తీతి కార్యకారణతాఽపి యా
సాఽప్యపేక్షా విహీనానాం జడానాం నోప పద్యతే

ఆ మహేశ్వరుఁడు ఉండఁగా 'ఇది కలదు' అను ఏ కార్యకారణత్వము గలదో అదియు అపేక్షలేని జడులకు ఉపపన్నము కాదు". అను న్యాయము చేత

ఎందువలన జడునికి కారణత్వము లేదో అనీశ్వరమైన చేతన్యమునకుఁ గాని కారణత్వము లేదో అందువలన జగత్తునందున్న జన్మ స్థిత్యాది ఖార వికార ములు వాని వాని వేలకొలఁది యాయా భేదక్రియల రూపములో నుండఁగోరు స్వతంత్రుఁడైన భగవంతుఁడైన మహేశ్వరుని యిచ్ఛయే ఉత్తరోత్తర ముగా ఉచ్ఛూన స్వభావము (పెరుగు స్వభావము) గల క్రియ యని గాని విశ్వ కర్తృత్వము అని గాని చెప్పఁబడుచున్నది.' అని. ఇచ్ఛామాత్రముచేత జగన్నిర్మాణము నను అనుచోట దృష్టాంతముకూడ స్పష్టముగా నిర్దేశింపఁబడి నది—

'యోగినామపి మృద్బీజే వినైవేచ్ఛావశేన యత్
ఘటాది జాయతే తత్తత్స్థిర స్వార్థ క్రియాకరమ్'

యోగులకును మట్టి బీజమందు ఇచ్ఛావశము లేకుండనే ఏ ఘటాదికము కలుగుచున్నదో అది వాని స్థిరమైన స్వార్థక్రియను జేయునదియగును' అని.

ఘటాదికమును గూర్చి మట్టి మొదలైనవే పరమార్థముగా కారణమై నచో అపుడు ఎట్లు యోగుల యిచ్ఛమాత్రముచే ఘటాదులపుట్టుక కలుగును. మఱి మృత్పిండాది జన్యములైన ఘటాంకురాదులు ఒకటి యోగీచ్ఛాజన్యము లైతే మఱొకటి' అని చెప్పుచో అందును 'సామగ్రి భేదమునుబట్టియైతే కార్య భేదము కల్గుటనుట సర్వజన ప్రసిద్ధము' అని తెల్పఁబడుచున్నది.

'ఉపాదాన కారణము లేకుండ ఘటాదులు ఉత్పన్నము కావు. యోగి యైతే ఇచ్ఛచే పరమాణువులను వ్యాపారము గలవానిగాఁ జేయుచు సంఘ టన పఱచునని యెవరు గాని వర్ణింతురో వారు గూడ బోధింపఁదగిన వారే. చూడఁబడిన కార్య కారణ భావవిపర్యయము లభింపకపోయినచో అపుడు ఘటములో మట్టి దండము చక్రాదులు, దేహములో స్త్రీ పురుషఫల యోగా దులు అపేక్షింపబడును. అటువంటపుడును యోగీచ్ఛకు అనంతరము గలిగిన ఘట దేహాది సంభమును సమర్థించుట కష్టకరమగును. చేతన మైతే మాత్రము భగవంతుఁడు మహేశ్వరశాలియైన మహాదేవుఁడు నియతిని అనువర్తించుటలోను ఉల్లంఘించుటలోను లీలచేతనే మిక్కిలి ఘనమైన స్వాతంత్ర్యముగల వాఁడయి అటు భాసించును అనుపక్షములో ఏ యనుపపత్తి లేదు కనుకనే వసుగుప్తాచార్యుచే నిట్లు చెప్పఁబడినది—

నిరుపాదాన సంభార మభిత్తావేవ తన్వతే
జగచ్చిత్రం నమస్తస్మై కలా నాథాయశూలినే

'ఉపాదాన సంభారములు లేకుండ అభిత్తియందే (అనాధారమందే) జగత్తు అను చిత్రపటమును రచించునట్టియు కలానాథుఁడైన యాశూలికి నమస్కారము.' అని

సరేమఱి ప్రత్యగాత్మ పరమేశ్వరునికంటె భిన్నముగాదని యన్నపుడు దానికి సంసారబంధము ఎట్లు కలుగునన్నచో ఆ విషయములో ఆగమాధికారములో చెప్పఁబడెను.

'ఏషప్రమాతా మాయాంధః సంసారీ కర్మ బంధనః
విద్యాజ్ఞాపితైశ్వర్య చిద్ఘనో ముక్తఉచ్యతే'

'ఈ ప్రమాత మాయచే నంధుఁడై సంసారియై కర్మబంధనములు గలిగి పిదప విద్యాదులచేఁ దెలుపఁబడిన యైశ్వర్యము గలవాడై చిద్ఘనుఁడై ముక్తుఁడనఁబడును.' అని.

అయితే మఱి ప్రమేయము ప్రమాతకంటె అభిన్నమైనపుడు ప్రమేయమును గూర్చి బద్ధముక్తులలో విశేషమేది. అనఁగా నీ విషయమందుఁగూడ తత్త్వార్థ సంగ్రహాధికారమందు సమాధానము చెప్పఁబడినది-

'మేయం సాధారణం ముక్తః స్వాత్మాభేదేన మన్యతే
మహేశ్వరో యథాబద్ధః పునఃత్యంత భేదవత్'

'మేయము సాధారణము. ముక్తుఁడు మహేశ్వరునివలె స్వాత్మాభిన్నుఁడని తలంపఁబడుచున్నాఁడు. బద్ధమైతే మిగుల భేదముగలది.' అని.

మఱి ఆత్మకు పరమేశ్వరత్వము స్వాభావికమైనచో ప్రత్యభిజ్ఞారూపమైన ప్రార్థనతోఁ బనిలేదుగదా. సహకారులు పూర్తిగా ఉండగా ప్రత్యభిజ్ఞాతము కాని బీజము అంకురమును పుట్టింపకపోదు. కనుక 'ఎందువల్లను ఆత్మ ప్రత్యభిజ్ఞానమందు నిర్బంధము' అన్నచో దానికి జవాబు చెప్పంబడుచున్నది. దీనిలోని రహస్యమును వినుము. అర్థక్రియ రెండు విధములు అంకురాది రూపమైన బాహ్యక్రియ యొకటి. ప్రమాతృ విశ్రాంతి చము

త్కారసారమును ప్రీత్యాదిరూపమునైన క్రియ రెండవది. అందు మొదటిది. ప్రత్యభిజ్ఞానమును గోరదు. రెండవది మాత్రము దానిని అపేక్షించుచనే యుండును. ఇందును 'నేనీశ్వరుఁడను' అనునట్టి చమత్కారమె సారముగాఁ గలిగినదై పరాసిద్ధి లక్షణముగల జీవాత్మైకత్వ శక్తి విభూతి రూపమైన యర్థక్రియ' అని స్వరూప ప్రత్యభిజ్ఞానము అపేక్షింపఁదగినది. మఱి ప్రమాతృ విశ్రాంతి సారమైన యర్థక్రియ ప్రత్యభిజ్ఞానము లేకుండఁ జూడఁబడనిదగుచు దానియందుఁ జూడఁబడినది' అని యెందుఁ జూడఁబడినది. ఈ విషయములలోఁ జెప్పఁబడుచున్నది- నాయక గుణగణములను వినుటచే అనురాగము వృద్ధిపొందిన కామిని యొకతె మదవిహ్వలయై విరహక్లేశమును సహింపక మదనలేఖచే నిట్లు తన యవస్థను నివేదించునో అట్లు వేగముగా వాని సమీపమున దిరుగుచున్నను అతఁడు చూడఁబడినను వాని గుణముల పరామర్శింపకపోవుటచే జన సాధారణత్వమును పొందఁగా వాని దర్శనము హృదయంగమత్వమును పొందదు. ఎప్పుడైతే దూతిక వచనము వలన వాని గుణములను పరామర్శించునో అపుడు వెంటనే పూర్ణ భావమును పొందుచున్నది. ఇట్లే తనయాత్మ విశ్వేశ్వరరూపముతో భాసించుచున్నను ఆ మనభావము వాని గుణములను పరామర్శింపని సమయమున పూర్ణభావమును సంపాదింపదు. ఎప్పుడైతే గురువాక్యాదులచేత సర్వజ్ఞత్వ సర్వ కర్తృత్వాది లక్షణములు గల పరమేశ్వరోత్కర్ష పరామర్శ కలుగునో అక్షణమె పూర్ణత్వ లాభము కలుగును- అది చతుర్థ విమర్శ మందిట్లు చెప్పఁబడినది-

'తైస్తై రప్యుపయాచితై రుపనత స్తన్వ్యాః స్థితో౽ప్యంతికే
కాంతోలోక సమాన ఏవ మపరిజ్ఞాతోన రంతుం యథా
లోకస్యైష తథానపేక్షిత గుణః స్వాత్మాపి విశ్వేశ్వరో
నైవాయం నిజవైభవాయ తదియం తత్ప్రత్యభిజ్ఞోదితాః'

'ఆయా ప్రార్థనలచే వచ్చినవాడై ఆమె దగ్గఱ నున్నను కాంతుఁడు ఆనంద పెట్టుట కెట్లు అపరిచితుఁడై లోకముతో సమానముగనే యుండునో అట్లే

యితఁడు తనయాత్మయైనను లోకముయొక్క గుణములను జూడనివాఁడై విశ్వేశ్వరుఁడుండును. ఇతఁడు నిజ వైభవము చూపుట కొఱకుఁ గాదు, కనుక ఈ ప్రత్యభిజ్ఞ చెప్పఁబడినది" అని. ఈ విషయము అభినవ గుప్తుఁడు మొదలైన యాచార్యులచే విస్తరించి చెప్పఁబడినను సంగ్రహముగాఁ జెప్పఁ దలఁచిన మాచే విస్తరభీతిచే విస్తరించఁబడలేదు.

ఇది

శ్రీ చర్ల వేంకట నారాయణ శాస్త్రిగారి తనయుడగు
చర్ల గణపతి శాస్త్రిచే అనువదింపఁబడిన సాయణ మాధవీయమున
సర్వదర్శన సంగ్రహమున ప్రత్యభిజ్ఞా దర్శనము.

---

## రసేశ్వర వాదులు

దీనికిఁ గర్తలు శైవులు. ఇది క్రీస్తు 6వ శతాబ్దములో స్థాపింపబడె నినతోచుచున్నది. దీనిని అభినవగుప్త పాదాచార్యుని శిష్యులు ప్రచారము చేసిరి. రసశాస్త్ర ప్రవర్తకులగు నాగార్జున నిత్యానాథ ప్రభృతులగు మాహేశ్వరులు దీనికి ప్రవర్తకులు.

౧౦౪

## * రసేశ్వర దర్శనము

కొందరు మహేశ్వరులు పరమేశ్వర తాదాత్మ్య వాదులయ్యును పిండము (దేహము) స్థిరముగా నున్నపుడే సర్వులకు అభిమతమైన జీవన్ముక్తి సిద్ధించునని నిశ్చయించి పారదాది పదములచేఁ దెలియఁదగిన రసమే (పాదరసమె) పిండము (దేహము) స్థిరముగా నుండుటకు ఉపాయమని చెప్పుచున్నాడు. సంసారము యొక్క అవతలి యొడ్డును చేర్చుటకు హేతువగుట చేత రసము పారదమనఁ బడుచున్నది. అది యిట్లు చెప్పబడెను.

'సంసారస్య పరం పారందత్తేఽసౌ పారదః స్మృతః'

'సంసారమున కవతలి పారమును ఇది చేర్చుచున్నది గాన 'పారదము' అని చెప్పఁబడుచున్నది.' అని. రసార్ణవమందును నిట్లు చెప్పఁబడినది-

'పారదోగదితో యస్మాత్ పరార్థం సాధకోత్తమైః
సుప్తోయం మత్సమోదేవి మమ ప్రత్యంగ సంభవః
మమదేహరసో యస్మాద్రస స్తే నాయముచ్యతే'

'ఎందువలన అది పరమైన మోక్షమునకై సుప్తమై యున్నది. అందుచే సాధకోత్తములచే పారదమని చెప్పఁబడినది. ఇది నాతో సమమైనది. నా ప్రతి యంగము నుండి పుట్టిన దేహరసము గాన దేవీ! ఇది రసమనఁబడుచున్నది" అని.

మఱి యితర విధముగాఁ గూడ జీవన్ముక్తి యుక్తమగుచుండ ఇట్లుచెప్పుటవ

---

* రసరూపమైన ఈశ్వరుని గూర్చి చెప్పు దర్శనము.

యుక్తి యుక్తముగాదు. అన్నచో అట్లు అనరాదు. ఏలయన్న ఆరు దర్శనములందును దేహము పడిన పిదప ముక్తి గలుగుననుటచే అందు విశ్వాసము కలుగక పోవుచున్నది. నిస్పందేహముగా అందు ప్రవర్తించుట యుపపన్నమగుటలేదు కాన. అదియు అందే చెప్పఁబడినది–

షడ్దర్శనేఽపి ముక్తిస్తు దర్శితా పిండపాతనే
కరామలకవత్సాఽపి ప్రత్యక్షా నోపలభ్యతే
తస్మాత్తం రక్షయేత్పిండం రసైశ్చైవ రసాయనైః

'షడ్దర్శనము లందును శరీరము పడిన పిదపనే ముక్తియైతె చూపఁబడినది. అదియు కరతలామలకము వలె ప్రత్యక్షముగా ఉపలబ్ధమగుటలేదు కనుక ఆ పిండమును (శరీరమును) రసముల చేతను రసాయనముల చేతను రక్షింపఁ వలెను". అని. ఇది గోవిందభగవత్పాదులచేఁ గూడఁ జెప్పఁబడెను.

'ఇంధన శరీరభోగాన్ మత్వా నిత్యాన్ సదైవ యతనీయం
ముక్తౌచసాచ జ్ఞానాత్తచ్చాభ్యాత్ సచస్థిరేదేహే.

'ఇట్లు ధనములను శరీరములను భోగములను నిత్యములని తలఁచి ముక్తికై ఎల్లప్పుడును ప్రయత్నింపఁదగును. ఆ ముక్తియును జ్ఞానమువల్ల అభ్యాసము వల్లను గలుగును. ఆ యభ్యాసమును దేహము స్థిరమైనపుడే గలుగును.

మఱి వినశ్వరముగాఁ గనిపించుచున్న దేహము ఎట్లు నిత్యమగునని నిశ్చయింపఁబడుచున్నదన్నచో ఇట్లు తలఁపకుము త్వక్కు అసృజ్మాంస మేదోస్థిమజ్జా రూప షట్కోశములు గల శరీరము అనిత్యమైనను రసాభ్రక పదములచే వాచ్యమైన హరగౌరీసృష్టి జాతము (రసము హరసృష్టి, అభ్రకము గౌరిసృష్టి) నిత్యమగుట యుపపన్నమగుచున్నది గదా.

అట్లును రసహృదయమందుఁ జెప్పఁబడినది–

'యే చాత్యక్త శరీరా హరగౌరీసృష్టిజాం తనుం ప్రాప్తాః
ముక్తాస్తే రససిద్ధా మంత్రగణః కింకరో యేషాం'

(రసహృదయ. ౧. ౭.

'ఎవరు శరీరమును విడువక పార్వతీ పరమేశ్వర సృష్టివలనఁ గలిగిన శరీరమును పొందిరో, ఎవరికి మంత్రగణము కింకరమగునో అట్టి రససిద్ధులు ముక్తులు'.

కనుక జీవన్ముక్తిని గోరు యోగి ముందుగా దివ్యతనువును పొందవలయును. రసము హరునివల్లఁ బుట్టుటచేతను అభ్రకము గౌరివలనఁ బుట్టుటచేతను ఆ దివ్యతనువు హరగౌరీసృష్టి సంయోగ జనితమగుచున్నది. తత్తదాత్మకత్వమగుటయు నిట్లు చెప్పఁబడినది.

'అభ్రకస్తవ బీజంతు మమబీజంతు పారదః
అనయోర్మేళనం దేవి మృత్యుదారిద్ర్య నాశనం'

ఓ దేవీ! అభ్రకము నీ బీజము, పాదరసము నా బీజము. ఈ సమ్మేళనము మృత్యువును, దారిద్ర్యమును నశింపఁజేయును.

ఇది అత్యల్పముగాఁ జెప్పఁబడినది. దేవదైత్యముని మానవాదులలోఁ జాలమంది రససామర్థ్యము వలన దివ్యదేహమును ఆశ్రయించి జీవన్ముక్తిని పొందినట్లు రసేశ్వర సిద్ధాంతమందుఁ జెప్పఁబడినది.

'దేవాః కే చిన్మహేశాద్యా దైత్యాః కావ్యపురః సరాః
మునయోవాలఖిల్యాద్యా, నృపాః సోమేశ్వరా దయః
గోవింద భగవత్పాదాచార్యో గోవింద నాయకః
చర్వటిః కపిలో వ్యాలిః కాపాలిః కందలాయనః
ఏతే౽న్యే బహవః సిద్ధాజీవన్ముక్తా శ్చరంతిహి
తనుం రసమయాం ప్రాప్యతదాత్మక కథాచణాః'

'మహేశుఁడు మొదలగు దేవులు, శుక్రుఁడు మొదలైన దైత్యులు వాలఖిల్యాది మునులు సోమేశ్వరాది రాజులు, గోవింద భగవత్పాదాచార్యుఁడు గోవిందనాయకుఁడు, చర్వటి, కపిలుఁడు, వ్యాలి, కాపాలి, కందలాయనుఁడు ఇట్లే యితరులైన చాలమంది సిద్ధులు జీవన్ముక్తులై చరించుచున్నారు. రసమయ శరీరమును పొంది తద్రూపకథా చణులైరి." అని

ఈ విషయమె పరమేశ్వరునిచేత పరమేశ్వరిని గూర్చి ప్రపంచింపఁబడినది.

'కర్మయోగేన దేవేశి ప్రాప్యతే పిండధారణం
రసశ్చ పవనశ్చేతి కర్మయోగో ద్విధామతః'

'దేవేశ్వరి ! కర్మయోగముచేత పిండ (దేహ) ధారణము పొందఁబడును. రసము, పవనము అని కర్మయోగము రెండు విధములు.

'మూర్ఛితో హరతి వ్యాధీన్, మృతో జీవయతి స్వయం
బద్ధః ఖేచరతాం కుర్యాత్ రసోవాయుశ్చ భైరవి'

'ఓ భైరవీ! పాదరసమును, ప్రాణవాయువును ఈ రెండును మూర్ఛితమై (నూఱుట మొదలైనవి చేయఁబడినదై) వ్యాధులను పోఁగొట్టును. మృతమై (కుంభకాదులలో చలనాదికము లేనిదై మృతమైనట్లుండి) స్వయముగా జీవింపఁజేయును. బద్ధమై (కదలకుండ కట్టఁబడినదై) ఆకాశ గమనమును జేయును'. అని. మూర్ఛిత స్వరూపమిట్లు చెప్పఁబడినది—

'నానావర్ణో భవేత్సూతో విహాయ ఘన చాపలం
లక్షణం దృశ్యతే యస్య మూర్ఛితం తం వదంతిహి'.

పాదరసము ఘనత్వమును, చపలత్వమును విడిచి నానావర్ణములు గలదై సూతమగును. ఆర్ద్రిమై సంస్కార కాలమున స్ఫోటనమును పొందును. ఇట్లు దేని లక్షణము చూడఁబడునో దానిని మూర్ఛితమని యందురు.

'ఆర్ద్రిత్వం ఘనత్వంచ తేజోగౌరవ చాపలం
యస్యైతాని న దృశ్యంతే తం విద్యాన్మృత సూతకం'

దేనికి ఆర్ద్రిత్వము, ఘనత్వము, తేజస్సు, గౌరవము, చాపలము అనునవి కనుపింపవో దానిని మృతసూతకముగాఁ దెలియవలెను'. అని.

మఱియొకచోట బద్ధ స్వరూపము కూడఁ జెప్పఁబడెను.

'అక్షతశ్చ లఘుద్రావీ తేజస్వీ నిర్మలో గురుః
స్ఫోటనం పునరావృత్తౌ బద్ధసూతస్య సూతస్య లక్షణం

రసము అక్షతమై లఘువుగా ద్రవించునదై తేజస్వియై నిర్మలమై గురువై పునరావృత్తిలో స్ఫోటనము (వికాసము) గలదై యుండుటయే బద్ధసూతమునకు లక్షణము.' అని.

పరే హరగౌరీసృష్టియందు దేహ స్థైర్యము కలుగుటకు వీలువడును. మఱియూ హరగౌరీ సృష్టి సిద్ధియే యెట్లు అన్నచో అట్లనరాదు. అష్టాదశ సంస్కారవశము వలన అది యుపపన్నమగుచున్నది. అది ఆచార్యులచే నిట్లు చెప్పఁబడినది.

తస్య ప్రసాధన విధౌ సుధియా ప్రతికర్మ నిర్మలాః ప్రథమం
అష్టాదశ సంస్కారా విజ్ఞాతవ్యాః ప్రయత్నేన

ఆ పాదరసము ప్రకృష్టముగా సాధించు విధిలో ముందుగా ప్రతి కర్మలోను నిర్మలములైన పదునెనిమిది సంస్కారములు ప్రయత్న పూర్వకముగా ధీమంతునిచేఁ దెలిసికొనఁదగినవి.

ఆ పదునెనిమిది సంస్కారములు గూడ నిట్లు నిరూపింపఁబడినవి :-

'స్వేదన మర్దన మూర్ఛన స్థాపన పాతన నిరోధ నియమాశ్చ
దీపన గగన గ్రాస ప్రమాణ మథ జారణ పిధానం
గర్భద్రుతి బాహ్యద్రుతి క్షారణ సంరాగ సారణాశ్చైవ
క్రామణ వేధౌ భక్షణ మష్టాదశ ధేతి రసకర్మ'

1 స్వేదనము 2 మర్దనము 3 మూర్ఛనము 4 స్థాపనము 5 పాతనము 6 నిరోధము 7 నియమము 8 దీపనము 9 గగన గ్రాస ప్రమాణము 10 జారణ పిధానము 11 గర్భద్రుతి 12 బాహ్యద్రుతి 13 క్షారణము 14 సంరాగము 15 సారణము 16 క్రామణము 17 వేధము 18 భక్షణము అని రసకర్మ పదునెనిమిది విధములు అని. అది గోవింద భగవత్పాదాచార్య, సర్వజ్ఞ రామేశ్వర భట్టారక ప్రభృతులైన ప్రాచీనులచేత విస్తారముగా నిరూపింపఁబడినది. అది గ్రంథ విస్తర భీతిచేఁ జెప్పబడలేదు. దేహవేధ ద్వారా ముక్తియే పరమ ప్రయోజనము గాన రసశాస్త్రము ధాతు వాదార్థము కొఱకే అని తలఁపరాదు. అది రసార్ణవమున నిట్లు చెప్పఁబడినది —

'లోహ వేధస్త్వయా దేవ యదర్థముప వర్ణితః
తందేహ వేధ మాచక్ష్వ యేనస్యాత్ఖేచరీ గతిః

'దేవ! నీచే లోహవేధము ఎందుకొఱకు వర్ణింపఁబడినదో దేనిచే ఆకాశగమనము గలుగునో ఆ దేహ వేధమును జెప్పుము'.

'యథాలోహే తథాదేహే కర్తవ్యః సూతకః సదా
సమానం కురుతే దేవి ప్రత్యయం దేహలోహయోః
పూర్వం లోహే పరీక్షేత పశ్చాద్దేహే ప్రయోజయేత్'

లోహమందువలె దేహమందు సత్పురుషుని చేత పాదరసము ప్రవేశించునట్లు చేయవలయును. దేవ! దేహ లోహములందు ప్రత్యయము సమానముగాఁ జేయును. మొదట లోహమందు పరీక్షింపవలెను. పిదప దేహమందు ప్రయోగింపవలెను' అని.

మఱి సచ్చిదానందరూపమైన పరతత్త్వము స్ఫురించుటవలననే ముక్తి సిద్ధించుచుండఁగా ఈ దివ్యదేహ సంపాదన ప్రయాస యెందుకన్నచో ఈ వార్త తుచ్ఛమునకు వినాశికిని సంబంధించినదిమాత్రమె. వార్తకు వినాశమునకు సంబంధింపని శరీరమె లభింపనపుడు దాని (సంగతియె) లభింపదు గదా. అది రస హృదయమున నిట్లు చెప్పఁబడినది—

'గళితానల్ప వికల్పః సర్వాధ్య వివక్షిత శ్చిదానందః
స్ఫురితోఽప్య స్ఫురిత తనోః కరోతి కిం జంతు వర్గస్య'
(రస హృదయ. 1-20)

'అనల్ప వికల్పములో లేనట్టియు, సర్వమార్గములందు వివక్షితమైన చిదానందము స్ఫురించినను తనువు స్ఫురింపని జంతు వర్గమునకు అది ఏమి చేయును'

'యజ్జరయా జర్జరితం కాస శ్వాసాది దుఃఖ విశదంచ
యోగ్యం తన్న సమాధౌ ప్రతిహత బుద్ధీంద్రియ ప్రసరం
(రస హృదయ. 1-29)

ఏది ముసలితనముచే శిథిలమైనదో ఏది కాస శ్వాసాది రోగములచే స్పష్టముగానున్నదో ఏది బుద్ధీంద్రియ ప్రసారములను పోగొట్టుకొన్నదో అది సమాధియందు యోగ్యము గాదు' అని.

'బాలః షోడశ వర్షో విషయ రసాస్వాద లంపటః పరతః
యాత వివేకో వృద్ధో మర్త్యః కథమాప్నుయాన్ముక్తిం'

విషయ రసాస్వాద లంపటుఁడైన పదునాఱేండ్ల బాలుఁడు గాని తరువాత విశే కము పోయిన ముసలి మానవుఁడు గాని ముక్తిని ఎట్లు పొందఁగలుగును.' అని.

మఱి జీవత్వము అనఁగా సంసారిత్వమె గదా, దానికి విపరీతమైనది ముక్తత్వము. కనుక పరస్పరము విరుద్ధమైనవి ఒకే యాయుతనము నందుం డుట యెట్లు ఉపపన్న మగునన్నచో ఆయా వికల్పములు ఉపపన్నము గావు కాన అది యనుపపన్నమె. ముక్తియైతే సర్వ తీర్థంకర సమ్మతమె. అది జ్ఞేయమగు వస్తువు నందుండునా ఉండదా? ఉండదన్నచో చెవుల పిల్లి కొమ్మువంటి దగును. ఉండునన్నచో జీవనము వర్జింపఁదగినది. జీవింపని వానికి జ్ఞాతృత్వము అనుపపన్నము గదా. అది రసేశ్వర సిద్ధాంతమందిట్లు చెప్పఁబడినది-

'రసాంక మేయ మార్గోక్తో జీవ మోక్షోఽన్యథా తున
ప్రమాణాంతర వాదేషు యుక్తి భేదావలంబిషు'

రస చిహ్నితమైన శాస్త్రమార్గమందుఁ జెప్పఁబడిన జీవమోక్షము యుక్తి భేదములను అవలంబించు ప్రమాణాంతర వాదములందును ఇంతకన్న ఇంకొక విధముగాఁ జెప్పఁబడినను అట్లు అది సిద్ధింపదు.

'జ్ఞాతృజ్ఞేయ మిదం విద్ధి సర్వ తంత్రేషు సంమతం
నాఽజీవన్ జ్ఞాస్యతి జ్ఞేయం యదతోఽస్త్యేవ జీవనం'

'జ్ఞాత చేఁ దెలియఁదగిన యిది సర్వతంత్ర సంమతమని తెలియును. ఎందు వలననన దీనివలననే జీవనమున్నది గనుక. (చాలకాలము) జీవింపక జ్ఞేయ మును దెలియలేఁడు: అని

ఇది యిదివఱలోఁ జూడఁ బడనిదని తలఁపరాదు. ఏలయనఁగా విష్ణు స్వామి మతానుసారుల చేత నరసింహ శరీరము నిత్యమని యుప పాదింపఁ బడినది కాన. అది సాకార సిద్ధియందిట్లు చెప్పఁబడినది.

'సచ్చిన్నిత్య నిజాచింత్య పూర్ణానందైక విగ్రహం
నృపంచాస్య మహం వందే శ్రీ విష్ణుస్వామి సమ్మతం'

సత్తు, చిత్తు, నిత్యము, నిజము, అచింత్యము, పూర్ణనందములు గల ఒకే విగ్రహము గల శ్రీవిష్ణుస్వామి సమ్మతమైన నరసింహ రూపమును నేను నమస్కరింతును' అని. మఱి, యిట్టి యవయవములు గలిగినట్టియు, రూపము గలిగిన, భాసించు చున్న, నరసింహ శరీరము సత్తు అనుట సంగతము కాదు ఇత్యాదికముగా ఆక్షేపములతోఁగూడినట్టియు, సనకాదులకుఁ బ్రత్యక్షమైనట్టియు, సహస్ర శీర్షాపురుషః, పురుషుండు వేన వేల శిరములుండెడి వాఁడు' (శ్వే. 3. 14) ఇత్యాది శ్రుతి సిద్ధమును.

'తమద్భుతం బాలకమంబుజేక్షణం చతుర్భుజంశంఖ
గదా ద్యుదా యుధం, (భాగ ల. పూ. ౬. నా.)

ఇత్యాది పురాణ సిద్ధమునై యిట్లు ప్రమాణత్రయముచే సిద్ధమైన నరసింహ శరీరము ఎట్లు అసత్తు అగును అని తలఁచి సదాది విశేషణములు విష్ణుస్వామి చరణ పరిణతాంతః కరణులగు గర్భ శ్రీ కాంత మిశ్రులచేఁ బ్రతి పాదింపఁబడినవి. కనుక మనకిష్టమైన దేహనిత్యత్వము అత్యంతము చూడఁబడనిది కానేరదని పురుషార్థములను గోరు పురుషులచే నిష్టపడఁదగినది కనుకనే యిట్లు చెప్పఁబడినది

ఆయుతనం విద్యానాం మూలం ధర్మార్థకామ మోక్షాణాం
శ్రేయః పరం కిమన్య చ్ఛరీర మజరామరం విహాయైకం'

విద్యలకు ఆయుతనము ను ధర్మార్థ కామ మోక్షములకు మూలమును అజరామరమును నగు శరీరమొక దానిని విడచి గొప్ప శ్రేయస్సు ఇంకేమున్నది? అని

జరామరణములు లేకుండఁ జేయుటకు సమర్థమైనది రసేంద్ర మొకటే అదియు నిట్లు చెప్పఁబడినది.

ఏకోఽసౌ రసరాజః శరీర మజరామరం కురుతే

ఒక్క రసరాజమె శరీరమును జరామరణములు లేకుండ జేయునది అని.

పాదరసము యొక్క మాహాత్మ్యము నేమని వర్ణింతుము. దర్శన స్పర్శనాదులచే అది మహా ఫలదాయి యగుమ. అది రసార్ణవ మందిట్లు చెప్పఁబడినది.

దర్శనాత్ స్పర్శనా త్తస్య భక్షణాత్స్మరణాదపి
పూజనాద్రసదానాచ్చ దృశ్యతే షడ్విధం ఫలం.

దీనిని చూచుట వలన తాకుట వలన, తినుట వలన, తలంచుటవలన పూజించుట వలన దానము చేయుటవల్ల ఆఱు విధములైన ఫలములు కనిపించుచున్నవి.

కేదారాదీని లింగాని పృధివ్యాం యాని కాని చిత్
తాని దృష్ట్వాతు యత్పుణ్యం తత్పుణ్యం రసదర్శనాత్.

భూమియందు ఏయే కేదారాది లింగములు గలవో వానిని జూచినచో నెట్టి పుణ్యము కలుగునో దానిని చూచిన నంత పుణ్యమగును. ఇత్యాదికముగా ఇతరమగు చోటంగూడం జెప్పంబడినది.

కాశ్యాది సర్వలింగేభ్యో రసలింగార్చనా చ్ఛివః
ప్రాప్యతే యేన తల్లింగం భోగారోగ్యామృత ప్రదం.

కాశ్యాది సర్వలింగముల కంటె ఏ పాదరస లింగమును అర్చించుటవలన శివుండు పొందంబడుచున్నాడో ఆ లింగము భోగమును, ఆరోగ్యమును, మోక్షమును ఇచ్చునది'. అని.

'జ్యోతిర్మయం మహాలింగం కైలాస నగరేప్రియే
తస్యైవ షోడశాం శైకః కాశ్యాం విశ్వేశ్వరః స్థితః
పూర్ణలింగం మహేశాని శివ బీజంన చాన్యథా
పారదం పరమేశాని బ్రహ్మవిష్ణు శివాత్మకం
యోయజేత్పారదం లింగం సఏష శంభురవ్యయః
సంస్థాప్య శ్రీ బాణలింగం రత్నకోటి గుణం భవేత్.
రసలింగే తతోబాణాత్ ఫలంకోటి గుణం స్మృతం.
గుణాంస్తు రసలింగస్య వక్తుంశక్నోతి శంకరీ
సిద్ధయో రసలింగే స్యురణిమాద్యాః సుసంస్థితాః

(సూత సంహితా.)

పాదరసమును నిందించుట వలన ప్రత్యవాయము గూడం జూపంబడినది.

ప్రమాదా ద్రసనిందాయాః శ్రుతా వేనం స్మరేత్సుధీః
ద్రాక్ష్యజేన్నిందకం నిత్యం నిందయా పూరితాశుభం!

ప్రమాదము వల్ల పాదరసము యొక్క నిందను విన్నపుడు ఈ శివుని ధీమం

తుఁడు స్మరింపవలెను. నిత్యము నిందచే నిండిన యశుభముగల రస నిందకుని వెంటనే విడిచిపెట్టవలెను'. అని.

కనుక మేము చెప్పినట్లు దివ్యదేహమును సంపాదించి యోగాభ్యాస వశము వలన పరతత్త్వము చూడఁబడఁగా పురుషార్థప్రాప్తి కలుగును. అపుడు

భ్రూయుగ మధ్యగతం యచ్ఛిఖి విద్యుత్సూర్యవజ్జగద్భాసి
కేషాం చిత్పుణ్య దృశాము న్మీలతి చిన్మయం జ్యోతిః

'కనుబొమ్మల మధ్యనున్న యేది నిప్పువంటిమెఱుపు సూర్యునివలె జగత్తున భాసించునో అట్టి చిన్మయజ్యోతిస్సు కొందఱు పుణ్యాత్ముల దృక్కులలో వికసించును.'

పరమానందరసం పరమంజ్యోతి స్స్వభావ మవికల్పం.
విగళిత సకల క్లేశం జ్ఞేయం శాంతం స్వసంవేద్యం.

పరమానందరసమును పరమజ్యోతి స్స్వభావము గలదియు వికల్పములు లేనట్టిదియు, సకలక్లేశములు పోయినట్టిదియు శాంతమును స్వసంవేద్యము నైనది తెలిసికొనఁదగినది-

తస్మిన్నాధాయమనః స్ఫుర దఖిలం చిన్మయం జగత్పశ్యన్
ఉత్పన్నకర్మబంధో బ్రహ్మత్వమిహైవ చాప్నోతి.'

(రసహృదయ. 1- 10- 23.)

దాని యందు మనస్సుంచి స్ఫురించుచున్న చిన్మయమైన సకలజగత్తును జూచుచు కర్మబంధములు పోయినవాఁడై ఇందే బ్రహ్మత్వమును పొందు చున్నాఁడు. అని

శ్రుతి కూడ 'రసోవై సః రసంహ్యేవాయం లబ్ధ్వాఆనందీ భవతి' అతఁడు పాదరసమె. ఈ రసమునె పొంది జీవుఁడు ఆనందము కలవాఁ డగును. (తైత్తి. 2. 7. 1.) అని చెప్పుచున్నది కనుక ఈ విధముగా సంసారదైన్య దుఃఖ భారములను తరించుటకు ఈ రసమేయని సిద్ధించినది. అట్లును రసము బ్రహ్మముతో సమమైనది అని ప్రతిపాదించు శ్లోకము కలదు.

'యశ్చాస్యాత్ప్రావరణా విమోచన ధియాం సాధ్యః ప్రకృత్యాపునః
సంపన్నః సహ తేన దీవ్యతి పరం వైశ్వానరే జాగ్రతి

జ్ఞాతో య్యద్యపరం నవేదయతి చ స్వస్మాత్స్వయం ద్యోతతే
యో బ్రహ్మైవ స దైన్య సంసృతి భయాత్పాయా దసౌ పారదః

ఏది ప్రావరణ (మాయ) నుండి విమోచనము పొందు బుద్ధిగలవారికి ప్రకృతి చేతనే సాధ్యమగునో, ఏది సంపన్నమై అగ్ని (జఠరాగ్ని) మేల్కొని యుండఁగా ఆ యగ్నితోఁ గూడ మిగుల క్రీడించుచున్నదో ఏది జ్ఞాతమై ఇతరమును తెలియనిదగునో తననుండి తానే స్వయముగా ప్రకాశించు చున్నదో ఏది బ్రహ్మ వలెనున్నదో అట్టియా పాదరసము దైన్య సంసార భయము నుండి రక్షించుఁగాక. అని.

ఇది

శ్రీ చర్ల వేంకమ నారాయణ శాస్త్రిల తనయుడగు
చర్ల గణపతి శాస్త్రిచే అనువదింపఁబడిన
సాయణ మాధవీయమగు సర్వదర్శన సంగ్రహమున
రసేశ్వర దర్శనము

———

## కణాద మహర్షి

కణాదమహర్షి కపోతవృత్తిచే దారిలోపడిన బియ్యపుగింజలను గ్రహించి ప్రతిరోజు ఆహారము తినువాడు అందుచే కణాదుడని పేరు కలిగెను. ఇతడు కశ్యపగోత్రుడు. ఉలూకమహర్షి అపత్యము కనుక ఔలూక్యుఁడనియు పేరు కలిగినది. కణాద మహర్షికి స్వయముగా ఈశ్వరుడే ఉలూకధారియై ప్రత్యక్షమై పదార్థషట్కమును ఉపదేశించినట్లు న్యాయ కందళిలో రాజశేఖరుడు చెప్పెను. గౌతముని షోడశ పదార్థములు కణాదునికి సమ్మతమే. ఈ జగత్తులోని పదార్థములలో ఏవి ధర్ములు ఎన్ని విధములు అట్లే ఏవి ధర్మములు ఎన్ని. ఇట్లు అసంకీర్ణముగా పదార్థజ్ఞానము

కానంతవఱకు సాధర్మ్య వైధర్మ్య జ్ఞానము కాదు కనుక సాహచర్య నియమ రూపవ్యాప్తి జ్ఞానము సులభము కాదు. కాన ద్రవ్యగుణాది భేదముచే ఏడే పదార్థములు అని నిశ్చయించి ఈ ద్రవ్యమునకిది రూపము దానికి ఇవి గుణములు అని సువ్యస్థితముగా కణాదుడు ప్రతిపాదించెను. అందుచే ఈ విశేషములను ఉద్దేశించి చెప్పుటచే ఇది వైశేషిక దర్శనమని చెప్పఁబడు చున్నది. పద్మపురాణములోను దేవీభాగవతములోను కణాదుని ప్రశంస కలదు. దీనికి రావణభాష్యమను పేరుగల భాష్యము న్నట్లు పద్మనాభుడను నతడు భాస్కర టీకలోచెప్పెను. శివావతారమగు సోమశర్మ కణాదుని శిష్యుడని వాయుపురాణములోఁ గలదు.

— ఔలూక్య (కణాదుని వైశేషిక) దర్శనము —

ఇందు నిఖిల ప్రేక్షావంతుఁడు (సర్వమును జూచిన మనుజుఁడు) స్వభావసిద్ధముగా ప్రతికూలముగాఁ దెలియఁదగి సకలమైన యాత్మలకు అనుభవసిద్ధమైన దుఃఖమును బోఁగొట్టు కొనఁగోరిన వాఁడై ఆ దుఃఖమును విడచు నుపాయమును దెలిసికొనఁగోరి 'పరమేశ్వర సాక్షాత్కారమె ఆ దుఃఖ మును బోఁగొట్టునుపాయ' మని తలఁచుచున్నాడు.

'యదాచర్మవ దాకాశం వేష్టయిష్యంతి మానవాః
తదా శివమవిజ్ఞాయ దుఃఖ స్యాంతో భవిష్యతి'

చర్మమును వలె ఆకాశమును ఎప్పుడు మానవులు చుట్టుకొందురో అపుడు శివునిఁ దెలియకుండ వారికి దుఃఖాంతము కలుగును. ఆకాశమును జుట్టి కొనుట యెట్లు సంభవింపదో అట్లు శివునిఁ దెలియకుండ దుఃఖాంతము కలు గుట సంభవింపదని భావము. ఇత్యాది వాక్కుల సమూహము ప్రమాణ ముగుట వలన దుఃఖాంతము గలుగుటకు పరమేశ్వర సాక్షాత్కారమె దుఃఖ హానమున కుపాయము. ఇట్లును జెప్పఁబడినది—

'ఆగమే నానుమానేన ధ్యానాభ్యాస బలేనచ
త్రిధా ప్రకల్పయన్ ప్రజ్ఞాం లభతే యోగ ముత్తమం'

అందు మననము అనుమానమున కధీనమైనది. అనుమానమో వ్యాప్తి

జ్ఞానమున కఠినమైనది. వ్యాప్తి జ్ఞానమును పదార్థ వివేకమును అపేక్షించు
నది 'అథాతో ధర్మం వ్యాఖ్యా స్యామః' మఱి యింక ధర్మమును వ్యాఖ్యా
నింతుము (వైశేషిక. 1-1-1) ఇత్యాది దశలక్షణియందు ఆ పదార్థములాఱు
అని భగవానుఁడైన కణాదుని చేత వ్యవస్థాపింపఁబడెను. అందు రెండు
ఆహ్నికములు గల మొదటి యధ్యాయమందు సమవేతమైన యశేష పదార్థ
ములు చెప్పఁబడెను. అందును మొదటి యాహ్నికమందు జాతిమంతము
నిరూపింపఁబడినది. రెండవ యాహ్నికమందు జాతి విశేషములు నిరూపింపఁ
బడినవి. రెండు ఆహ్నికములు గల రెండవ యధ్యాయమందు ద్రవ్య నిరూ
పణము చేయఁబడెను. అందును మొదటి యధ్యాయమందు భూత విశేష
లక్షణము చెప్పఁబడెను. రెండవదానియందు దిక్కాలములు ప్రతిపాదింపఁ
బడినవి. రెండు ఆహ్నికములు గల మూఁడవ యధ్యాయమందు ఆత్మాం
తః కరణముల లక్షణము చెప్పఁబడినది. అందును మొదటిదానియందు ఆత్మ
లక్షణము రెండవదానియందు అంతఃకరణము చెప్పఁబడినది. రెండు ఆహ్ని
కములుగల నాలుగవ యధ్యాయమందు శరీరమును తదుపయోగమును వివే
చింపఁబడెను. అందు మొదటి దానియందు శరీరోప యోగ వివేచనమును
రెండవ దానియందు శరీర వివేచనము. రెండు ఆహ్నికములు గల యయి
దవ యధ్యాయమందు కర్మ ప్రతిపాదింపఁబడినది. మొదటిదానిలో శరీ
రమునకు సంబంధించి కర్మ చింతింపఁబడియె. రెండవదానిలో మానసకర్మ
చింతింపఁబడియె. రెండు ఆహ్నికములు గల యాఱవ యధ్యాయములో
శ్రౌత ధర్మములు చూపఁబడెను. అందును మొదటిదానిలో దానప్రతి గ్రహ
ముల వివేకము. రెండవదానిలో చతురాశ్రమముల కుచితమైనధర్మము నిరూ
పింపఁబడెను. అటువంటి యేడవ యధ్యాయములో గుణ సమవాయము
ప్రతిపాదింపఁబడెను. మొదటివానిలో బుద్ధి యపేక్ష లేని గుణములు తెల్పఁ
బడెను. రెండవదానిలో బుద్ధి యపేక్ష గల గుణములును, సమవాయమును
ప్రతిపాదింపఁబడెను. అష్టమాధ్యాయములో నిర్వికల్ప సవికల్పక ప్రత్యక్ష
ప్రమాణములు చింతింపఁబడెను. తొమ్మిదవ యధ్యాయములో బుద్ధి విశేష
ములు ప్రతిపాదింపఁబడెను. పదవ యధ్యాయములో అనుమాన భేదములు
ప్రతిపాదింపఁబడెను.

అందు ఉద్దేశము లక్షణము పరీక్ష అని ఆ శాస్త్రముయొక్క ప్రవృత్తి త్రివిధము. విభాగము విశేషోద్దేశ రూపమగుట వలన ఉద్దేశమందే యిం తర్భవించును గాన విభాగమును బట్టి చతుర్విధమని చెప్పఁబడలేదు. అందు ద్రవ్యములు, గుణములు, కర్మలు, సామాన్యము, విశేషము, సమవాయము అని పదార్థములు ఆఱే అనునది యుద్దేశము ఇందు క్రమ నియమము లోని కారణమిది-సమస్త పదార్థములకు ఆయతనమగుటచేత ప్రధానమైన ద్రవ్యము మొదటఁ జెప్పఁబడినది. పిదప గుణత్వోపాధిగా సకల ద్రివ్యములందున్న గుణములును, పిదప సామాన్యవత్త్వమును సామ్యమునుబట్టి కర్మలును, పిదప ఆ మూడిటిచే ఆశ్రయింపఁబడిన సామాన్యమును పిదప సమవాయాధికరణమైన విశేషమును జివర మిగిలిన సమవాయమును జెప్పఁబడెనని తెలియునది.

సరే మఱి పదార్థములు ఆఱే అని ఎట్లు చెప్పఁబడుచున్నది. అభావము అనునది యున్నది గదా. అన్నచో భావరూపముగా ఆఱే అని వివక్షింపఁ బడెను గాన దోషము లేదు. అంధకారము తేజోఽభావరూపమైనది గాన అంధకారము వేఱే పదార్థము కాదు. అంధకారమునకు భావత్వము నిషేధింపఁ బడుచున్నది.

అయినను వికల్పములు ఉపపన్నము గావు కనుక పదార్థములు ఆరే అను నియమమెట్లు ఉపపన్నమగుచున్నది. అది ఎట్లు అనఁగా— ఆరే అని నియమముచే వ్యవచ్ఛేదింపదగిన ఏడవ పదార్థము ప్రమాణ సిద్ధమా కాదా అన్నది వికల్పము. ప్రమాణ సిద్ధమైనచో నిషేధమెందుకు. ప్రమాణసిద్ధము కానిచో ఏ మాత్రమును నిషేధింపనక్కరలేదు. విచారశీలు డెవ్వడును ఎలుకకు కొమ్ములేదని నిషేధింప పూనుకొనడు. కనుక అనుపపత్తిని బట్టి నియమము లేదు అన్నచో ఇట్లు అనకుము. ఏడవదిగా ప్రమాణసిద్ధమైన అంధకారాదులందు భావత్వమును భావముగా ప్రమాణసిద్ధమైన శక్తి సాదృశ్యాదులందు సప్తమత్వమును నిషేధించుటవల్లను ఆరే అనుట యుక్తము. కనుక ఇంక విస్తరమేల. అగ్ని దాహకారణమె శక్తి అది ప్రతి కార్యమందు కారణ రూపముగా నుండనే యున్నది కాన అది వేఱు పదార్థము కాదు అట్లే సాదృశ్యము వేఱు పదార్థము కాదు. అది తద్భిన్నత్వము ఉండగా తద్గత

ధర్మత త్త్వమె కనుక. ద్రవ్యాదులకు ద్రవణ్వాది జాతి లక్షణము. ద్రవ్యత్వ మనఁగా గగనమందు అరవిందమందు సమవేతమై నిత్యమై గంధమను గుణ మందు సమవేతము కానిది. గుణమనఁగా సమవాయి కారణమందు అసమ వేతమై అసమవాయి కారణ భిన్న సమవేతమై సత్తకు సాక్షాత్తు వ్యాప్యమైన జాతి. కర్మత్వమనఁగా నిత్యపదార్థములందు సమవాయిగా ఉండని సత్తకు సాక్షాత్తు వ్యాప్యమైన జాతి. సామాన్యమనఁగా వినాశమునకు ప్రతియోగి యైన వినాశి పదార్థముయొక్క భావము. వినాశిత్వములేనిదై అనేకమందు సమవేతమైయుండు జాతి. విశేషమనఁగా పరమాణ్వాదులకు పరస్పర భేదము అన్యోన్యాభావము దానికి విరోధియైన సామాన్యజాతి లేనిది. సమవాయ సం బంధములో నున్నది విశేషము. సమవాయమనఁగా సమవాయరహిత సం బంధము అని ఆరింటికి లక్షణము.

ద్రవ్యము భూమి జలము తేజస్సు వాయువు ఆకాశము కాలము దిక్కు ఆత్మ మనస్సులు అని తొమ్మిది విధములు. అందు భూమి జలము తేజస్సు వాయువులకు భూమిత్వ జలత్వ తేజస్త్వ వాయుత్వములు గలవి అని లక్ష ణము. భూమి అనఁగా పాకజ రూపముగల ద్రవ్యము. జలము అనఁగా పరిత్యాగరములందుండి జ్వలనము నందుండనిది. తేజస్సు అనఁగా చంద్ర చామీకరములందుండి సలిలమందుండనిది. వాయువనఁగా త్వదింద్రియ సమవేత ద్రవ్యము. శబ్దగుణము గలది ఆకాశము. ఆకాశ కాలదిక్కులు ఒక్కొక్కటే గనుక అపరజాతిలేకపోగా పారిభాషిక సంజ్ఞలు ఆకాశము కాలము దిక్కు అని పేరు.

సంయోగముచే జన్యముకాని జన్యవిశేషముగల గుణ సామానాధికరణ విశేషాధి కరణము గలది ఆకాశము. విభుత్వముండఁగా దిక్కునందు సమ వేతముగాని పరత్వాసమవాయి కారణమునకు అధికరణమైనది కాలము. కాలము కంటె భిన్నమై విశేషగుణములు లేక గొప్పదగునది దిక్కు. ఆత్మకు ఆత్మత్వము. మనస్సునకు మనస్త్వము. ఆత్మత్వమనఁగా అమూర్తములందు సమవేతమై ద్రవ్యత్వమునందు వ్యాప్తమైనది ఆత్మ. మనస్త్వమనఁగా ద్రవ్యసమవాయ కారణముగా లేని అణువులందు సమవేతమై ద్రవ్యత్వ వ్యాప్యమైన జాతియే.

రూపరస గంధ స్పర్శ సంఖ్యా పరిమాణ పృథ_క్త్వ సంయోగ విభాగ పరత్వాపరత్వ బుద్ధి సుఖదుఃఖేచ్ఛా ద్వేష ప్రయత్న గురుత్వ ద్రవత్వ స్నేహ సంస్కార ధర్మాధర్మములు ఇరువది నాలుగు గుణములు.

కర్మ ఉత్క్షేపణము అపక్షేపణము ఆకుంచనము ప్రసారణము గమనము అని అయిదు విధములు. భ్రమణ రేచనములు గమనమందె అంతర్భవించును.

సామాన్యము పరము అపరము అని ద్వివిధము. పరమనఁగా ద్రవ్య గుణములందున్న స_త్త, అపరము ద్రవ్యత్వాదులు.

విశేషములు అనంతములు. సమవాయము ఒకటికాన వానికి విభాగము లేదు.

ద్విత్వేచ పాక జోత్పత్తౌ విభాగే చ విభాగజే
యస్యన స్ఖలితా బుద్ధి_స్తంవై వై శేషికం విదుః

ద్విత్వమందును పాక జోత్ప_త్తి యందు విభాగమందు విభాగ జన్యమందు ఎవని బుద్ధి తొట్రుపడదో వానిని వై శేషికుఁడందురు. ఇంక ద్విత్వాద్యుత్ప_త్తి ప్రకారము చూపఁబడును. అందు మొదటి ఘట ద్వయముతో ఇంద్రియార్థ సంనికర్షము పిదప ఏకత్వ సామాన్య జ్ఞానము. పిదప ఇది యొకటి ఇదొకటి అని అపేక్షా బుద్ధి పిదప ద్విత్వ సంఖ్యోత్ప_త్తి. దానినుండి ద్విత్వ సామాన్య జ్ఞానము. దాని నుండి ద్విత్వ గుణజ్ఞానము. పిదప రెండు ద్రవ్యములు అని బుద్ధి. దాని వలన సంస్కారము కలుగును. అది యీ క్రింది విధముగా చెప్పబడినది.

'ఆదా వింద్రియ సంనికర్షఘటనా దేకత్వ సామాన్యధీః
ఏకత్వోభయ గోచరా మతి రతోద్విత్వం తతోజాయతే
ద్విత్వత్వ ప్రమితి_స్తతోను పరతో ద్విత్వ ప్రమానంతరం
ద్వేద్రవ్యే ఇతి ధీరియం నిగదితా ద్విత్వోదయ ప్రక్రియా

ద్విత్వాదులు అపేక్షా బుద్ధివల్ల కలుగుటలో ప్రమాణమేమి. ఇందు ఆచార్యు లిట్లనిరి.

'అపేక్షా బుద్ధి ద్విత్వాదులను పుట్టించునది యగును. వ్యంగ్యత్వము అనుప పన్నమగునపుడు అవ్యంజకత్వము చేత దానిని అపేక్షింపఁబడుట వలన శబ్దమును గుఱించి సంయోగమువలె.

మేమైతే ఇట్లందుము' ద్విత్వాదికము ఏకత్వద్వయ విషయానిత్య బుద్ధి వ్యం గ్యము కాదు. అనేకమును ఆశ్రయించిన గుణములు గల దగుట వలన. పృథక్త్వాదులువలె॥ అని.

నివృత్తి క్రమము నిరూపింపఁ బడుచున్నది అపేక్షా బుద్ధి వలన ఏకత్వ సామాన్య జ్ఞానము ద్విత్వోత్పత్తి సమకాల మందె నివర్తించును. ద్విత్వ జాతి సామాన్య జ్ఞానము వలన ద్విత్వ గుణ బుద్ధి సమకాలమందు అపేక్షాబుద్ధి నివర్తించుటవలన ద్రవ్యబుద్ధి సమకాలమందు ద్విత్వము నివర్తించుటవలన సంస్కారోత్పత్తి కాలమందు గుణబుద్ధి నివర్తించును. తరువాత సంస్కార ము వలన ద్రవ్య బుద్ధి నివర్తించును. అని ఇది నాశక్రమము.

అదావ పేక్షా బుద్ధ్యాహీ వశ్యేదేకత్వ జాతిధీః।
ద్విత్వోదయ సమం పశ్చాత్సాచ తజ్జాతి బుద్ధితః
ద్విత్వాఖ్యగుణ ధీకాలే తతో ద్విత్వం నివర్తతే।
అపేక్షా బుద్ధి నాశేన ద్రవ్యధీ జన్మ కాలతః।
గుణ బుద్ధిర్ద్రివ్య బుద్ధ్యా సంస్కారోత్పత్తి కాలతః।
ద్రవ్య బుద్ధిశ్చ సంస్కారాదితి నాశక్రమోమతః॥
ఇతి. సా=అపేక్షాబుద్ధిః।

ఒక బుద్ధిచే నశింపఁ దగియుండుటలోను సంస్కారముచే నశింపఁ దగి యుం డుటలోను ఈక్రింది యను మానము ప్రమాణము-వివాదాధ్య సితములైన జ్ఞానములు ఉత్తరోత్తర కార్యములచే వినాశము పొందఁదగినవి. క్షణిక విభువిశేష గుణములుగలవగుట వలన శబ్దమువలె. కొన్ని చోట్ల ద్రవ్యములను ఆరంభించు సంయోగమునకు ప్రతిద్వంద్వియగు విభాగమును బుట్టించు కర్మ యొక్క సమకాలమందే ఏకత్వ సామాన్య చింత చేత ఆశ్రయనివృత్తి వలననే ద్విత్వము నివర్తించును. కర్మసమకాలమందు అపేక్షా బుద్ధిచింతనము వలన ఏకత్వ సామాన్య చింత వలన అని (ద్విత్వ బుద్ధ్యాదులు) పరస్పరము సుం దోప సుంద న్యాయముచేత రెండింటి చేత నివర్తించును. అని సంగ్రహము.

అపేక్షా బుద్ధి యనఁగా వినాశక వినాశ ప్రతియోగిని యగు బుద్ధి యని తెలియఁదగినది. నాశము అపేక్షాబుద్ధికి ద్విత్వ సంఖ్యకు వినాశకము. అట్టి

వినాశ ప్రతియోగిత్వము అపేక్షాబుద్ధికున్నది. ద్విత్వము అపేక్షా బుద్ధి జన్యము అని వైశేషికమతము. ఇంక ద్వ్యణుక నాశము మొదలుకొని కొన్ని క్షణములలో మరల నింకొక ద్వ్యణుకము పుట్టి రూపాదులు గలదగునని జిజ్ఞాసలో ఉత్పత్తి ప్రకారము చెప్పఁబడుచున్నది. తేజః సంయోగాది క్రమముగా పరమాణు విభాగ కర్మవల్ల ద్వ్యణుకారంభిక సంయోగనాశము, పిదప ద్వ్యణుకము. ద్వ్యణుకము నశింపఁగా పరమాణువునందు అగ్ని సంయోగము వలన శ్యామాది వర్ణములు నివర్తించును. శ్యామాది వర్ణములు నివర్తింపఁగా మఱియొక యగ్ని సంయోగము వలన రక్తాది వర్ణములు పుట్టును. రక్తాది వర్ణములు పుట్టఁగా అదృష్టమువలె ఆత్మ సంయోగము వలన పరమాణువునందు ద్రవ్యత్వము ఆరంభించుటకు క్రియ కలుగును. ఆ క్రియచేత పూర్వ దేశము నుండి విభాగము కలుగును. విభాగముచేత పూర్వదేశ సంయోగము నివర్తించును. అది నివర్తింపగా నింకొక పరమాణువుతో సంయోగము కలుగును. ఆ రెండు పరమాణువులు కలియఁగాద్వ్యణుకము ఆరంభమగును. ద్వ్యణుకము ఆరంభింపఁబడఁగా కారణ గుణాదుల వలన కార్యగుణాదులైన రూపాదులు పుట్టును. ఇట్లు యథాక్రమముగా తొమ్మిదిక్షణములు. దశక్షణాది ప్రకారాంతరము విస్తరభయము వలనఇట విస్తరింపఁబడుటలేదు. ఇట్లు పీలు (పరమాణు) పాకప్రక్రియ (అవయవి యందలి పరమాణువులందు పాకము కలిగి మార్పు చెందుట అవయవి వరకును కలుగుచున్నది. ద్వ్యణుకాది క్రమముగా మహావయవివరకు ఉత్పత్తి. పూర్వ వ్యూహనాశము వెంటనే వ్యూహాంతరము పుట్టుక కలుగును. సూక్ష్మతర నాశము కనుపింపదు గాన పూర్వఘట నాశము కనిపింపదని భావము. పిఠరపాక ప్రక్రియ ఘటాది పిండము ప్రక్రియ ఘటాదులందు పరమాణు సహితావయవి యందు పాకము కలిగి మార్పు చెందుటయైతే నైయాయిక బుద్ధికి సమ్మతము. ఘటాదిపిఠరము (పిండము) నకు తేజస్సంయోగమందును వినాశము కాదు. కాని అవయవములతోపాటు విశిష్టావయవియందు ఒకసారే పూర్వరూపము నశించుటయు రూపాంతరోత్పత్తియును గలుగునని భావము. విభాగజ విభాగము ద్వివిధము. కారణమాత్ర విభాగజము కారణాకారణ విభాగజము అని. అందుఁ గారణమాత్ర విభాగజము చెప్పఁబడుచున్నది– కార్యమందు వ్యాప్తమైన కారణము నందు

పుట్టిన కర్మ ఎప్పుడు ఇతరావయవముకంటె విభాగమును ధరించునో అప్పుడు ఆకాశాది దేశమునుండి విభాగము కలుగదు. ఎప్పుడైతే ఆకాశాది దేశమునుండి విభాగము కలుగదో అప్పుడు ఇతరావయవము నుండి విభాగము కలుగునని స్థితి నియమము. ఏలయన గగన విభాగములో కర్తృత్వము లేని కర్మ ద్రవ్యము ఆరంభించునది యగుటచేత ధూమమునకు ధూమ ధ్వజ (అగ్ని) వర్గముతో వలె వ్యభిచారము ఉపలబ్ధము కాకపోవుట వలన. కనుక అవయవ కర్మ ఇతరావయవమునుండి యే విభాగమును చేయుచున్నది కాని యాకాశాది దేశమునుండి చేయుట లేదు. ఆ విభాగమువలన ద్రవ్యమును ఆరంభించు సంయోగమునకు నివృత్తి కలుగును. కనుక 'కారణము లేకపోవుట వలన కార్యము కలుగదు'. అను న్యాయమువలన అవయవికి నివృత్తి కలుగును. అవయవి నివర్తింపఁగా దానికి కారణములైన యవయవములందున్న విభాగము కార్య వినాశముతోఁ గూడిన కాలమును గాని స్వతంత్రమైన యవయవమును గాని అపేక్షించి క్రియతోఁ గూడిన యవయవమునకే కార్య సంయుక్తమైన యాకాశ దేశమునుండి విభాగమును ఆరంభించును గాని క్రియ లేని యవయవమునకు కారణము లేకపోవుటవలన విభాగమును ఆరంభింపదు.

కారణాకారణ విభాగజమైతే హస్తమందు కర్మవలన ఉత్పన్నమైన–అవయవాంతరము కంటె–విభాగమును చేయుచు ఆకాశాది దేశముల నుండి విభాగములను ఆరంభించును. కర్మ ఏ దిక్కును గురించి కార్యారంభము నకు అభిముఖమగునో ఆ దిక్కును అపేక్షించి ఆ కారణాకారణ విభాగములు కార్యా కార్య విభాగమును హస్తాకాశ విభాగమువలన శరీరాకాశ విభాగ మునువలె ఆరంభించుచున్నది. ఇది శరీర క్రియా కార్యముకాదు. అపుడది నిష్క్రియ కనుక. అది హస్తక్రియా కార్యమునుగాదు. వ్యధికరణమైన కర్మ విభాగమునకు కర్తఅగుట యుపపన్నము కాదు గనుక' కనుక పరిశేష న్యాయమును బట్టి కారణా కారణ విభాగము దానికి కారణముగా అంగీకరింపవలెను.

'అంధకారాదులందు భావత్వము నిషేధింపఁబడుచున్నది' అని చెప్పినది సంగతము గాదు. అందు నాలుగు విధములుగా వివాదము సంభవించుచున్నది కాన. ఎట్లన— 'తమస్సు ద్రవ్యము అని భాట్టులైన వేదాంతులు చెప్పుచున్నారు.' 'ఆరోపితమైన నీలరూపమె తమస్సు' అని శ్రీధరాచార్యులు, 'ఆలోకజ్ఞానము లేకపోవుటె తమస్సు' అని ప్రాభాకరులలోఁ గొందఱు. 'ఆలోకాభావమె తమస్సు' అని నైయాయికాదులు ఇట్లు వికల్పములు ఉపపన్నములు గావుగాన అందు ద్రవ్యత్వ పక్షముఁ ఘటింపదు. అంధకారము ద్రవ్యమన్నపుడు అది పృథివ్యాదులలో ఏదోయొకటియా? వేఱా? దేనియందు దీనిని అంతర్భవింపఁ జేయుదుమో దానికి దీనికున్న గుణములన్నియు ఉండవలసివచ్చును. కాన మొదటిపక్షము సరికాదు. నిర్గుణమైన మాయాంధకారమునకు గుణములు లేకపోవుటచే ద్రవ్యత్వముసంభవింపదు గాన ఆదియింకొక ద్రవ్యమనుట యెంతమాత్రము సంభవింపదు కాన రెండవ పక్షమును సరికాదు. మఱి తమాల శ్యామలముగాఁ గనిపించు తమస్సు నిర్గుణమెట్లు ఆగునన్నచో అట్లనుటలో సారములేదు. ఎక్కడ నీలరూపమున్నదో అక్కడ గంధరసాదులున్నవి. పియంగుళికాదులందువలె అనుచో గంధాది వ్యాప్తమైన నీలరూపము ద్రవ్యత్వని వృత్తిలో నివృత్తమగుట వలన వ్యాపకము లేనపుడు వ్యాప్యమును ఉండదు అను నియమమును బట్టి 'అంధకారాదులందు గంధరసాదులు కనిపింపకపోవుటచే నీలరూపాభావమును నిశ్చయింప బడుచున్నది. మఱి నీలము తమస్సు' అనుదానికి గతి యెట్లన్నచో 'ఆకాశము నీలము' అనునట్లు భ్రాంతియె కనుక భాట్టాది వృద్ధులపై దోషపర్యాలోచన చాలును. అధిష్ఠాన ప్రత్యయము లేకుండ ఆరోపించుట సంభవింపదు గాన. తమస్సు ఆరోపితరూపమైనది గాదు. బాహ్యాలోక సహకారిలేని కంటికి రూపమును ఆరోపించుటలో సామర్థ్యము ఉపలబ్ధమగుటలేదు కూడఁగాన. తమస్సు అచాక్షుష ప్రత్యయము కూడఁగాదు ఏలయన, తదనువిధానము అన్యథా సిద్ధము గాకపోవుటవలన కనుకనే ఆలోకజ్ఞానాభావముకాదు. ఆ భావము ప్రతియోగి నిగ్రహింపఁజేయు నింద్రియములచే గ్రహింపఁదగినదను నియమముచే మానసము కానలసివచ్చుట వలన కనుక ఆలోకభావమే తమస్సు.

ప్రళయమనగా సృష్ట్య భావము. వినాశము ధ్వంసము అవసాన మనగా సమాప్తి వర్ణాద్యభావము. అవి అన్ని అభావ రూపములైనను ప్రళయమున్నది. అని విధి జ్ఞానమున్నది. ప్రళయవినాశావసానాదులందు వ్యభిచారము కనిపించుట వలన అంధకారము అది యున్నది అని భావవిధి జ్ఞానవేద్యమగుటవలన అభావము కాదనుట సరికాదు.

దుఃఖా భావమందు సుఖత్వారోపమును, సంయోగాభావమందు విభాగత్వాభిమానమును చూడఁబడుటవలన- అభావమందు భావధర్మాధ్యారోపమును ఉపపాదించుట శక్యముగాదు. ఆలోకాభావము ఘటాద్యభావమువలె రూపముగలది గాకపోవుటచేత ఆలోకసాపేక్ష చక్షుర్జన్య జ్ఞానవిషయము అగునని తలఁపరాదు. ఏలయన దేనిని గ్రహింపకపోవుటలో చక్షువు దేనినపేక్షించినదో దానియభావము గ్రహించుటలోఁ గూడ దానిని అపేక్షించుచున్నది. అను న్యాయముచేత ఆలోకమును గ్రహించుటలో ఆలోకాపేక్ష లేకపోవుటచేత దానియభావమును గ్రహించుటలో దానియపేక్ష లేకపోవుటవలన. అధికరణమును గ్రహించుటలో ఆవశ్యకత్వములేదు ఏలయన అభావ ప్రతీతిలో అధికరణావశ్యం భావమును అంగీకరింపకపోవుట వలన. అట్లుగానిచో కోలాహలము నివర్తించును గాన శబ్ద ప్రధ్వంసము ప్రత్యక్షము కాకపోవును గాన స్వవచనము అప్రామాణికమగును. అదంతయుఁ దలఁచి భగవానుఁడైన కణాదుఁడిట్లు సూత్రము కూర్చెను. "ద్రవ్య గుణ కర్మ నిష్పత్తివైధర్మ్యాద్యభావస్తమః" (వైశేషిక. 5. 2. 1. 6.) ద్రవ్య గుణ కర్మల యుత్పత్తియొ వైధర్మ్యముగాఁ గలదగుట వలన తమస్సు అభావ రూపమైనది. తమస్సుయొక్క యుత్పత్తి ద్రవ్యాద్యుత్పత్తి కంటె విలక్షణమైనది అని. వెలుగు పోయినవెంటనే చీకటివచ్చును గాని అది యుత్పత్తిగాదు.

అభావమైతే నిషేధముఖమైన ప్రమాణముచే గమ్యమై ఏడవదిగానిరూపింపఁబడుచున్నది అది సమవాయాది సంబంధము లేకపోఁగా సమవాయ భిన్నమైనది అభావము అగును.

భిన్నమైనది అది సంగ్రహముగా రెండువిధములు. సంసర్గాభావము అన్యోన్యాభావము అని. సంసర్గాభావము కూడ మూఁడు విధములు ప్రాగభావము ప్రధ్వంసాభావము అత్యంతాభావము అని. అందు అనిత్యము అనాదితమము నైనది ప్రాగభావము. ఉత్పత్తి గలదై అవినాశియయినది ప్రధ్వంసాభావము. ప్రతియోగిని ఆశ్రయించిన యాభావము అత్యంతాభావము. అత్యంతాభావమునకు వ్యతిరేకమై అవధిలేనియభావము అన్యోన్యాభావము. మఱి అన్యోన్యాభావమె అత్యంతాభావము అన్నచో ఏమి రాచబాటలోనే భ్రాంతియా ఘటము పటరూపము గాదు అని. సంవర్గము ప్రతియోగిగాఁ గల ప్రతిషేధము అత్యంతాభావము. ఎట్లనః- వాయువు నందు రూపసంబంధములేదు అని. అది పురుషార్థమునకు ఉపయోగింపదని ఆశంకింపరాదు. అత్యంతము దుఃఖమును పోఁగొట్టుటయె యితర పర్యాయ పదముగాఁ గల నిశ్శ్రేయస రూపముగాఁ గలదగుటచేత పరమపురుషార్థమగుచున్నది గదా.

ఇది

శ్రీ చర్ల గణపతిశాస్త్రిచే అనువదింపఁబడిన

సాయణ మాధవీయమైన సర్వదర్శన సంగ్రహమున

ఔలూక్య దర్శనము

* * *

## గౌతముడు

ఇతనికి అక్షపాదుఁడని నామాంతరము. వ్యాసుఁడు గోతముని శిష్యుఁడు. అతఁడు తన గురువునకు విరుద్ధముగ బ్రహ్మైక్యమును నిరూపించెను. అందుకు గోతముఁడు కోపించి నీముఖమును కన్నులతో చూడననెను. అందుకు వ్యాసుడు బాధపడి గోతముని ప్రార్థింపఁగా అపుడు గోతముఁడు తనపాదములందు అక్షిని (నేత్రమును) సృష్టించి చూచెననియు అందుచే అక్షపాదుఁడన్న పేలుగలిగెనని (పద్మపురాణము) ఐతిహ్యముకలదు. దర్శనకర్త గోతముఁడు రహూగణ మహర్షికుమారుడని జనకుల పురోహితుఁడని శతపథ బ్రహ్మణమునఁగలదు. గౌతమధర్మసూత్రకర్త ఇతఁడగునో కాదో చెప్పలేము వ్యాసుని

గురువను కథను బట్టి ఇతఁడు 5000 ఏండ్లకు పూర్వుఁడనవలయును. న్యాయమునకు ప్రతిజ్ఞాదులు అవయవములు కాన తన గ్రంథమునకు న్యాయమని పేరు కలిగెను.

ఈతఁడు మిథిలావాసి (దర్భాంగాకు 28 మైళ్లదూరమునగల గోదన్‌వాసి) యని క్రీస్తుశ. 2000 ఏండ్లకు పూర్వపువాడనియు డా॥ సతీశ చంద్ర విద్యాభూషణుడనెను.

—ఇంక అక్షపాద దర్శనము—

తత్త్వజ్ఞానము వలన దుఃఖాత్యంతోచ్ఛేద రూపమైన నిశ్శ్రేయసము గలుగునని వైశేషికదర్శనముతో సమానమగు న్యాయతంత్రమందును తెలుపఁబడినది.

"ప్రమాణ ప్రమేయేత్యాది తత్త్వజ్ఞానా న్నిశ్శ్రేయసాధిగమః"
(ప్రమాణ ప్రమేయాదుల తత్త్వమును తెలుసుకొనుట వలన నిశ్శ్రేయసము గలుగును.) అని

ఇది న్యాయ శాస్త్రములోని మొదటి సూత్రము. న్యాయశాస్త్రము అయిదు అధ్యాయములు గలది. అందు మొదటి యధ్యాయము రెండు ఆహ్నికములు గలది. అందు మొదటి యధ్యాయములోని మొదటి యాహ్నికమందు భగవానుఁడైన గౌతముని చేత ప్రమాణాది పదార్థములు తొమ్మిదింటి లక్షణము నిరూపింపఁబడి రెండవ యాహ్నికములో వాదాది సప్త పదార్థముల లక్షణము నిరూపింపఁబడినది. రెండవ యధ్యాయములోని మొదటి యాహ్నికమందు సంశయ పరీక్ష ప్రమాణ చతుష్ట యప్రమాణ శంకా నిరాకరణమును చేయఁబడినవి. రెండవదానిలో అర్థాపత్త్యాదుల యంతర్భావ నిరూపణ చేయఁబడినది. మూఁడవ యధ్యాయములోని మొదటి యాహ్నికములో ఆత్మ శరీరేంద్రియార్థములు పరీక్షింపఁబడినవి. నాలుగవ యధ్యాయములోని మొదటి యాహ్నికములో ప్రవృత్తి దోషప్రేత్యభావ ఫలదుఃఖాపవర్గములు పరీక్షింపఁబడినవి. రెండవ దానిలో దోషనిమిత్త కత్వ నిరూపణమును అవయ

వ్యాది నిరూపణమును జేయఁబడెను. అయిదవ యధ్యాయములోని మొదటి యాహ్నికములో జాతిభేదములు రెండవదానిలో నిగ్రహస్థాన భేదములు నిరూపింపఁబడినవి.

ప్రమేయముల సిద్ధి ప్రమాణాధీనము అను న్యాయముచేత ప్రమాణములు మొదట ఉద్దేశింపఁబడినవి. కాన తదనుసారముగా ముందుగా ఉద్దేశింపఁబడిన ప్రమాణము యొక్క లక్షణము చెప్పఁబడుచున్నది. ప్రమా సాధనమునకును ఆశ్రయమగు నాత్మకును భిన్నము కాని ప్రమావ్యాప్తమైనది ప్రమాణము. ఇట్లు ప్రతి తంత్ర సిద్ధాంత సిద్ధమైన పరమేశ్వర ప్రామాణ్యము సంగ్రహింపఁ బడినది. సూత్రకారుఁడిట్లనెను.

"మంత్రాయుర్వేద ప్రామాణ్య వచ్చ తత్ప్రామాణ్యమాప్త

ప్రామాణ్యాత్ (న్యాయ. 2-1-6-7) ఇట్లు న్యాయ నయ పార దృశ్వయు విశ్వ విఖ్యాత కీర్తియు నగు నుదయ నాచార్యుఁడును న్యాయకుసుమాంజలి యందు నిరూపించెను.

"మితిః సమ్యక్పరిచ్ఛిత్తి స్తద్వత్తాచ ప్రమాతృతా।
తదయోగ వ్యవచ్ఛేదః ప్రామాణ్యం గౌతమే మతే (4-5)

మితి అనగా యదార్థ జ్ఞానము, అది కలిగి యుండుట అనగా ప్రమాతృత్వము. ఆ ప్రమకు సంబంధము లేని దానియొక్క వ్యావృత్తికి అవశ్యక సంబంధమే గౌతమ మతమున ప్రామాణ్యము.

సాక్షాత్కారిణి నిత్యయోగిని పరద్వారానపేక్షస్థితౌ
భూతార్థాను భవేనివిష్ట నిఖిల ప్రస్తావివస్తు క్రమః
లేశా దృష్టి నిమిత్త దుష్టి విగమ ప్రభ్రష్ట శంకాతుషః
శంకోన్మే షకళం కిభిః కిము పరై స్తన్మే ప్రమాణం శివః (4-6)

ప్రత్యక్షమును నిత్య యోగము కలదియు, పరద్వారములను అపేక్షింపని స్థితి గలదియు నగు పూర్వ సిద్ధ త్రైలోక్య గత పదార్థానుభవము నందు

నివిష్టమైన నిఖిల ప్రస్తుత వస్తూత్పత్త్యాది క్రమము గలవాడును, లేశము చొప్పునఁజూడక పోవుట వలనఁ గలిగిన దోషములు లేకపోవుటచే పోయిన శంక అనే పొల్లుగలవాడును నగు శివుడు నాకుప్రమాణము శంకలు గలుగుటచే దోషములు గల యితర ప్రమాణములచే ప్రయోజనమేమి కలుగును.

ఆప్రమాణము ప్రత్యక్షము అనుమానము ఉపమానము శబ్దము అని నాలుగు విధములు (2) ప్రమయందు ఏది ప్రతిభాసించు చున్నదో అది ప్రమేయము ఆత్మ, శరీ, రేంద్రియా, ర్థ, బుద్ధి, మనః ప్రవృత్తి, దోష, ప్రేత్యభావ, ఫల, దుఃఖావ వర్గములను భేదములచే అది పన్నెండు విధములు. (3) నిశ్చయజ్ఞాము లేని జ్ఞానము సంశయము అది సాధారణధర్మము ఉదా:- స్థాణువా, పురుషుడా అన్నది. అసాధారణ ధర్మము

ఉదా:- పృధివి నిత్యమా అనిత్యమా అన్నది. నిత్యా నిత్యములందున్న సాధారణ ధర్మ విప్రతి పత్తి శబ్దము నిత్యమా? అనిత్యమా? వివిధ వ్యక్తుల వాదనను బట్టి సంశయము. అని మూఁడు విధములు. (4) దేనిని గూర్చి నిరుషులు ప్రవర్తింతురో అది ప్రయోజనము. అది దృష్టము తుష (వరిపొల్లు) నివృత్తి అదృష్టము (యాగ ఫలము) స్వర్గాదికము అని రెండువిధములు (5) వ్యాప్తి సంవేదనమునకు స్థానము దృష్టాంతము. అది సాధర్మ్యము నివ్వునకు ఉదా:- వంటిల్లు. వైధర్మ్యము (హ్రదము) అని రెండు విధములు. 6 ప్రామాణికముగా అంగీకరింపఁబడిన యర్థము సిద్ధాంతము. అది సర్వతంత్ర సిద్ధాంతము ఉదా:- ఇంద్రియములు అయిదు. ప్రతి తంత్ర సిద్ధాంతము అనిత్యము శబ్దము. ఇదినైయాయిక మతము మీమాంసమతమున నిత్యమందురు. అధికరణ సిద్ధాంతము ఉదా:- క్షిత్యాది కర్తకు సర్వజ్ఞత్వము అభ్యువగమన సిద్ధాంతము అని నాలుగు విధములు శబ్దము ద్రవ్యమగును కాని అనిత్యము. పరార్థానుమాన వాక్యములోని యేకదేశము అవయవము. అది 1 ప్రతిజ్ఞ 2 హేతువు 3 ఉదాహరణము ఉప నయనము 5 నిగమము అని అయిదు విధములు. (8) వ్యాప్యారోపము చేత వ్యాపకారోపము ఉదా:-నిప్పు లేనిచోటపొగ యుండదు తర్కము. అది పదునొకండు విధములు.

1వ్యాఘాతము 2ఆత్మాశ్రయము 3ఇతరేతరాశ్రయము 4చక్రకాశ్రయము 5అన

వస్థ 6 ప్రతిబంధికల్పనము 7 లాఘవ కల్పనము 8 గౌరవము 9 ఉత్సర్గము 10 అపవాదము 11 వైజాత్యము అని. అయథార్థానుభవ పర్యయమైన ప్రమితి నిర్ణయము. అది నాలుగు విధములు ప్రత్యక్షము అనుమానము ఉపమానము శబ్దముఅని 10) తత్త్వ నిర్ణయమె ఫలముగాఁ గల కథావిశేషము వాదము. 11 ఉభయ సాధనములు గల విజిగీషు కథ జల్పము 12 స్వపక్ష స్థాపనము లేని కథా అనఁగా వాది ప్రతివాదులు పక్షిప్రతిపక్షములదు పరిగ్రహించుట 13 హేతువుగా అభిమతమై సాధకము కానిది హేత్వాభాసము అది యయిదు విధములు సవ్యభిచారము. విరుద్ధము, ప్రకరణసమము, సాధ్యసమము, అతీత కాలము అని. 14) శబ్ద వృత్తిది అర్థాంతర వ్యత్యయ కల్పనముచేత ప్రతి హేతువు ఛలము. అది మూఁడు విధములు. అభిధాన తాత్పర్యోపచార వృత్త్యి వ్యయములని 15) స్వవ్యాఘాతకమైన యుత్తరము జాతి. అది యిర వది నాలుగు విధములు 1 సాధర్మ్యసమము 2 వైధర్మ్యసమము 3 ఉత్కర్ష సమము 7 .వికల్ప సమము 8. సాధ్యము 9 ప్రాప్తిసమము 10 అప్రాప్తిసమ ము 11 ప్రసంగ సమము 12 ప్రతిదృష్టాంత సమము 13 అనుత్పత్తిసమము 14 సంశయ సమము 15 ప్రకరణ సమము 1 హేతుసమము 17 అర్థాపత్తి సమము 18 అవిశేష సమము 19 ఉపపత్తిసమము 20 ఉపలబ్ధి సమము 21 అనుపలబ్ధి సమము 22 నిత్యసమము 23 అనిత్యసమము 24 కార్యసమము అని 16 పరాజయ నిమిత్తము నిగ్రహస్థానము అది ఇరవై రెండు విధములు 1 ప్రతిజ్ఞాహాని 2 ప్రతిజ్ఞా విరోధము 4 ప్రతిజ్ఞా సన్యాసము 5 హేత్వంతరము 6 అర్థాంతరము 7 నిరర్థకము 8 అవిజ్ఞాతార్థకము 9 అపార్థకము 10 అప్రాప్త కాలము 11,12 న్యూనాధికము 13 పునరుక్తము 14 అనను భాషణము 15 అజ్ఞా నము 16 అప్రతిభ 17 విక్షేపము 18 మతానుజ్ఞ 19 పర్యనుయోజ్యము 20 ఉపే క్షణము 21 నిజనుయోజ్యము 22 అనుయోగము అపసిద్ధాంతము హేత్వా భాసము అని. ఇవి యన్నియు స్వయముగా ప్రయోగింపరాదు. ప్రతి వాదిచే ప్రయోగింపబడినపుడు దోషములుగా మధ్యస్థులకుఁ జూపఁదగినవి. ఇందు అన్నింటిలోను గణింపబడిన విశేషమైతే ఆ శాస్త్రమందు స్పష్టముగా మన్నను విస్తరభీతిచే ప్రస్తావింపఁ బడుటలేదు.

ప్రమాణాది పదార్థములు పదునారు ప్రతిపాదింపఁ బడుచుండగా ఇది న్యాయశాస్త్రమని యేల వ్యవహరింపఁ బడుచున్నది. నిజమె. అయినను వ్యవహారములో అసాధారణముగా నగునను న్యాయముచేత పదార్థానుమా నా పరపర్యాయమైన న్యాయము సకల విద్యలను అనుగ్రహింపజేయునది కాన సర్వకర్మలను అనుష్ఠింపఁ జేయుటకు సాధనముగా ప్రధానమగుటచేత అట్లు వ్యవహారము యుక్తమగుచున్నది. ఈ పరమ న్యాయము విప్రతి పన్న పురుషుని గుఱించి ప్రతిపాదించిన దగుటవలన భట్ట సర్వజ్ఞునిచేత అట్లు చెప్పఁబడెను.

తథా ప్రవృత్తి హేతుత్వాచ్చ (గౌ. న్యాయ. సూ. 1. 1. 1)
అని పక్షిలస్వామి భాష్యకారుడు వాత్స్యాయనుని చేత యన్వీక్షకి విద్య (ప్రత్యక్షాగమములచే, జూడఁబడినదానిననుసరించి చూచుట) ప్రమాణాది పదార్థములచేత విభజింపఁబడినది.

ప్రదీపః సర్వవిజ్ఞానా ముపాయః సర్వకర్మణాం
ఆశ్రయః సర్వధర్మాణాం విద్యోద్దేశే పరీక్షితా

[న్యాయ. సూ. భా. 1. 1. 1.]

సర్వ విద్యలకిది దీపము. సర్వ కర్మలకు ఉపాయము. సర్వ ధర్మము లకు ఆశ్రయము. ఉద్దేశమున పరీక్షింపబడిన విద్య ఇది. అని.

తత్త్వజ్ఞానము వలన నిశ్శ్రేయసమగునని చెప్పఁబడినది. అందు నిశ్శ్రేయసము తత్త్వజ్ఞానము తరువాతనే కలుగునా? అట్లు కలుగదని చెప్పఁబడుచున్నది. కాని తత్త్వజ్ఞానము వలన దుఃఖ జన్మ ప్రవృత్తిదోష మిథ్యాజ్ఞానములలో పైపైదిపోఁగా దాని తరువాతది పోవుటవలన అప వర్గము కలుగును. అందు మిథ్యాజ్ఞానమనఁగా ఆత్మకాని దేహాదులందు ఆత్మబుద్ధి. దానికనుకూలమైన దానియందు రాగము. దానికిఁ బ్రతికూల మైన వానియందు ద్వేషము. వాస్తవమునకు ఆత్మకుఁ బ్రతికూలమైనది కాని యనుకూలమైనది గాని ఏదియులేదు. ఒకదానినొకటి అను బంధించి

యుండుటవలన రాగాదులలో మూఢుఁడు రక్తుఁడగును. రక్తుఁడు మోహపడును. మోహపడినవాఁడు కుపితుఁడగును. కోపించినవాఁడు మూఢుఁడగును. పిగప ఆ దోషములచే ప్రేరితుఁడై జీవి కాయము చేత ప్రతిషిద్ధములైన హింసస్తేయము మొదలైన వానిని ఆచరించును. వాక్కుచేత అనృతాదులను పలుకును. మనసుచే పరద్రోహాదులను తలఁచును. ఇది పాపరూపమైన ప్రవృత్తి అధర్మము. కాయముచేత ప్రశస్తములైన దాన రక్షణాదులను వాక్కుచే హిత సత్యాదులను మనస్సుచే అహింసాదులను జేయును. ఇది పుణ్యరూపమైన ప్రవృత్తి ధర్మము. ఇది యుభయ ప్రవృత్తి. పిదప స్వానురూపవశమైన ప్రశస్త జన్మను నిందిత జన్మను గాని మరల శరీరాది ప్రాదుర్భావమును పొందును. ఆ జన్మకలుగఁగాఁ బ్రతికూలముగాఁ దెలియఁదగిన బోధనా రూపమైన దుఃఖము కలుగును. ప్రవృత్తి లేని వానికి దుఃఖము తిరిగిరాదు గదా అని యొకఁడు తెలిసికొనును. దుఃఖాంతము వఱకు ఉన్న ఆయా మిథ్యా జ్ఞానాదులు అవిచ్ఛేదముగా ప్రవర్తించుచు సంసారమనబడును. అది ఘటీ చక్రము వలె అవధి లేకుండ అనువర్తించును. ఎప్పు డేపురుషశ్రేష్ఠుడు పురాకృతమైన సుకృత పరిపాక వశము వలన ఆచార్యుని యుపదేశముచేత ఇదంతయు దుఃఖాయతనముగాను దుఃఖముతోఁ గూడినదిగాను జూచునో అపుడు అది యంతయు హేయమని తెలిసికొనును. పిదప దానిని పోగొట్టునట్టి యవిద్యాదులను నివర్తింపఁజేసికొనఁదలఁచును. దాని నివృత్తికి ఉపాయము తత్త్వజ్ఞానము. నాలుగు విధములుగాను విభజింపఁబడియున్న ప్రమేయమును భావించుచున్న యొకనిని బాగుగాఁ జూడఁదగినదిగా తెలియఁదగిన తత్త్వజ్ఞానము కలుగును. తత్త్వజ్ఞానము వల్ల మిథ్యాజ్ఞానము పోవును. మిథ్యాజ్ఞానము పోఁగా దోషములు పోవును. దోషములుపోఁగా ప్రవృత్తిపోవును. ప్రవృత్తి పోఁగా జన్మపోవును. జన్మపోఁగా పూర్తిగా దుఃఖము నివర్తించును. ఆ యత్యంత దుఃఖ నివృత్తియె అపవర్గము. ఆ యత్యంత దుఃఖ నివృత్తి యనఁగా నివర్తింపఁదగిన సజాతీయము మరల పుట్టుక పోవుటయె. అట్లు రచించిన సూత్రము గలదు.

'దుఃఖ జన్మ ప్రవృత్తిదోష మిథ్యాజ్ఞానానా
ముత్తరోత్తరాపాయే తదనంతరాపాయా దపవర్గః
[గౌ. న్యా. 1. 1. 2.]

**దుఃఖాదులలో** ముందు ముందుదిపోఁగా తరువాతి తరువాతిది పోవుటచే 'అత్యంత దుఃఖోచ్ఛేదమె అపవర్గము' ఇప్పటికిని లోలో అది గుడగుడమనుచు అత్యంత గూఢముగనే యున్నది. మఱి అది ఎందు సిద్ధించిన దట్లు తలఁచి వ్యవహరింపఁ బడుచున్నది. అన్నచో అట్లనరాదు. మోక్షవాదులందఱు 'అపవర్గదశలో అత్యంత దుఃఖ నివృత్తి కలదు 'అనువది సర్వతంత్ర సిద్ధాంత సిద్ధముగా అంగీకరించి రాచబాట ఏర్పరచిరి గదా. అది యెట్లన– 'ఆత్మోచ్ఛేదమె మోక్షము' అని మాధ్యమికుల మతమ్ందు దుఃఖోచ్ఛేదము కలదు' అన్నదైతే నిర్వివాదమె. 'శరీరాదులవలె ఆత్మకూడ దుఃఖహేతువుగా ఉచ్ఛేదింపఁదగినదా' అని తలఁతువేని వికల్పము ఉపపన్నము గాకపోవుటచే అది సరిపడదు. ఆత్మయనఁగా జ్ఞాన సంతానమని వివక్షింపఁబడునా లేక దానికంటె భిన్నమైనదా? జ్ఞాన సంతానమన్నచో విప్రతిపత్తి లేదు. అనుకూలమును ఆచరించువాఁ డెవఁడు ప్రతికూలమును ఆచరించును? ఇంక రెండవ పక్షమున ఆత్మనిత్యమైనచో దానికి నివృత్తి చేయుట యశక్యమైనదే. అనిత్యమైనచో ప్రవృత్తికి అనుపపత్తియే. వ్యవహారానుపపత్తియును ఎక్కువ దూషణమగును. ప్రేక్షావంతుఁ డెవఁడును గూడ 'ఆత్మ యొక్క కామము కొఱకే సర్వము ప్రియమగును [ఆత్మ నస్తు కామాయ సర్వం ప్రియం భవతి [బృహ " "] అను దానిని బట్టి అన్ని విధముల ప్రియతమమైన యాత్మయొక్క నాశము కొఱకుఁ బ్రవర్తించును. ప్రాణులందఱును ధర్మియయిన యాత్మ యుండఁగానే ముక్తి పొందిరి అని వ్యవహరించును గదా. ధర్మి నివర్తింపఁగా నిర్మలజ్ఞానోదయమె మహోదయము 'అను విజ్ఞానవాది మతమందు సామగ్రి లేకపోవుటయును

సామానాధికరణ్యము అనుపపన్నమగుటయుఁ గలుగును. భావనా చతుష్టయము (1 సర్వము దుఃఖఃము 2క్షణికము 3 స్వలక్షణము 4శూన్యము అను)

వానికిఁ గారణముగా అభీష్టము గదా. అది సర్వము క్షణభంగురము అను పక్షమున స్థిరమైన యేకాధారము అసంభవమగుట వలన విషయమునుండి దాటి పోవు నభ్యాసాదికమువలె ప్రకర్షమును బొందకుండ నున్నది స్ఫుటమైన యభిజ్ఞానమును గలిగింపఁజాలదు ఉపప్లవములతోఁగూడిన (ఆశ్రయ సంబద్ధమైన సమమైన జ్ఞానప్రవాహము=సోపప్లవము) జ్ఞాన సంతానము బద్ధము అగుటలోను ఉపప్లవములు లేనిది ముక్తముఅను సామానాధి కరణ్యము కుదురదు.

ఆవరణ ప్రతిబంధము క్తియె ముక్తి అను జైన జనులచే నభిమతమైన మార్గము కూడ స్వభావసిద్ధముగా నిరర్గళమైనది కాదు ఓయీ అడుగఁబడిన వాడవై ఆవరణమన నేమియో వ్యాఖ్యానింపుము. ధర్మాధర్మ భ్రాంతియే ఆవరణమన్నచో ఇష్టమే. దేహమే ఆవరణమన్నచో అపుడు ఆదేహము నివర్తింపఁగా పంజరమునుండి విడువఁబడిన చిలుకకు వలె ఆత్మకు ఎల్లపుడును ఊర్ధ్వగమనమే ముక్తియన్నచో అపుడు చెప్పవలసినది కలదు. అయితే ఆయాత్మ మూర్తమా? అమూర్తమా? ఆత్మమూర్తమన్నపుడు అది నిరవయవమా? సావయవమన్నచో నిరవయవమైన మూర్తము పరమాణువు అని పరమాణు లక్షణము ఆపన్నమగును గాన పరమాణు ధర్మమువలె ఆత్మ ధర్మములును అతీంద్రియములు కావలసివచ్చును. సావయవమన్నచో ఏది సావయవమో అది అనిత్యము అని వ్యాప్తి బలముచే అనిత్యము ఆపన్నము కదా. నిష్పత్తి బంధములైన చేసినపని ఫలింపకుండ నశించుటయు చేయనిపని ఫలించుటయు అనుదోషములు ప్రసరింప వలసి వచ్చును. అమూర్తమన్నచో గమనము అనుపపన్నమె. చలనాత్మక క్రియకు మూర్తముతో సంబంధమున్నది గనుక.

పారతంత్ర్యమె బంధము. స్వాతంత్ర్యమె మోక్షము. అన్న చార్వాక మతమందును స్వాతంత్ర్యము దుఃఖనివృత్తి అన్నచో నిర్వివాదమె స్వాతంత్ర్యమన్నచో మోక్షము నిరతిశయము అనుపమము జీవైశ్వర్యతోము సదృశమగుట చేతను విచారశీలుర కది యభిమతము కాదు.

ప్రకృతి పురుషులు భిన్నులను ప్రతీతిలో ప్రకృతి ఉపరమింపఁగా పురుషుఁడు స్వరూపముతో నుండుటయె ముక్తియని సాంఖ్యమతమందును దుఃఖోచ్ఛేదము ఉండనే యున్నది. వివేకజ్ఞానము పురుషునా ప్రకృతినా ఆశ్రయించి నది అన్నది యింక మిగిలియుండును. పురుషుని నాశ్రయించిన దన్నచో పురుషునికి కూటస్థత్వాన స్థాన నిరోధము ఆపన్నమగును. అది అచేతన మగుట చేత ప్రకృతిని ఆశ్రయించినదనరాదు. మఱి ప్రకృతి ప్రవృత్తి స్వభావము గల దాః నివృత్తి స్వభావముగలదా ప్రవృత్తి స్వభావముగలదన్నచో నిర్మోక్షము లేక పోవలసి వచ్చును. ఏలయన దాని స్వభావము పోదు గనుక. నివృత్తి స్వభావము గలదన్నచో అప్పుడు సంసారమే అస్తమించి పోవలసి వచ్చును

నిత్య నిరతిశయ సుఖాభి వ్యక్తియె ముక్తియని భట్టసర్వ జ్ఞాద్యభి మతమందును దుఃఖనివృత్తి యభిమతమె. కాని నిత్య సుఖము ప్రమాణ పదవిని అధిష్ఠింపదు. అందులో శ్రుతి ప్రమాణ మని యనరాదు. యోగ్యానుపలబ్ధిచేత బాధితమైన దానియందు దానికవకాశము లేకపోవుట వలన. అవకాశమున్నదన్నను గ్రావ ప్లవమందును అట్లు (ప్లవంతే గ్రావాణః రాళ్ళు తేలుచున్నవి) అను శ్రుతికిఁగూడ ముఖ్యార్థము చెప్పుట చేతనే దానిని ప్రమాణముగా అంగీకరింపవలసి వచ్చును. గనుక.

మఱి 'సుఖాభివ్యక్తియె ముక్తి' అను పక్షమును విడిచి దుఃఖ నివృత్తియె ముక్తి అని స్వీకరించుట పాలను విడిచి అరుచి రోగగ్రస్థునికి ఆరనాళక (సౌవీర కాంజిక) రుచిని అనుభవింపఁ జేయుచున్నది వలె నున్నది అన్నచో ఇది నాటక పాత్రిలలో వలె (ఉక్తివైచిత్యములో) పడినది నీ వాక్కు అని యుపేక్షింపఁ బడుచున్నది. సుఖము సాతిశయ మగుటచేత సదృక్షమగుటచేత బహుప్రత్యనీకా క్రాంతమగుటచేత సాధన పార్థనా పరిక్లిష్టమగుటచేతను దుఃఖా వినాభూతముగా విషానుషక్త మధువు వలె దుఃఖ పక్షమందె పడుచున్నది. మఱిఒక దానిని అనుసంధానము చేయువానికి ఇంకొకటి జాఱిపోవుచున్నది అను న్యాయముచేత దుఃఖము వలె సుఖము కూడ పోవుచున్నదే కాన ఈ పక్షము కోరదగినదికాదు అని

తలంచుచు సుఖము సంపాదించుటలో దుఃఖసాధనములు ఎక్కువగా కలుగు నను నియమముచేత కాల్చిన యినుప గుండు నందు నిప్పు అను బుద్ధితో ప్రవర్తించువానితో (బంగారమనుకొని నిప్పు ముట్టుకొన్నవానికి బంగారము దొరకదు సరిగదా చేయి కూడ కాలును.) సామ్యము కలుగవలసి వచ్చుచున్నది కనుక అట్లు తలంరాదు. అది యెట్లన- న్యాయముగా సంపాదించు విషయములలో సుఖపు మిణుంగురు పురువులెన్ని? దుఃఖములను మేఘచ్ఛన్న దినములెన్ని? అన్యాయముగా సంపాదించు విషయము లలో ఏది కలుగునో అది మనస్సు చేతం గూడం చింతించుటకు శక్యము గాదు. అను తన స్వానుభవమును గప్పుకొననెంచని సత్పురుషులైన విద్వ ద్వరులైనవారే తెలిసికొందురుగాక. కనుక పరిశేషము వలన పరమేశ్వ రానుగ్రహ వశము వల్ల శ్రవణాదిక్రమముగా ఆత్మ తత్త్వమును సాక్షా త్కారము చేసికొన్న పురుషశ్రేష్ఠునికి ఆత్యంతిక దుఃఖ నివృత్తియే నిశ్శ్రే యస మగుట నిరవద్యము—

ఈశ్వరుండున్నాండనుటలో ఏది ప్రమాణము. ప్రత్యక్షమా? అను మానమా? ఆగమమా? ఈశ్వరుండే రూపాదులు లేనివాండగుట వలన అతీం ద్రియుండు గాన ఇందు ప్రత్యక్షము ప్రమాణము గాదు. ఈశ్వరునియందు వ్యాప్తమైన లింగము లేకపోవుట వలన అనుమానమును ప్రమాణముగాదు. వికల్పములను సహింపదు గాన ఆగమమునుగాదు. ఆగమమము నిత్యము ననుభవింపం జేయుచున్నదా లేక అనిత్యము ననుభవింపంజేయుచున్నదా? మొదటి పక్షమున అపసిద్ధాంతము ఆపన్నమగును. రెండవ పక్షమున అన్యో న్యాశ్రయ దోషము కలుగును. కర్తనుబట్టి ఆగమమునకు ఆగమమునుబట్టి ప్రామాణ్యముకలుగుటలో అన్యోన్యాశ్రయ దోషము కలదు.

ఉపమానాదులను శంకింపనవసరము లేదు. నియత విషయములు గలవగుట వలన. కనుక ఈశ్వరుండు శశవిషాణము వంటివాండు అన్నచో ఇది బుద్ధి గలవారి మనస్సులో చమత్కారమును గలిగింపదు. వివాదా స్పదమైన పర్వత సముద్రాదులు కర్త గలవి కార్యములగుట వలన ఘటము వలె. సావయవమగుటవలన అది సుసాధనమగునుగదా అన్న ఇది అసిద్ధమైన

హేతువు గాదు. సరే మఱి ఈ సావయవత్వమననేమి. అవయవ సంయోగిత్వమా? అవయవ సమవాయిత్వమా? గగనాదులందు వ్యభిచరించుట వలన అవయవ సంయోగిత్వము కాదు. తంత్వాదులం [తంతువులు పటమందు సమవాయముగానున్నవి.] దనైకాంతక మగుట వలన అవయవ సమవాయిత్వమును గాదు. కనుక ఇది యనుపపన్నమగునన్నచో ఇట్లు పలుకకుము. సమవేత ద్రవ్యత్వమునంగా సావయవత్వమని నిర్వచించుట శక్యము గాదు గాన అవాంతర మహత్త్వము చేతంగాని కారణత్వానుమానము సుకరమగుట వలన. సాధ్య విపర్యయవ్యాప్తి లేకపోవుటవల్ల విరుద్ధ హేతువునుగాదు సకర్తృకత్వ సాధక కార్య హేతువుని రుద్ధరూప హేత్వాభాసముగాదు. పక్షముకంటె నితరమైన చోట ఉండుట కనివింపక పోవుటవల్ల అనైకాంతికమునుగాదు. సకర్తృకత్వరూపసాధ్యాభావవంతమైన పరమాణ్వాదులందు కార్యత్వము కనిపింపకపోవుటవల్ల కార్యత్వ హేతువు వ్యభిచరితము కాదు. బాధకము ఉపలబ్ధము కాకపోవుటవలన కాలాత్యయాపదిష్టమును గాదు. శరీరా జన్యత్వ హేతువు ప్రతి భటము(సమానము) కనిపింపకపోవుట వలన సప్రతిపక్షమునుగాదు. మఱి పర్వతాదికము కర్త లేనిది శరీరాజన్యమగుట వలన గగనము వలె ఈశ్వరః పర్వత సాగరాది కర్తాన భవతి శరీర రహిత త్వాత్ ఆకాశాదివత్, అని యన్నచో ఇది పరీక్షకు క్షేమమైనదిగా కనిపించుట లేదు. కఠోర కంఠీరవమునకు కురంగ శాబము ప్రతిబటముకానేరదుగదా అజన్యత్వమె సమర్థమగుట చేత శరీర విశేషణము వ్యర్థముకావలసి వచ్చును (పర్వతము అగ్నికలది నీలధూమమువల్ల ఇటనీల పదము వ్యర్థము) అయితే అజన్యత్వమె సాధనమన్నచో అట్లు సిద్ధింపక పోవుట వలన అట్లనరాదు. సోపాధికత్వ శంకాకళంకాంకురమును అనుకూల తర్కము సంభవించుటవలన సంభవింపదు.

> కార్యత్వ హేతోర్వ్యస్తుత ఉపాధిన్నాస్త్యేవ। కింతు ఉపాధి
> శంకయాపి అయం కార్యత్వ హేతుః కళంకితోన భవతి।
> యది సకర్తృ కస్య వ్యాపకం కించిద్వస్తు కార్యత్వస్యా
> వ్యాపకం సంభవేత్తర్హి ఉపాధిశంకా

ఇది కర్తలేనిదైనచో కార్యమును ఉండక పోవును. ఏది కారక చక్రమును (కర్తృ కర్మ కరణాది కారకచక్రము)తిరస్కరించి తన్ను నశింపఁ జేసికొనునో అట్టి కార్యమనునది ఈ లోకములో లేనే లేను అనుట రర్వివాదము.

మృద్దండాదీని ఘటముత్పాదయితుం కుంభకారం ప్రయోజయంతి. ప్రత్యుత కుంభకార ఏవతాని స్వేచ్ఛయా ప్రయోజయతి. ఘటపటాది కార్యోత్పాదన సమయమున కుంభకార కురు విందాదులు కర్తలు సర్వకారకములను కార్యోత్పత్తికి అగుణ్యముగా నిలబెట్టుదురు. మట్టి కఱ్ఱ మొదలగునవి కుండను చేయుటకు కుమ్మరి కుపయోగించు చున్నవా లేక అవే స్వతంత్రముగా కుండను జేయుచున్నవా కర్తృ విశేష ముచే (మర్యాదావస్థితి విశేషము) ఉపహితమైన మర్యాదగలది కర్తృత్వమనఁగా ఇతర కారకా ప్రయోజ్యత్వము ఉండఁగా సకల కారక ప్రయోక్తృ త్వ లక్షణము (కర్తలేదన్నపుడు కారణము లేదు.) జ్ఞానచికీర్షాప్రయత్నాధారమగుట కనుక కర్తృవ్యావృత్తికి తదుపహిత సమస్త కారక వ్యావృత్తిలో కారణములేకుండనే కార్యము ఉత్పన్నము కావలసి వచ్చునని కర్తలేకనే కార్యము కావలసి వచ్చును. ఇది చాలా స్థూలమైన ప్రమాదము. అట్లు శంకర కింకరునిచే పూర్తిగా నిబంధింపబడినది.

అనుకూలేన తర్కేణ సనాథే సది సాధనే
సాధ్య వ్యాపకతా భంగాత్పక్షే నోపాధి సంభవః

సాధనము ఉండగా అనుకూల తర్కముచేత సాధ్యవ్యాపకత్వము లేదు గనుక పక్షమందు ఉపాధి సంభవింపదు' అని.

సాధ్య వ్యాపకత్వేసతి సాధనా వ్యాపకత్వముపాధిః అని లక్షణము సాధ్యమైన ఘటాదులందు వ్యాపకమై సాధ్యములందు ఉండనిది ఈశ్వరుఁడు కర్తయైనచో అతఁడు శరీరికావలయును. ఇత్యాది ప్రతికూల తర్క జాతము సిద్ధముగా నుండు నన్నచో ఆగమాదులచే ఈశ్వర సిద్ధిచేతను. ఆగమాదులు ప్రమాణా భాసలన్నపుడు ఈశ్వరుడు సిద్ధింపడు గాన అసిద్ధిచేతను వ్యాఘాతము కలుగును. అది యుదయనునిచే నిట్లు చెప్పఁబడినది.

ఆగమాదేః ప్రమాణత్వే బాధనాదనిషేధనం
ఆభాసత్వే తు సైవ స్యాదాశ్రయా సిద్ధితా (న్యాయ సూ. 3. 4.)

ఆగమాదులు ప్రమాణమన్నచో ఈశ్వరుడు లేడన్న వానికి బాధ కలుగుట వల్ల లేడని నిషేధింపరాదు. ఆగమాదులు ప్రమాణా భాసలే కాని ప్రమాణములుగావు ఈశ్వరుడు లేడన్నచో ఉక్తానుమానములో ఆశ్రయ సిద్ధి (పక్షా సిద్ధి) నాట్యము చేయును గదా ఎట్లయినను. ఈశ్వరుడు లేడనుట వ్యాహతము అనిభావవ.

విశేష విరోధము శంకింప శక్యమైనదియుఁగాదు. జీవులు కర్తలని చూచి జీవుల సాదృశ్యమును బట్టి కనిపింపని ఈశ్వరుని యందు కర్తృత్వము సాధించుట విశేషము. ఆ విశేషము స్వభావ విరుద్ధముగదాఅన్న నట్లనరాదు

జ్ఞాతత్వావిజ్ఞాతత్వ వికల్పములచే పరాహత మగుటవలన. విశేషము తెలియబడినచో అది స్వభావము గనే ఇతర విలక్షణమగును కాన ఇతర మగుచోట నెక్కడను జూడబడని జగత్కర్తృత్వము ప్రయోజకమగును. అక్కడ బాధించునదేదియులేదు. ఇంక తెలియబడనిచో దానిని బట్టి అనుమానమునకు విరోధమును ఉద్భవించుట సంభవింపదు, పోనిమ్ము. పరమేశ్వరునికి జగన్నిర్మాణములో ప్రవృత్తి ఎందుకొఱకు? తన కొఱకా? ఇతరుల కొఱకా? తన కొఱకైనచో ఇష్టప్రాప్తికొఱకా? ఇష్టప్రాప్తి కొఱకుఁ గాదు. సకల కామములు పొందినవానికి ఇష్టప్రాప్తి యుపపన్నము గాదు. కనుకనే రెండవదియుఁ గాదు. రెండవ దానియందు ప్రవృత్తికి అనుపత్తియే. పరులకు ప్రవర్తించు వానిని ఎవఁడు ప్రేక్షావంతుఁడని [పరిశీలన పరుడు] యనును. కరుణచేఁ బ్రవర్తించుచున్నాడని యన్నచో ఒకఁడు దానిని ప్రత్యాఖ్యానము చేయును. అయితే కరుణా విరోధము వలన సర్వ ప్రాణులను సుఖవంతులుగానే గాని దుఃఖ మిశ్రితులుగా ఈశ్వరుఁడు సృజించి యుండడు. కారుణ్యమనఁగా స్వార్థము చూడక పర దుఃఖములను పోగొట్టు కోరికయెగదా. కనుక ఈశ్వరుఁడు జగత్తును సృష్టించెననుటయుక్తము గాదు.

ప్రయోజన మనుద్దిశ్య నమందోఽ పిప్రవర్తతే
జగచ్చ సృజత స్తస్య కింనామ నకృతం భవేత్
అని భట్టాచార్యులచే నిట్లు చెప్పఁబడినది.

ప్రయోజనమును ఉద్దేశింపక మందుఁడు గూడ ప్రవర్తింపఁడు. జగత్తును సృజించు నాతఁడు చేయనిదేమి యుండును. మరి ఇక్కడ నిది చెప్పఁబడుచున్నది. 'ఓ నాస్తిక శిరోమణీ! కొంచెము ఈర్ష్యతోఁ గలుషమైన కన్నులను మూసికొని నీవు భావింతువు గాక కరుణచేఁ బ్రవృత్తి యుండనే యున్నది. స్వభావ సిద్ధముగా సుఖమయ సృష్టి ప్రసక్తియునులేదు. సృజింపఁబడిన ప్రాణుల పాపపుణ్యములను బట్టిచేయు పరిపాకవిశేషముండుట వలన అతనికి వైషమ్యము ఉపపన్నమగును గదా. దీనిచే అపుడు స్వాతంత్ర్య భంగమున్నదనరాదు కూడ. ఈశ్వరుఁడు కుమ్మరి వలెనే పనులు చేయును. ఈశ్వరునికి కుమ్మరికిని కార్యకరణములతో మాత్రమె పోలిక. ఈ మాత్రము చేతచే విరోధమున్నదన్నచో పొగ వలన అగ్ని కూడ సాధింపలేము. మనుజుడు ఇతర దేహాపేక్ష లేకుండ స్వతంత్రుఁడై పనిచేయుచున్నట్లే శరీరము లేకున్నను ఈశ్వరుఁడు తన యిచ్ఛచేతనే కార్యములు చేయ గలఁడు. ఇచ్ఛాజ్ఞాన ప్రయత్నములు ఈశ్వర గుణములు. అవి శరీరము లేకున్నను పరమాణువు నందు రూపమువలె నుండును. 'తన యంగము తన్ను వ్యవధానపఱచునది కాదు' అను న్యాయముచేత పైఁగా దానినే నిర్వహించుట వలన.

'ఏక ఏవ రుద్రోన ద్వితీయోఽవతస్థే [త్తై. సం.1. 8. 6.]
'రుద్రుఁడొక్కడే రెండవవాఁడు లేఁడు' అని. ఇత్యాదులాగమములు. ఆగమమునుబట్టి ఈశ్వరునికి ఈశ్వరునిబట్టి ఆగమమునకు ప్రమాణమగుటచే ఈశ్వరాగముల పరస్పరాశ్రయ బాధ వ్యాధిని సమాధానపఱచుము' అన్నచో అది బయలుదేఱక పోవుచున్నదే' ఉత్పత్తిలో పరస్పరాశ్రయము శంకింపఁబడుచున్నదా? జ్ఞప్తిలో శంకింపఁబడుచున్నదా? ఈశ్వరాధీనోత్పత్తి గలదైనను పరమేశ్వరుఁడు నిత్యుఁడు అగుటచేత ఉత్పత్తి యుపపన్నము గాదు— జ్ఞప్తిలోను సరిపడదు. పరమేశ్వరుఁడు అగమాధీన జ్ఞప్తి కలవాఁ

డైనను అది గురుపరంపరాదిచే గలుగు జ్ఞానములో ఆ ఈశ్వరాపేక్ష లేదు. ఇట్లు అగమవృత్తి ధర్మముల జ్ఞానమందును ఈశ్వరాపేక్షలేదు. గురు పరంపరాది ఇతరము వల్లఁ దెలియబడుట వల్లవాని అనిత్యత్వ జ్ఞప్తిలోను సరిపడదు. అగమానిత్యత్వము తీవ్రాది ధర్మయుత మగుటచేత సుగమ మగుట వల్ల అగమోత్పత్తిలో ఈశ్వరాపేక్షకాని ఉత్పత్తిలో గాదు. అని విషయ భేదము వల్ల పరస్పరాశ్రయ దోషములేదు. ఇట్లే ఈశ్వర ప్రామా ణ్యాగమ ప్రామాణ్యము లందని తెలియవలెను. కనుక నివర్తక ధర్మాను ష్ఠాన వశము వలన ఈశ్వరుని యనుగ్రహము సిద్ధింపఁగా అభిమతమైన యిష్టసిద్ధి కలుగును.కారీరి నామ యజ్ఞముచేయుటవల్ల వర్షము కలుగును. దీనినిబట్టి స్వర్గ మోక్షాదులైన యదృష్ట పదార్థములను గూడ విశ్వసింప వలయునని గ్రహింపలెనని శంకరదర్శనము ఇట్లు సర్వము అవదాతమె.

ఇది చర్ల వేంకమ్మ నారాయణ శాస్త్రిల తనయుడగు
చర్ల గణపతిచే ననువదింపఁబడిన
శ్రీ మత్సాయణ మాధవీయమగు సర్వదర్శన సంగ్రహము
—అక్షపాద దర్శనము.

## జైమిని

ఇతని కాలాదులు సరిగాతెలియవు కాని ఇతఁడు వ్యాసుని శిష్యులలో ఒకడు. సామగాన గానము చేయు ఆచార్యులు పదుముగ్గురలో జైమిని ఒకఁ డుగా సామతర్పణము అను పుస్తకములో పేర్కొనఁబడెను. సామవేదమునకు జైమినీయ సంహిత అను నది కలదు ఇతఁడు పైల వైశంపాయన సుమం తులతో గలసి చమర్వేద సూత్రముల నేర్పాటుచేసెను. ఇతని సామవేదమును తనకుమారుఁడగు సుమంతుని కుపదేశించెనని భారత భాగవతములలోఁ గలదు. సుమంతుఁడు ఆవేదమును వనకుమారుఁడగు సుకర్ముని కుపదేశింపంగా అతఁడు దానిని సహస్రశాఖలుగా విబజించినట్లు భాగవతము చెప్పుచున్నది ఈ జైమిని పూర్వ మీమాంసను రచించెను. దీనిలో వ్యాసుని సూత్రములను ప్రస్తావిం చెను వ్యాసుని బ్రహ్మసూత్రముల జైమిని ప్రశంస కలదు దీనిని బట్టివ్యాసుని

శిష్యుఁడై సమకాలికుఁడుగా నుండెనని తెలియుచున్నది. వ్యాసునికాలము 5000 ఏండ్లకు పూర్వము కాన ఇతని కాలమును అప్పటిదే యయిందును. జ్యోతిషములో జైమిని సూత్రము అను పేరగ్రంథము గలదు అది యతని రచన అవునో కాదో చెప్పలేదు. జైమిని భారతము అనునది ఇతనిదే యయిం డ వచ్చును. జైమిని అడుగుజాడలలో కుమారిల భట్టు మండన మిశ్రుడు మొదలగు వారు నడచి కర్మకాండను ప్రచారము చేసిరి. పూర్వమీమాంసకు భాట్టసారమనువ్యాఖ్య కలదు.

## జైమిని దర్శనము

ధర్మమును అనుష్ఠించుట వలన అభిమత ధర్మము సిద్ధించునని ఘోషింపఁబడినది. అందు ధర్మమనఁగాచేమి దానికి ఏది ప్రమాణము అన్నచోఁ జెప్పఁబడుచున్నది. శ్రద్ధగా వినఁదగును. ఈ ప్రశ్నకు సమాధానము పూర్వ మీమాంస యందు జైమిని మునిచేఁ బ్రదర్శింపఁబడినది. ఆ మీమాంస పన్నెండు లక్షణములు గలది. అందు మెదటి యధ్యాయమున విధి అర్థవాదము మంత్రము స్మృతి అనఁబడు శబ్దరాశికిఁ బ్రామాణ్యము చెప్పఁ బడినది రెండవ యధ్యాయమున కర్మభేదోపోద్ఘాత ప్రమాణావవాద ప్రయోగ భేద రూపమైన యర్థము చూపఁబడినది. మూఁడవ యధ్యాయమున శ్రుతి లింగ వాక్యాది విరోధ ప్రతిపత్తి కర్మానారభ్యాధీత, బహు ప్రధానోపకారక, ప్రయాజాది యాజమాన చింతనము చేయబడినది.

నాల్గవ యధ్యాయమున ప్రధాన ప్రయోజకత్వా ప్రధాన ప్రయోజకత్వ జుహూ వర్ణతాదిఫల రాజసూయగత జఘన్యాంగాక్ష ద్యూతాది చింత అయిదవ యధ్యాయమున శ్రుత్యాది క్రమ తద్విశేష వృద్ధ్యర్థ వన ప్రాబల్య దౌర్బల్య చింత ఆఱవ యధ్యాయమున అధికారితద్ధర్మ ద్రవ్యర్థ ప్రతినిధ్యర్థ లోపన ప్రాయశ్చిత్త సత్రదేయ వహ్ని విచారము ఏడవదానియందు ప్రత్యక్ష వచనాతి దేశ శేష నామలింగాతి దేశ విచారము. ఎనిమిదవ దానియందు స్పష్టాస్పష్ట ప్రబల లింగాతిదేశాపవాద విచారము తొమ్మిదవదాని యందు

ఊహ విచారారంభ సామోహ మంత్రోహ తత్ప్రసంగా గతవిచారము. పదవ దానిలో బాధహేతు ద్వారలోప విస్తార బాధకారణ కార్యైకత్వసముచ్చయ గ్రహాది సామ ప్రకీర్ణ సఞర్థ విచారము. పదునొకండవ దానియందు తంత్రోపోద్ఘాత తంత్రా వాప ప్రపంచ నావాప ప్రపంచన చింతనములు పన్నెండవ దానిలో ప్రసంగ తంత్రి నిర్ణయ సముచ్చయ వికల్ప విచారము చేయఁ బడెను.

అథాతో ధర్మ జిజ్ఞాసా (జై. సూ. 1. 1. 1)

అందుసూ. మఱియింక ధర్మ జిజ్ఞాస చేయబడును.

ఈ మొదటి యధికరణము పూర్వమీమాంసారంభోప పాదన పరమైనది. అధికరణములో పంచావ యవములుండు నందురు. విషయము సంశయము పూర్వపక్షము సిద్ధాంతము సంగతి అనునైదు నవయవములుండును

అందు ఆచార్య మతాను సారముగా అధికరణము నిరూపింపఁబడును. స్వాధ్యాయము అధ్యయమున చేయఁదగినది అనునది విషయము. చోదనా లక్షణార్థోధర్మః (జై. సూ. 1. 1 2) చోదనా (లేదా విధి వాక్య) లక్షణార్థ మైనది ధర్మము. అనునది మొదలు కొని అన్వాహార్యేచ దర్శనాత్ (జై. 12 4. 46)అనునంత వఱకు అధ్యయన విధి యొక్క దృష్టార్థత్వా దృష్టార్థ త్వములను బట్టి జైమినీయ ధర్మశాస్త్రము ఆరంభింపఁ దగినదా ఆరంభింపఁ దగనిదా అనునది సందేహము. అధ్యయ విధియొక్క యర్థావ బోధ లక్షణ దృష్ట ఫలకత్వ మనుపన్నమగుట వల్ల ఆరంభింపరాదని పూర్వపక్షము. అర్థావబోధ కొఱకు అధ్యయన విధియని చెప్పువానినిట్లు ప్రశ్నింపవలయును. ఏ మాత్ర మును పొందింపని యధ్యయనము విధింపఁబడుచున్నదా? స్వాధ్యాయోఽధ్యేతవ్యః అను విధి అపూర్వవిధియా లేక నియమవిధియా అని సంశయము. అవఘాతము (దంచుట) వలె పాక్షికమని నియమింపఁ బడుచున్నదా? అని. అందు మొదటిది సరికాదు. వివాదాస్పదమైన వేదాధ్యయనము అర్థావబోధకు హేతువు అధ్యయన మగుటవలన భారతాధ్యాయనము వలెనను అనుమానము చేతను విధిని అపేక్షింపకయె లోకము వలన ప్రాప్తమగుట వలన. అయితే రెండవ పక్షమగుగాక, గోళ్ళచే ఒలుచుట మొదలగు

వానిచే తండుల నిష్పత్తి సంభవించుట-వలన పాక్షికమైన యవఘాతము తప్పక చేయఁదగినది అని విధిచే నియమింపఁబడు చున్నది. అట్లే లిఖిత పాఠముచేత అర్థ జ్ఞానము సంభవించుట వలన పాక్షికమైన యధ్యయనము విధిచేత నియమింపఁబడుచున్నచో దృష్టాంతములకు వైధర్మ్యము సంభవించుటవలన ఇది రాచ బాటకాదు. అవఘాతము చేత (దంచుటచేత) తయారైన తండులములచేతనే పిష్ట పురోడాశాదులను చేసినపుడు అవాంతరాఽపూర్వము ద్వారా దర్శపూర్ణరూపములు పరమాఽపూర్వమును గలిగించునుగాని మఱొక రీతిగా మాత్రము గాదు. సంస్కారరూప అపూర్వము అవఘాతమునకు నియమమైన హేతువు. ప్రకృతమందు లిఖిత పాఠ జన్యముగాని అధ్యయన జన్యముగాని అయిన యర్థావ బోధచేత క్రతృనుష్ఠానము సిద్ధించుట వలన అధ్యయమునకు నియమమైన హేతువు లెనేలేదు. కనుక అర్థావబోధకు హేతువైన విచార శాస్త్రము గాదని తెలియు చున్నది. అయితే శ్రూయమాణమైన విధికి గతియేమి అన్నచో స్వర్గమె ఫలముగాఁ గల అక్షర గ్రహణ మాత్రవిధియే గతి యని నీవు సంతోషింతువు గాక 'విశ్వజితా యజేత' విశ్వజిద్యాగము చేయవలెను అనుచోట ఎవడు ఏ కోరిక కలవాడు చేయవలెనో చెప్పక పోవుట చేత ఎవడు చేయవలెను అని ప్రశ్నరాగా ఏదో ఫలమును కల్పించి ఆఫలమును గోరువాడే దానికి అధికారి అని కల్పింపవలెను. దానినే అందఱును కోరుదురు. కల్పితఫలమె స్వర్గముగాకల్పింప బడుచున్నది. దానినే విశ్వజిన్న్యాయ మందురు. విశ్వజిన్న్యాయముచేత అశ్రుతమైన స్వర్గమును గూడఁ గల్పించుటకు శక్యమగుట వలన ఎట్లు ఆస్వర్గము సర్వులను గూర్చి అవిశిష్టమగుట వలన సర్వర్థః సర్వాన్ ప్రత్యవిశిష్టత్వాత్ (జై సూ. 4. 3. 13) అని విశ్వ జిత్తు నందు శ్రుతము కాకపోయినను అధికారిని సంపాదించువాని చేత తద్విశేషణమైన స్వర్గఫలమును యుక్తిచే నిర్ణయింపఁబడెను. అట్లే అధ్యయనమందును అగుఁగాక. అది యిట్లు చెప్పఁబడెను.

'వినాఽపి విధినా దృష్టలాభాన్న హి తదర్థతా'
కల్ప్యస్తు విధిసామర్థ్యాత్ స్వర్గో విశ్వజిదాదివత్'

విధి లేకపోయినను లోకమువల్ల దృష్టలాభము కలుగుట వల్ల దృష్టఫల

త్వము చెప్పరాదు. విధి సామర్థ్యము వలన విశ్వజితాదులకు వలె స్వర్గ మైతే కల్ప్యము' అని.

ఇట్లు కాఁగా 'వేద మధీత్యస్నాయాత్' వేదమును జదివి స్నానము చేయవలయును. అను స్మృతి అనుగ్రహింపఁ బడినదగును. వేదాధ్య యనము సమావర్తనము [వేదము చదివి గురువు ననుమతితో ఇంటికి పోవునప్పటి సంస్కారము.] రెండు వ్యవధానము లేకుండ జరుగవలయు నని తెలియుచున్నది. నీ మతమందైతే వేదము చదివినను ధర్మవిచారము కొఱకు గురుకులమందు నివసింపవలయును. అట్లైనచో 'వ్యవధానము లేకుండ' అనునది బాధించును. కనుక విచారశాస్త్రము విధి యుక్తము కాకపోవుట వలన పాఠ మాత్రముచేత స్వర్గము సిద్ధించుట వలన సమా వర్తన శాస్త్రమువల్లను ధర్మవిచార శాస్త్రము అరంభింపరాదని పూర్వపక్ష సంక్షేపము—

సిద్ధాంతమైతే ఇతరమగు దానివల్ల [లిఖిత పాఠముచేఁగూడ అధ్య యనము] ప్రాప్తమగుట వలన అ ప్రాప్తవిధిత్వము కాకపోవుఁగాక. నియమ విధిత్వ పక్షమైతే వజ్రహస్తుని చేతఁగూడ [ఇంద్రునిచేఁగూడ] దోసివే యుటకు శక్యముగాదు. ఎట్లనగా 'స్వాధ్యాయోఽ ధ్యేతవ్యః' స్వాధ్యా యము చదువఁదగినది అనుచోటఁ గల తవ్యః అను [తగిన] ప్రత్యయము ప్రేరణ కింకొక పర్యాయమైన పురుషప్రవృత్తి రూపార్థ భావనచే [వ్యాపార విశేషముచే] భావింపఁదగిన శాబ్దీ భావనను [తవ్య ప్రత్యయరూప శబ్ద మునకు ప్రేరణ రూప వ్యాపారమె అభిధా భావన శాబ్దీభావన] నమ్మింపఁ జేయుచున్నది. అ యర్థ భావన అభిధా భావనచే అధ్యయనాదులందలి పురుష ప్రవృత్తియె ఆర్థీ భావన అనఁబడును.) భావింపఁ దగిన దానిని అకాం క్షించును గదా స్వాధ్యాయో అధ్యేతవ్యః అనుచో అర్థభావన చెప్పఁబడును. ప్రకృతిచే అధ్యయనము చెప్పఁబడుచున్నది అని సమాన పదముచే నుపాత్త మైన యధ్యయనము భావింపఁదగినదిగా సుఖపెట్టదు. అధ్యయనశబ్దమునకు అర్థమైన స్వాధీనోచ్చారణ క్షమమైన వాఙ్మనస వ్యాపారము భావింపఁదగి యుండుట యసంభవము గనుక. సమాన వాక్యోపాత్తమైన స్వాధ్యాయ

మును గాదు. స్వాధ్యాయ శబ్దమునకు అర్థమైన వర్ణరాశి నిత్యమగుట చేతను విభువగుట చేతను ఉత్పత్తి ప్రాప్తి వికారము సంస్కారము అను నాలుగు క్రియాఫలములు అసంభవమగుట వలన. కనుక సామర్థ్య ప్రాప్తమైన యవబోధ భావింపఁ దగినదిగా నుండును. అర్థుఁడైన విద్వాంసుఁడు అధికారము గలవాఁడుగాఁ జేయఁ బడుచున్నాఁడను న్యాయము చేత దర్శపూర్ణమాసాది విధులు స్వవిషయ బోధను అపేక్షించునవై స్వార్థబోధలో స్వాధ్యాయమును వినియోగించుచున్నవి. అధ్యయన విధియును లిఖిత పాఠాదులను వ్యావర్తింపఁ జేయుట ద్వారా స్వాధ్యాయము అధ్యయనముచే సంస్కరింపఁ బడుటను దెలుపుచున్నది. అట్లు కాఁగా దర్శపూర్ణమాసాది జన్యమైన పరమైన యపూర్వము అవఘాతాదుల [దంచుట మొదలగువానిచేత] చేత జన్యమైన యవాంతరమైన యపూర్వమును ఎట్లు గల్పించుచున్నదో అట్లు సమస్త క్రతువులచేత జన్యమైన యపూర్వము సమూహము క్రతుజ్ఞానమునకు సాధనమైన యధ్యయన నియములచేతఁ బుట్టిన యపూర్వమును కల్పించును. నియమముయొక్క యదృష్టానిష్టములను గూర్చి విధి శ్రవణ వైఫల్యము ఆపన్నమగును. అర్థావబోధరూపమైన దృష్టఫలము ఉండఁగా ఫలాంతర కల్పన యుక్తము కాదు గాన విశ్వజిన్న్యాయము చేత ఫల కల్పన అవకల్పింపఁ బడదు కూడ. అది యిట్లు చెప్పఁబడినది.

లభ్యమానే ఫలేదృష్టే నాదృష్ట ఫల కల్పనా
విధేస్తు నియమార్థత్వా న్నానర్థక్యం భవతి.

'దృష్టమైన ఫలము లభ్యమాన మగుచుండఁగా అదృష్ట ఫలకల్పన చేయరాదు. విధియైతే నియమార్గమైనదగుట వల్ల అనర్ధకము కాదు.. అని.

వేదము మాత్రమె [అర్థము లేకుండ] చదువు వానికి అర్థావబోధ ఉదయింపక పోయినను అంగములతోఁ గూడ వేదము చదువు పురుషునికి అర్థావ బోధము సంభవించుచే 'వేద విచారశాస్త్రము వ్యర్థము' అన్నచో— బోధ మాత్రము సంభవించినను బోధ నిర్ణయము విచారశాస్త్రమునకు అధీనమగుటవల్ల— అది వ్యర్థమనరాదు. అదెట్టులన :— అక్తాః శర్కరా

'ఉపదధాతి [తై. బ్రా. 3. 1.2. 4.] తడిసిన శర్కరములను దగ్గర ఉంచుచున్నాడు.' అనుచోట నేతిచేతనే తడిసిన అని గాని తైలముచే తడిసిన అని యర్థము కాదు. ఇట్టి నిర్ణయము వ్యాకరణము చేతఁగాని నిరుక్తము చేతఁగాని లభ్యముకాదు. విచారశాస్త్రము చేతనైతే 'తేజస్సే నేయి' అనువాక్యశేషము వలన అర్థ నిర్ణయము లబ్ధమగుచున్నది, కనుక ఆచారశాస్త్రము విధియుక్తము అని సిద్ధించుచున్నది. 'స్నానము చేసి భుజించుచున్నాడు' అనుచోట స్నానము చేసినతరువాత ఆస్నానము చేసినవాఁడే భుజించుచున్నాఁడు అని సమాన కర్తృత్వమును మాత్రమె తెలుపునట్లు వేదము చదివి స్నానము చేయవలయును.' అనుచోట గూడ సమాన కర్తృత్వమునే బోధించుచున్నది గాన గురుకుల నివృత్తి వ్యవధాన ప్రతిబంధకమై బాధించునని తలఁపరాదు కనుక విధి సామర్థ్యము వలననే అధికరణ సహస్రరూపమైన పూర్వమీమాంసా శాస్త్రము ఆరంభింపఁదగినదే.

ఈ యధికరణము శాస్త్రములో ఉపోద్ఘాతముగా సంబంధించును. ఇట్లును జెప్పఁబడినది—

'చింతాం ప్రకృత సిద్ధ్యర్థా ముపోద్ఘాతం ప్రచక్షతే'

ప్రకృతసిద్ధి కొఱకైన చింతను ఉపోద్ఘాతమందురు' అని.

ఈ యధికరణమే గురుమతమును అనుసరించి ఉపన్యసింపఁ బడుచున్నది— 'అష్టవర్షం బ్రాహ్మణ ముపనయీత తమధ్యాపయేత్' ఎనిమిదేండ్లు గల బ్రాహ్మణుని ఉపనయింపవలయును–వానిని జదివింపవలయును. అనుచోట అధ్యాపనము విధి విషయమై ప్రతిభాసించుచున్నది. విధిసాధింపఁదగినదని నియోజ్యమును అపేక్షించును. ఇక్కడ నియోజ్యము విధింపఁదగినది ఏమి అన్నచో ఆచార్యకమె [ఆచార్యుని కర్మ అధ్యాపనము] విధింపఁదగినది. సంమాన నోత్సంజనాచార్యక [పాణిని సూ. 1. 3. 3. 6] ఇత్యాదికమైన పాణిన్యను శాసనముచేత ఆచార్యకము గమ్యమానమగుచుండఁగా నీ ధాతువు ఆత్మనే పదముగా విధింపఁబడుచున్నది గనుక. ఉపనయనమందు ఎవఁడు నియోగింపఁ దగినవాఁడో వాఁడే అధ్యాపన

మందును ఆ రెండు ఒకటే ప్రయోజనము గలవి గనుక నియోగింపఁ దగిన వాడగును కనుకనే మనువిట్లు చెప్పెను.

ఉపనీయతుయః శిష్యం వేదమధ్యాపయేత్ ద్విజః
సాంగంచ సరహస్యంచ తమాచార్యం ప్రచక్షతే

[మను. స్మృ. 2. 1. 4. 0.]

ఏద్విజుఁడు అంగములతోడను రహస్యముల తోడను గూడిన వేదమును శిష్యునిఁజదివించునో అతనిని ఆచార్యుఁ డందురు అని. కనుక ఆచార్య కర్తృకమైన యధ్యాపనము మాణవక కర్తృకమైన యధ్యయనము లేకుండ సిద్ధింపదుగాన అధ్యాపన విధి ప్రయోగము చేత అధ్యయనానుష్ఠానము సిద్ధించును. ప్రయోగింపఁదగిన వ్యాపారములేకుండ ప్రయోగించువానిని వ్యాపారము నిర్వహింపఁబడదు గథా తర్హ్యధ్యేతవ్యః (తై ఆ. 2. 15) అనుదానికి విధిత్వము సిద్ధింపదు అన్నచో సిద్ధింపకపోనిమ్ము దానివల్ల మాకు వచ్చిన హానియేమి. వేఱుగా అధ్యయనవిధిని అంగీకరించుటలో ప్రయోజనములేదు గదా. విధివాక్యము నిత్యానువాదముగాఁ గూడ ఉపపన్నమగును. కనుక అధ్యయనవిధిని ఉపజీవింపఁజేసి యిదివఱకు ఉపన్యసింపఁబడిన పూర్వోత్తర పక్షములు ఇంకొక విధముగా ప్రదర్శింపఁదగినవి.

విచారశాస్త్రము విధిరూపముగా ఆరంభింపరాదు అన్నది పూర్వపక్షము. విధిరూపముగా ఆరంభింపఁదగినదని సిద్ధాంతము. అందు విచారణ విధిగా నాచరింపవలసినది. అని పలుకువారు 'అధ్యాపన విధి' మాణవకునికి అర్థమును గూడ బోధింపఁవలయునని తెలుపునా? లేక పాఠము మాత్రమునె తెలుపునా. అర్థావబోధ లేకుండఁగూడ అధ్యాపనము సిద్ధించుట వలన మొదటి పక్షము సరికాదు. పాఠమాత్రముతోనె విచారణకు విషయ ప్రయోజనములు సంభవింపవు గాన రెండవ పక్షము సరికాదు. పైకి ఆభాసగా సందేహముగానున్న యర్థము విచారశాస్త్రమునకు విషయమగును. అటువంటియప్పుడు ఎక్కడ అర్థజ్ఞానమైన నుండదో అక్కడ సందేహమన్నదే యుండదు గదా. విచారణకు ఫలమైన నిర్ణయమును గూర్చిన

ఆశయమే సంభవింపదు. కనుక సందేహముగాని ప్రయోజనముగాని లేనిది ప్రేక్షావంతులకు ప్రతిపాదన చేయుకోరికకు అవకాశమెగాదు. 'మనస్సు గలవాని యింద్రియములకు సన్నికృష్టమై స్పష్టమైన వెలుగుకు మధ్యగా ఘటము ఉన్నది!' అను న్యాయముచేత (స్పష్టముగా ఘటము కన్పించు నపుడు దానిని జూపుటకు ప్రయత్న మనవసరమైనట్లు) ఇక్కడ విషయ ప్రయోజనములు ఉండుట అసంభవమగుటచేత విచారశాస్త్రము ఆరంభిం పఁదగనిదని పూర్వపక్షము.

అధ్యాపన విధిచేత అర్థావబోధ ప్రయోజనమని చెప్పఁబడదు. అయినను సాంగముగా వేదములు చదివి పదపదార్థముల సంగతిని గ్రహిం చిన పురుషునికి పౌరుషేయములైన గ్రంథములందు వలె వేదమునందును అర్థావబోధ కలుగుచునే యుండును. శత్రుగృహమునకు భుజించుటకు వెళ్ళునపుడు అక్కడ 'విషము తినుము' అను తల్లి చెప్పిన వాక్యమునకు 'వీనియింటఁ దినకుము' అను భోజన ప్రతిషేధములోనే తాత్పర్య విషయ మగుట వలన ప్రతీయమానమగు నర్థము కూడ ఎట్లు వివక్షింపఁబడదో అట్లే ఆమ్నాయార్థమునకు వివక్ష లేనపుడు ఇదివరకే చెప్పిన విషయాద్యభావ దోషము ప్రాదుర్భవించుచున్నచో— అట దృష్టాంత దార్ష్టాంతికములలో వైషమ్యము సంభవించుచున్నది గాన— అట్లు అనరాదు. విషభోజన రూప వాక్యము అప్త ప్రణీత మగుటచేత ముఖ్యార్థ పరిగ్రహమునకు బాధ అగును అను వివక్ష ఆశ్రయింపబడదు. అపౌరుషేయమైన వేదమందైతే ప్రతీయ మానమైన యర్థము ఎందుకు విక్షింపఁబడదు? వివక్షితమైన వేదార్థమం దును ఎక్కడెక్కడ పురుషునికి సందేహము కలుగునో అది యంతయు విచారశాస్త్రమునకు విషయమగును. దాని నిర్ణయమె ప్రయోజనము కనుక అధ్యాపన విధిచేత ప్రయుక్తమైన యధ్యయనముచేత తెలియఁబడుచున్న యర్థము వికారణకు అర్హమగుట వలన విచారశాస్త్రము విధిగా ఆరంభింపఁ దగినదగుటచేత విచారశాస్త్రము ఆరంభింపఁ దగినదని సంగ్రముగాఁజెప్పిన సిద్ధాంతము.

సరే యిది యిట్లగుఁగాక. 'వేదము అపౌరుషేయము' అని యెట్లు చెప్పఁబడుచున్నది. వేదములు అపౌరుషేయములనుటకు ప్రమాణము లేదు. గదా. వేదములు అపౌరుషేయములు. సంప్రదాయము విచ్ఛిన్నము కాక పోఁగా వాని కర్తలెవరో స్మరింపఁబడక పోవుటవలన ఆత్మవలె అని తలఁతు వేని ఇది ఇట్లు తలంచుట సరికాదు. వేదములు పౌరుషేయములని వాదించువారు ప్రళయములో వేద సంప్రదాయము విచ్ఛిన్న మగునను పక్షమును స్వీకరించుటవలన 'విచ్ఛిన్నము కాకపోఁగా అను విశేషణము సిద్ధింపదు కాన. కర్తలు స్మరింపఁబడక పోవుట యనఁగానేమి. ప్రమాణ సిద్ధమైన కర్తృకత్వము లేకపోవుట అనియా, లేక స్మరణకు గోచరము కాని కర్తృకత్వము కలుగుట అనియా. వానికి కర్త పరమేశ్వరుఁడు అగును అను ప్రమాణమును అంగీకరించుట వలన మొదటి పక్షము సరికాదు. వేదకర్త ప్రమాణా సిద్ధుడా అస్మృతుడా అను వికల్పములను సహింపక పోవుటవలన రెండవ పక్షమును సరికాదు. అదెట్లన, ఎవరో యొకరు వానిని స్మరింపలేదుఅని యందుమా లేక అందఱును స్మరింపలేదు అని యందుమా. యోధర్మశీలో జితమానరోషః' ఎవఁడు ధర్మశీలుఁడు మానరోషములను జయించెనో అతఁడు కర్త

అస్యహతో భూతస్య నిఃశ్వసిత మేతత్ యదృగ్వేదో యజుర్వేద ఇత్యాది ముక్తి విషయబోధకములగు నుపనిషత్తులలో వ్యభిచారము కనిపించుటచే మొదటిది సరికాదు.

అందఱును స్మరింపకపోవుటకు సర్వజ్ఞులు కానివారు వానిని దెలిసికొన శక్యము గాకపోవుటవలనను పౌరుషేయత్వములో ప్రమాణము సంభవించుటవలనను రెండవది సరికాదు. వేదవాక్యములు కాళిదాసాది వాక్యములవలె వాక్యములగుట వలన. పౌరుషేయములు వేదవాక్యములు మన్వాది వాక్యములవలె ప్రమాణములగు చుండఁగా వాక్యములగుట ఆప్తులచేఁ బ్రణీతములైనవి." అని మతి

వేదస్యాధ్యయనం సర్వం గుర్వధ్యయన పూర్వకం
వేదాధ్యయన సామాన్య మధు నాధ్యయనం యథా

'వేదాధ్యయనము సర్వమును వేదాధ్యయన సామాన్య మగుటవలన నేటి యధ్యయనము వలె గుర్వధ్యయన పూర్వక మైనది' అను ననుమానమును గూర్చి సాధనము ప్రతికూల మగుచున్నది అన్నచో అదియును ప్రమాణకోటిని ప్రవేశింపఁజాలదు. ఏలయన.

భారతాధ్యయనం సర్వం గుర్వధ్యయన పూర్వకం

భారతాధ్యయనత్వేన సాంప్రతాధ్యయనం యథా. 'భారతాధ్యయనము సర్వము భారతాధ్యయన మగుటచేత నేటి యధ్యయనమువలె గుర్వధ్యయన పూర్వకమైనది.' అనుదానితో సమానముగా పైకికనిపించుచున్నది గదా అన్నచో అందు వ్యాసుఁడు కర్త అని స్ఫురింపఁబడుచున్నాఁడు గదా.

కోహ్యన్యః పుండరీకాక్షా న్మహా భారత కృద్భవేత్.

'పుండరీకాక్షుని కంటె నింకెవఁడు మహాభారత కర్త కాఁగలఁడు' ఇత్యాదులందు (కర్తృత్వము చెప్పఁబడెను) అని అన్నచో అందు సారములేదు. (అపౌరుషేయములని చెప్పుటలో సారములేదు.)

'ఋచః సామాని జజ్ఞిరే, ఛందాంసి జజ్ఞిరే
తస్మాద్యజు స్తస్మా దజాయత' (తె. అ. 3. 1. 2.)
'అతనివల్ల ఋక్కులు పుట్టెను. ఛందస్సులు పుట్టెను. అతనివల్ల యజుస్సు పుట్టెను.' అని. పురుషసూక్తములో వేదమునకు కర్తగలఁడని చెప్పఁబడుచున్నది గదా.

మఱియు శబ్దము అనిత్యము సామాన్యగుణము గలిగి యుండఁగా అస్మదాది బాహ్యేంద్రియములచే గ్రహింపఁదగి యుండుట వలన ఘటము వలె 'అదే యీ గకారము' అను ప్రతిజ్ఞచే 'ఈ యనుమానము' ప్రతిహతమయినదన్నచో అది యంతసుందరమైనది కాదు. అది తెగియూడి మరల బయలుదేరిన జుట్టువలె ఊడిన దళిత (దంత) కుందాదులందు వలె ప్రతిజ్ఞ

సామాన్య విషయమగుట వలన బాధకము కాదు. శరీరములేని పరమే శ్వరునికి తాల్వాదిస్థానములు లేవు గనుక వర్ణోచ్చారణము అసంభము గాదా. కనుక వేదములను అతఁడు రచించుట ఎట్లు సంభవించును అన్నచో అట్లనుట సరియైనది కాదు. స్వభావసిద్ధముగా అతనికి శరీరము లేక పోయినను అతఁడు భక్తులను అనుగ్రహించుటకై లీలావిగ్రహములను గ్రహించుట సంభవించును గదా. కనుక వేదములు అపౌరుషేయములు అని చెప్పుమాట యుక్తముగాదు అంటే ఆ విషయములలో సమాధాన మిప్పుడు చెప్పఁబడుచున్నది.

అసలు పౌరుషేయత్వమను దానిని ఎట్లు సాధింపవలసియున్నది. పౌరుషేయత్వమనఁగా అస్మదాదులు మాటిమాటికి ఉచ్చరించునట్లు వేదము పురుషుని నుండి ఉత్పన్నమైనది అనునంత మాత్రమేనా? లేక అస్మదా దులచే నిబంధింపఁబడిన ప్రబంధమునువలె ప్రమాణాంతరముచే అర్థమును పొంది దానిని ప్రకాశించుటకై రచించుటా? మొదటి పక్షములో విప్రతిపత్తి లేదు. ఇంక రెండవ పక్షములో అనుమానమును బట్టి దానిని సాధించుటా లేక ఆగమ బలమువలన దానిని సాధించుటా? మాలతీ మాధవాది వాక్యము లందు (మాలతీ మాధవాదికము పౌరుషేయవాక్యమగుట వల్ల శకుంత లాదుదులవలె అనుచోట) * సవ్యభిచారము ఉన్నది గాన మొదటి పక్షము సరికాదు. ప్రమాణముండఁగా అని విశేషణము వేయుదము అన్నచో అదికూడ పండితుల మనస్సు నందు విశదమగుటలేదు. ఏలయన వేద వాక్యము ఇతర ప్రమాణములకు గోచరము కాని సంగతినే ప్రతిపాదించు నది గదా. అది ఇతర ప్రమాణములకు గోచరమైన యర్థమును ప్రతిపా దించునది అని సాధింతమనుటకు 'నా తల్లి గొడ్డురాలు' అనునట్లు వ్యాఘా తము గలుగును.

---

*వ్యభిచారముతో గూడిన హేతువు సవ్యభిచారము అది హేత్వాభాస. వ్యభి చారమనగా సాధ్యాభావ పదవృత్తిత్వము. కొండ ధూమముగలది. వహ్ని వల్ల. ఇది ధూమములేని ఇనుపగుండునందు వహ్ని యుండుట వ్యభి చారము మాలతీ మాధవాది ఉదాహరణలో వాక్యత్వము హేతువు. సాధ్యము పౌరుషేయత్వము.

మఱియు పరమేశ్వరుడు లీలావిగ్రహమును పరిగ్రహించెదనని యంగీకరించినను అతీంద్రియార్థమును దర్శించుట సంఘటింపదు. దేశకాల స్వభావములను దాటినవి ప్రకృష్టమందున్న అర్థములను గ్రహించెడి యుపాయములు లేకపోవుచున్నవి. అతని యింద్రియములు చక్షురాదికమె అటువంటి విప్రకృష్టమందలి వస్తువుల ప్రతీతిని గలిగించుటలో క్షమమగునని తలఁపరాదు. దృష్టమైన యనుభవములను బట్టియె అటువంటి కల్పనను ఆశ్రయింపవలయును గదా. పరమేశ్వరునికి సర్వజ్ఞత్వమును నిరాకరించు సమయములో పెద్దలు భట్టాచార్యులుఁ గూడ నిట్లు చెప్పిరి. ఎట్లన,

యత్రాప్యతిశయో దృష్టః సస్వార్థా నతి లంఘనాత్
దూర సూక్ష్మాది దృష్టౌ స్యాన్నరూపే శ్రోత్ర వృత్తితా.

"ఎక్కడఁ గూడ అతిశయము చూడఁబడెనో అది స్వార్థమును అతిక్రమింపక పోవుటవలన దూరసూక్ష్మాది దృష్టిలో అగును. రూపమందు శ్రోత్రవృత్తిత్వము ఉండదు." అని, కనుకనే ఆగమబలము వలన దానిని సాధింపరాదు. 'తేన ప్రోక్తం' పా. సూ. 4. 3. 101) అను పాణినియొక్క యనుశాసనము ఉన్నను కాఠకము కాలాపము తైత్తిరీయము అను మొదలైన పేర్లు ఎట్లు అధ్యయన సంప్రదాయ ప్రవర్తక విషయములుగా యుపపన్నమగునో అట్లే ఇక్కడఁ గూడ సంప్రదాయ ప్రవర్తక విషయములుగాఁ గూడ ఉపపన్నమగును.

అదే యిది గోపదములోని ఆ గకారమె ప్రత్యభిజ్ఞానములో విరోధము గలుగుట వలన 'అనుమాన బలమును బట్టి శబ్దము అనిత్యము అని సిద్ధించుచున్నది.' అని యనరాదు. ఏకత్వము లేకపోయినను అది సామాన్యమూలకమైనదని అనుట సరికాదు. అందుఁ గొన్నిచోట్ల వ్యభిచారము కనిపించినపుడు దానిని ఉత్ప్రేక్షించు విషయములో స్వతః ప్రామాణ్యము వాదించు వారిచే నిట్లు చెప్పఁబడినది.

"ఉత్ప్రేక్షేతహి యోమోహా దజ్ఞాతమపి బాధనం
స సర్వ వ్యవహారేషు సంశయాత్మా వినశ్యతి" అని. 'ఎవఁడు తనకు తెలియక పోయినను బాధ గలుగుటను గూర్చి కూడ ఉత్ప్రేక్షించునో వాఁడు సర్వ వ్యవహారములలోను సంశయాత్మయై నశించును. అని'

ఓయీ! ఈ ప్రత్యభిజ్ఞానము గత్వాది జాతి విషయమె గాని గాది వ్యక్తి విషయముగాదు. ఆ గాది వ్యక్తులను ప్రతి పురుషునిలోను భేదము ఉపలబ్ధమగును. కనుక అట్లు గాని వ్యక్త్యైక్యమైనచో సోమశర్మ చదువుచున్నాడు అను విభాగము కాకపోవును. ఏగకారాదులు సోమశర్మచే అధీతములో అవే ఇతరులచే అధీతములని వాడిది చదివెను వాడది చదివెను అను వ్యవహారము నిరాలంబనమై పోవును అన్నచో అదికూడ శోభావహము గాదు. గాది వక్తి భేదములో ప్రమాణము లేకపోవుటచే గత్వాది జాతి విషయకల్పనలో ప్రమాణము లేకపోవుచున్నది గనుక. గోవు అంటె ఏమో తెలియనివానికి ఆ గోవు ఒకటే వేరువేరుచోట్ల వేరువేరుగా వేఱువేఱు మనుష్యులకు ఆయా విధముగా భిన్న దేశములలో చిన్నది వలె గొప్పది వలె, పొడుగుదివలె పొట్టిదివలె తోచునో అట్లేగ వ్యక్తిని తెలియని వానికి ఆ వ్యక్తి గూడ ప్రకటించనివి వేరువేరగుటవల్ల తత్తద్ధర్మాను బంధినియగు వ్యక్తిగా ప్రతిభాసించును. దీనిని బట్టి విరుద్ధధర్మా ధ్యాసవల్ల భేదము సిద్ధించుననుమాట నిరస్తమైనది. అందు స్వాభావికమైన విరుద్ధధర్మాధ్యాసము భేదసాధక మగునా? లేక ప్రాతీతిక మగునా? గోవు మొదలగు పదములందు గకారాదులందు స్వాభావిక విరుద్ధ ధర్మము లేకపోవుటవల్ల ప్రథమపక్షమున ఇది సిద్ధింపదు. ఇంకొక విధముగా స్వాభావిక భేదమును అంగీకరించిన పది గకారములను చైత్రుఁడుచ్చరించుచున్నాడు అను ప్రతిపత్తి గలుగును గాని పదిసారులు గకారమునుచ్చరించు చున్నాఁడనికాదు. ఇంక రెండవ పక్షముననైతే స్వాభావిక భేదము సిద్ధించునట్టి ఉపాధి భిన్నముగాన అందువల్ల, గలిగిన ఇతరోపాధి భేదముచేత స్వాభావికమైన భేదము పోదు. ఆకాశమునకుఁ గూడ ఇది ఘటాకాశము ఇది గృహాకాశము అని ఘటాద్యుపాధి భేదముచేత స్వాభావికమైన భేదము లేకపోవుఁగాక.

ఈ గకారమును సోమశర్మ చదివెను ఇది చంద్రశర్మ చదివెను అను వాక్య వృత్తమైన నిదానము నాదమూలకము (వ్యంజక ధ్వని మూలకము) అది ఆచార్యులచే నిట్లు చెప్పఁబడెను.

'ప్రయోజనంతు యజ్ఞాతే స్తత్ద్వర్ణా దేవలప్స్యతే
వ్యక్తి లభ్యంతు నాదేభ్య ఇతి గత్వాది ధీర్వృథా'

'గకారాది వ్యక్త్యైక్యము వల్ల అక్కడ గత్వాది జాతిలేదు. జాతివల్ల ఏ ప్రయోజనమున్నదో అది వర్ణము వల్లనే లభింపఁగలదు. వ్యక్తివల్ల లభింపఁదగినదైతే నాదము వల్లనే అగును. తారస్వర గకారము మంద్రస్వర గకారము ఇత్యాది భేదప్రతీతి వ్యక్తి నానాత్వ ప్రయోజనము కనుక గత్వాది బుద్ధి వ్యర్థము' అని.

ప్రత్యభిజ్ఞా యదాశబ్దే జాగర్తి నిరవగ్రహా
అనిత్యత్వానుమానాని సైవసర్వాణి బాధతే'

'ఎప్పుడైతే శబ్దమందు ఆగకారమె ఇది అను ప్రత్యభిజ్ఞ అడ్డులేనిదై మేల్కొని యున్నదో అదే అనిత్యత్వానుమానము లన్నిటిని బాధించును అని.

కనుక— 'చక్షూరూపము వలె శబ్దము ఇంద్రియ గ్రాహ్యవిశేష గుణము గలదగుట వలన అనిత్యము' అని మానమనోహరములో వాగీశ్వరుఁడు చెప్పినది దీనిచే నిరస్తమైనది. మీమాంసకులు మధ్యమతాను యాయులును గూడ గకారాదులు ద్రవ్యమనిరి. దీనిని బట్టి శబ్దము గుణమెకాదు. ద్రవ్యమె. శబ్దము ద్రవ్యము అని ద్రవ్యత్వాదిని గూర్చి శబ్దము గుణము కాదు కనుక ఇంద్రియగ్రాహ్య విశేష గుణత్వమను పక్షమైన శబ్దమందు హేతువు లేదు. స్వరూపాసిద్ధ హేతువు సిద్ధింపక పోవుటవలనను ధ్వన్యంశమందు సిద్ధ సాధన మగుటచే సాధవాపేక్షలేదు గాన అశ్రావణత్వోపాధి బాధితమగుట వలనను వాగీశ్వరుఁడు చెప్పినది సరికాదు. ఎక్కడ అనిత్యత్వమున్నదో అక్కడ అశ్రావణత్వమున్నది ఘటాదులందు వలె అని సాధ్య వ్యాపకత్వము. ఎక్కడ ఇంద్రియ గ్రాహ్య విశేష గుణత్వమున్నదో

అక్కడ అశ్రావణత్వమున్నది అను నియమములేదు. శబ్దమందె వ్యభి చరించుట వల్ల అని సాధనావ్యాపకత్వము. కనుక అశ్రావణత్వ రూపో పాధి ఉండుటవల్ల సోపాధికమైన హేతువు వ్యాప్యత్వా సిద్ధమని భావము. ఉదయనుండైతే ఆశ్రయము ప్రత్యక్షము కాకపోయినన్ను అ భావము ప్రత్యక్షమె అని మహా ప్రయత్నముచే ప్రతిపాదించుచు కోలాహలము నివృత్తము, శబ్దము ఉత్పన్నము 'అనువ్యవహారాచరణకై కారణమైన ప్రత్య క్షమును శబ్దానిత్యములో ప్రమాణీకరించున్నాడు. ఉదయను మతమిది అనిత్యము శబ్దము తదుత్పత్తి వినాశనములు ప్రత్యక్ష సిద్ధమగుటవల్ల. శబ్దము ఉత్పన్నము అను వ్యవహారము శబ్దోత్పత్తి ప్రత్యక్ష మూలకము కోలాహలము నివృత్తము అను వ్యవహారము శబ్దవినాశ ప్రత్యక్షమూలకము. శబ్దము వాయువు అప్రత్యక్షమైనను తద్గత రూపాభావము చాక్షుషముగా కనిపించుటచే ఉక్తకార్యకారణ భావమును అంగీకరించక పోవుటచే- శబ్ద వినాశము ప్రధ్వంసా భావరూపము గాన ప్రత్యక్షమెట్లు అభావ ప్రత్యక్షము ఆశ్రయప్రత్యక్ష కారణము గనుక. శబ్దవినాశాశ్రయాకాశము అతీంద్రియ ముగాన అప్రత్యక్షమగుటవల్ల అని అనరాదని భావము. అది కూడ విరుద్ధ ధర్మసంసర్గము ఔపాధికము (ఉపాది భేదసిద్దము) అని ఉపాదించెడి న్యాయము. రక్తబలి యివ్వగా సంతోషించి బాధించని భేతాళుని వంటిది. తార మంద్రత్వాది విరుద్ధధర్మములు శబ్దములో లేకున్నను భాసించునట్లు ఉత్పత్తి వినాశనములును భాసించును కనుక వ్యవహారము కుదురును. నిత్యత్వ విషయములో న్యాయభూషణకారునిచేత చెప్పఁబడిన సర్వదా ఉపలబ్ధికి అనుపలబ్ధికి సంబంధించిన ప్రసంగము ఏదైతే గలదో అదికూడ ధ్వనిచే సంస్కరింపఁబడినది ఉపలబ్దమగునని అంగీకరించుట వలన ప్రతి క్షిప్తము. ఒక్కమాటుగా ఇంద్రియములకు సంబంధముగా ప్రతినియ తమై సంస్కారములచే సంస్కరింపఁదగి యుండవను ననుమానమేది. శబ్ద విశేషము నియత సంస్కార్యముకాదు. ఇతరములతో కూడ సంబంధములో విశేషము లేకపోవుటవల్ల అని. ఇది సద్హేతువుగాదు. సర్వజీవులు విభు వులు గాన అంతట ఉన్నను చాక్షుషాది జ్ఞానకాలములో ఒకే ఆత్మవిశేషము

సంస్కార్యముగా కనిపించుటవల్ల గలదో అది ఆత్మయందు అనైకాంతిక మగుచున్నది. కనుక ఇంక అతి కలహము చేయుటచాలు. కనుక వేదము అపేరుషేయము అని సిద్ధించినది. కావ సమస్త శంకా కళంకాం కురములు నిరసింపఁబడినవి అందుచే ధర్మమందు స్వతః ప్రామాణ్యము సిద్ధించినది గావ యిది సుస్థితము. సరే ఇది యిట్లు కానిమ్ము.

ప్రమాణత్వా ప్రమాణత్వే స్వతః సాంఖ్యాః సమాశ్రితాః
నైయాయికాస్తే పరతః సౌగతా శ్చరమం స్వతః
ప్రథమం పరతః ప్రాహుః ప్రామాణ్యం వేదవాదినః
ప్రామాణ్యం స్వతః ప్రాహుః పరత శ్చా ప్రమాణతాం

ప్రమాణములన్నవి స్వయముగానా? ఇతరములను బట్టియా? అని సంశయము. సాంఖ్యులు ప్రమాణత్వమునకుగాని అపమాణత్వమునకు గాని కారణము స్వతస్సిద్ధముగానే గలుగునందురు. ఆ నైయాయికులు పరమైన దానివల్ల ప్రమాణత్వమునుగాని అంగీకరింతురు. సౌగతులు (బౌద్ధులు) అప్రమాణత్వమును స్వతః ప్రమాణత్వము గలదిగా నంగీకరింతురు. వేదవాదులు ప్రమాణత్వమును ఇతరమైన దానివల్ల నగుననిఅంగీకరింతురు. వేదవాదులు స్వతహా ప్రమాణత్వమును పరమైన దానివల్ల అప్రమాణత్వమును చెప్పిరి.

ఇట్లు వాదుల వివాదము కనిపించుట వలన ధర్మమందు ప్రామాణ్యము స్వతః సిద్ధముగా సిద్ధమైనట్లే స్వీకరింపఁ బడుచున్నది. యథార్థానుభావరూప ప్రామాణ్యమును ప్రమయమందురు.

స్వతః ప్రామాణ్యమనగానేమి? 1. స్వయముగానే ప్రామాణ్యము పుట్టినదా? 2. లేక స్వాశ్రయమైవ జ్ఞానము వలనఁ బుట్టినదా? 3. లేక తన్ను ఆశ్రయించిన జ్ఞాన సామగ్రిచే పుట్టినదా? 4. లేక జ్ఞాన సామగ్రిచే పుట్టిన జ్ఞానవిశేషమును ఆశ్రయించుటా? 5. లేక జ్ఞాన సామాన్య సామగ్రి మాత్రముచే పుట్టిన జ్ఞానవిశేషమును ఆశ్రయించుటా.

అందు మొదటి పక్షము దోషయుక్తమైనది. ఏలయన కార్యాకారణ భావము భేద సామానాధికరణ్యము గలది గాన ఒకదానియందు అది యుండుట అసంభవము స్వతఃప్రమాణము అన్నప్పుడు ఇంకొకటిలేను కనుక తనయందు తనకు ప్రామాణ్యమెట్లు. రెండవ పక్షమును పనికిరాదు. గుణముగా ఉన్నజ్ఞానము ప్రామాణ్యమును గుఱించి సమవాయి కారణ మగుట వలన అది ద్రవ్యము గావలసివచ్చును. కనుక జ్ఞానము ఆత్మకు గుణము ద్రవ్యమునుగాదు. అది ఎప్పటికి దేనికిని సమవాయి కారణము కానేరదని భావము. ఇంక మూడవదియుగాను. ప్రామాణ్యము ఉపాధి (అనుభవాత్మక జ్ఞానమునకు అత్యంతము బాధలేకపోవుటయె యిక్కడ ఉపాధి యనఁగా) యైనపుడుగాని జాతి యైనపుడుగాని దానికి జన్మ అసంభవము కాఁబట్టి స్మృతిత్వమునకు అనధికరణమైన జ్ఞానమునకు బాధాత్యంత భావనమే ప్రామాణ్యోపాధి యనఁగా. దానికో ఉత్పత్తి సంభవింపదు. అంత్యతాభావము నిత్యమని అంగీకరింపఁబడినది కనుక. నిత్యము గనుకనే జాతికి గూడఁ బుట్టుక యుక్తముగాదు. ఇంక నాల్గవ పక్షమును సరికాదుఁ అప్రమ అయధార్థజ్ఞానము విశేషము గదా. వృక్ష సామగ్రి శింశుపా సామగ్రి యందు బీజ సామాన్యమున ఎట్లు సామాన్య సామగ్రి విశేష సామగ్రియందు అను ప్రవేశించును. మఱియొక విధముగా నైనదన్నచో అట్లు విశేష వృక్షమందు బీజములేక, విశేషమందు సామాన్యము ఉండక ఏదో అకస్మిక ఘట్టముచేత అట్లు జరుగునని చెప్పవలసి వచ్చును. కనుక పరతః ప్రమాణత్వముచేత స్వీకరింపఁబడిన యప్రామాణ్యము విజ్ఞాన సామాన్య సామగ్రీ జన్యా శ్రితత్వమని అతివ్యాప్తి అపన్నమగును. అకస్మికముగా ఏదో జరిగినదన్నప్పుడు చెప్పబడిన అయధార్థ జ్ఞానము జ్ఞానసామగ్రి జన్యమైన జ్ఞానవిశేషము. దానిని ఆశ్రయించినది అప్రామాణ్యము. కాన అప్రామాణ్యమందు ప్రామాణ్య లక్షణ ప్రసక్తిచేత అతివ్యాప్తి కలుగునని భావము. అయిదవ వికల్పము వికల్పితము.

జ్ఞాన సామగ్రీ మాత్ర జన్యత్వమనఁగా, దోషాభావ సహకృతమైన జ్ఞానసామగ్రిచేత జన్యమగుటయె అనియా లేక దోషాభావాసహకృత జ్ఞాన సామగ్రీ జన్యత్వమనియా. మొదటి పక్షము కాదు. పరతః ప్రామాణ్యవాదులు

దోషాభావముతో గూడిన జ్ఞానసామగ్రీ జన్యత్వమునె తరతః ప్రామాణ్యమని వారు అంగీకరించుట వలనఁ రెండవ పక్షమును గాదు యథార్థ జ్ఞానములో దోషాభావము కారణము కాదు అని చెప్పినది జ్ఞానము కలిగించు నింద్రియముల దోషాభావము కేవలము సాయము చేయుచున్నది కాని పార్థక్యముగా దానికి జ్ఞానమునుగూర్చి కారణత్వమను నభిప్రాయముతోనా లేక నిస్స్వరూపాభావము ఎక్కడను కారణము కాదని అభిప్రాయముతోనా? అయథార్థ జ్ఞానస్థలములో సామాన్య సామగ్రిని బట్టి అధికమైన దోషరూప కారణము ఉండుటచేత మాత్ర పదముచే వ్యావృత్తి ఎట్లు చేయబడినదో అట్లే యథార్థ జ్ఞానస్థలమందు సామాన్య సామగ్రినిబట్టి అధికమైన దోషాభావ కారణము ఉండుటచేత మాత్రపదముచేత అక్కడ వ్యావృత్తి చేయుబడుట లేదా లేక చేయబడుచున్నదా అని వికల్పము. అక్కడ మాత్రపదముచేత వ్యావృత్తి చేయుబడిన యెడల అపుడు ప్రామాణ్య లక్షణమునకు ఏ యుదాహరణమును ఉండదు. కాన అసంభవమే అగును. కనుక దోషాభావమునకు వ్యావృత్తిలేదను నభిప్రాయముతో అద్యపక్షోదయము. యథార్థ జ్ఞానమందు దోషాభావమునకు కారణత్వమెలేదు. కనుక దానికి వ్యావృత్తి ఉన్నను క్షితి లేదను నభిప్రాయముతో రెండవపక్షముయొక్క ఉదయము. పరిశీలింపగా అయథార్థ జ్ఞానము జ్ఞానసామగ్రీ జన్యమగును అయినను అధిక దోషము అక్కడ కారణమగుటచేత జ్ఞానసామాన్య సామగ్రీ మాత్ర జన్యముకాదు అను నభిప్రాయముతో మాత్ర పద ఘటితముగా పంచమ పక్షముయొక్క ఉదయము కలుగుచున్నది. ఏలయనఁగా, దోషాభావ సహకృతత్వము సిద్ధింపఁగా అన్యథా సిద్ధముగాని అన్వయ వ్యతిరేకములచే సిద్ధించుటచే దోషాభావము కారణమగుట వజ్రలేపమువలె స్థిరమగుచున్నది. గనుక దోషాభావము లేనపుడుకాదు. అనుమానిని బట్టి దోషాభావము కారణము దుర్నివారము, ఇంక అభావము కారణమె కాదన్నచో అపుడు అభావము అన్నదానికి కార్యత్వము ఉన్నదో లేదో చెప్పఁదగియున్నది. లేదందుమా అపుడు పటధ్వంసము అనుపపన్నము గాన పటము నిత్యము కావలసివచ్చును. పోనీ కార్యత్వము ఉన్నదందుమా అది కారణమైనందువల్ల వచ్చిన యపరాధమేమి కాన ఇది రెండు ప్రక్కల పాశములుగల త్రాడే యగుచున్నది.

అభావము నిస్స్వరూపముగాన సమవాయి కారణముకాదు. పోనీ కాకపోనీ బాధకములేదు గనుక నిమిత్తకారణమగును గదా. ఇట్లు అయిదు విధముల స్వతః ప్రమాణము చెప్పరానిదిగాన పరతః ప్రామాణ్యము ఇతరమగుదాని వల్ల తెలియబడుచున్నది. అనభ్యాసదశలో సాంశయికమగుటవల్ల అప్రామాణ్యమువల్ల పరిశీలించినపుడు జ్ఞానము సంశయగ్రస్తమగును. పరిశీలించిన తరువాత అనుభవపూర్వకముగా తెలిసికొన్న తర్వాత సంశయము పోవును. కాన ఇది అంగీకరింపదగినదే యగును. దీనినే ఉదయనుఁడు "సూ. భావమెట్లు కారణమో అభావముకూడ అట్లే కార్యమువలె కారణమగుట సమ్మతము (న్యాయ. కుసు. 1. 1. 10.) అనెను. అట్లును ప్రయోగము కలదు. విమతమైన ప్రామాణ్యము జ్ఞానహేతువు కంటె నిరతమైన హేతువు నకధీనమైనది. కార్యత్వము ఉండఁగా కార్య విశేషమును ఆశ్రయించిన దగుట వలన అప్రామాణ్యము వలె. కనుక జ్ఞానముయొక్క ఉత్పత్తిలోను తెలియజేసిన పిదప గలిగిన జ్ఞప్తిలోను ఇతరమైన దానివల్ల తత్త్వమునందు ప్రమాణము సంభవించుట వలన ప్రామాణ్యము స్వతః సిద్ధము అన్నది కుళ్ళు గుమ్మడికాయ వంటిదగుచున్నది అని అన్నచో ఇది ఆకాశమున ముష్టి ఘాతము చేయుట వంటిదే యగుచున్నది. ఏలయనఁగా విజ్ఞాన సామగ్రీ జన్యత్వము ఉండఁగా దానికంటె "ఇతరమైన హేతువుచే జన్యము కాకపోవుట ప్రమకు స్వతస్సిద్ధమగుచున్నది" అను నిరుక్తి సంభవమగు చున్నది గాన. జ్ఞానసామాన్య సామగ్రివల్లనే ప్రమా రూప జ్ఞాన విశేషము ఉత్పన్నమగుచున్నది. అందులో అధిక గుణముకాని దోషాభావముగాని హేతువుగాదు. దోషమైతే ప్రమకు ప్రతిబంధకమని మీ మాంసకమతము. ఇందు అనుమానము ప్రమాణముగానున్నది కూడ. విమతప్రమ విజ్ఞాన సామగ్రీ జన్యత్వము ఉండఁగా దానికన్న నిరతరమైన దానిచే జన్యము కాదు అప్రమాత్వానదికకారణమగుటవలన. ఘటాది ప్రమవలె. ఏకైక దేశముకూడ సాధకము గలదిగా నిశ్చమైనచో దృష్టాంతముగా ఉపాదేయమె యగును. ఉదయనుని యనుమానము పరతస్త్వ సాధకమని శంకింప రాదు. ఏలయన ప్రమదోష వ్యతిరిక్త జ్ఞానహేతువుకంటె నితరమైనదానిచే

జన్యముకాదు. జ్ఞానమగుటవల్ల అప్రమవలె అని ప్రతిసాధన రూపగ్రహ ముచే [సాధ్యాభావ సాధక హేత్వంతరముచే] సత్ప్రతిపక్షమను హేత్వాభాస. దానిచే సాధ్యాభావ సాధక హేత్వంతరము గ్రస్తమగుటవలన. జ్ఞాన సామగ్రీ మాత్రము వలననే ప్రమోత్పత్తి సంభవించునపుడు తదతిరిక్త గుణమునకుఁగాని దోషాభావమునకుఁ గాని కారణత్వమును కల్పించుటలో కల్పనా గౌరవము ప్రసక్తమగుటవలనను గూడ ఓయీ దోషము ప్రమకు హేతువు కాకపోవుటచేత దోషాభావము ప్రమను గురించి హేతువగుట దుర్నివారమగుచున్నది గదా. అన్నచో అట్లనరాదు. ఏలయనఁగా దోషాభావము ప్రమలో ప్రతిబంధకము గాకపోవుటద్వారా అన్యథా సిద్ధమగుట వలన. ఎట్లన ఘటమునుగూర్చి దండత్వము నియత పూర్వ వృత్తియైనను దండరూపము ఘటకారణముగా చెప్పఁబడదు. అది కారణము కానపుడు పూర్వనియత వృత్తిత్వ నియమమెట్లు అన్నచో దండము ఘటకారణముగా అభిమతము. కాన దండత్వ రూపములేకుండ ఉండుట అసంభవముగాన అది అన్యథాసిద్ధము. దానికి పూర్వవృత్తిత్వ నియతమైతే దోషము. అప్రమా హేతువగుటచే దోషము ఉండగా ప్రమోత్పత్తికాదు అని. ఎట్లన ప్రమా జ్ఞాన స్థలమందు నియత పూర్వవృత్తియైన దోషాభావముచే అప్రమా జ్ఞానమునకు ప్రతిబంధము చేయుబడినది. అనియేకాని దానికి ప్రమాజ్ఞానోత్పాదనోపయోగియైన వ్యాపారములేదు, అట్లుకాగా దోషాభావము ప్రమాజ్ఞానమునుగూర్చి కారణత్వముకాదు అని అన్యథా సిద్ధత్వమున్నది.

తస్మాద్గుణేభ్యో దోషాణా మభావస్తదభావతః
అప్రామాణ్య ద్వయాసత్త్వం తేనోత్సర్గోఽనయోదితః

'కనుక గుణములనుబట్టి దోషములుండవు, దోషాభావము వలన సంశయ విపర్యయములు సంభవింపకపోవుటచే అప్రామాణ్యద్వయము ఉండకపోవుట కలుగుచున్నది. అందుచే ఉత్సర్గము. నయముచేతనే స్వభావముగానే అపవాదాభావమందు ఉత్సర్గను ఉదయించుచున్నది అని. గుణమునకు గాని ప్రామాణ్యమునుగూర్చి హేతుత్వము అని అన్యులకు భ్రమగలుగుట ఏతన్మూలకమని భావము. అట్లు ప్రమాజ్ఞప్తికూడ జ్ఞాపకముచేయు సామగ్రి

వల్లనే పుట్టుచున్నది. అపుడు సంశయమె ఉదయింపదు అను ప్రసంగము బాధకమగుచున్నది అని చెప్పుట యుక్తముగాదు. ప్రతిభాసరూప పుష్కల కారణమున్నప్పటికిని ప్రతిబంధక దోషాది సమవధానమువల్ల అది [సంశయము] యుత్పన్న మగుచుండుట వలన కనుక ప్రామాణ్యజ్ఞానమును గూర్చి దోషాదులు ప్రతిబంధకములని భావము. మఱియును నీ యనుమాన ప్రమాణమును స్వతః ప్రమాణమా కాదా? మొదటి పక్షము అనైకాంతికము రెండవదానిలో దానికిని పరతః పామాణ్యమును దానికి పరతః ప్రామాణ్యము. ఇట్లుదాని కింకొకటి దానికింకొకటి అని అనవస్థ తప్పక యగును. కనుకను స్వతః ప్రామాణ్యమె స్వీకరింపఁదగినదని భావము. ఇక్కడ కుసుమాంజలిలో "శీఘ్రముగా ప్రచురప్రవృత్తి ప్రామాణ్య నిశ్చయాధీనముగాదు". ప్రవృత్తి ఇచ్ఛను అపేక్షించును. ప్రవృత్తి ప్రాచుర్యమనఁగా ఇచ్ఛా ప్రాచుర్యమె. ఇచ్ఛ అనఁగా ఇష్టమును సాధించుటలోని జ్ఞానము. అదియును ఇష్ట జాతీయత్వలింగానుభవము. అదియును ఇంద్రియార్థ సంనికర్షము. ప్రామాణ్య గ్రహణమైతే ఎక్కడను ఉపయోగింపదు' అని యేదైతే చెప్పఁబడెనో అదియును దొంగ ఎదుట వానిచంకలో బంగారమునుంచి మిగతా అన్ని అంగములను విప్పించి చూచుటవలె తోచుచున్నది. ఎందువల్లననఁగా సమీహితమును సాధించు జ్ఞానమే ప్రమాణముగా అవగమ్యమానమై ఇచ్ఛను పుట్టించుచున్నది. అను నీ విషయములో ప్రామాణ్య గ్రహణముయొక్క యుపయోగము స్ఫుటముగానే యున్నది.

మఱియును ఒకచోటనైనను నిర్విచికిత్సా [నిస్సంశయ] ప్రవృత్తి సంశయమువల్ల ఉత్పన్నమై యుండినచో అప్పుడు అన్నిచోట్ల అట్లగుట సంభవించుట వలన ప్రామాణ్య నిశ్చయము నిరర్థకమయిపోవును అట్లు నుచెప్పఁబడెను.— అనిశ్చితమైన దాని సత్త్వమె దుర్లభము అని. సత్త్వమె గనుక సులభమైనచో అపుడు ప్రామాణ్యమునకు నీళ్లువలు కొనుటయే యగును కాన ఇంక అతిగా ప్రపంచించిప నేమి. అందువలన అట్లు చెప్పఁబడినది.

తస్మాత్సద్బోధకత్వేన ప్రాప్తాబుద్ధేః ప్రమాణతా
అర్థాన్యథాత్వ హేతూత్థదోషజ్ఞానా దపోద్యతే ఇతి.

కనుక సత్తును బోధించుటద్వారా ప్రాప్తించిన బుద్ధి ప్రామాణ్యము, అర్థమును అన్యథా సిద్ధముచేయు హేతువు వలనఁ బుట్టుదోష జ్ఞానమువలన అపవాదము చేయబడుచున్నది.' అని.

కనుక ధర్మము స్వతః స్థిత ప్రమాణము భావమగుచుండఁగా, జ్యోతిష్టోమముచే స్వర్గము కోరువాడు యజింపవలయును.' ఈ మొదలైన యర్థవాద మంత్రములను పేరుగల వేదములో యజేత [యజింపవలెను] అనుచోట నున్న 'త' ప్రత్యయము ప్రకృత్యర్థోప రక్తమైన భావనను చెప్పుచున్నది'. అని సిద్ధమగుచుండఁగా వ్యుత్పత్తిని అంగీకరించుచు అభిహితాన్వయ వాదులు అభిధచే చెప్పఁబడిన వానికి ఆకాంక్షాదుల వల్ల అన్వయమగునను భట్టాచార్యుల సిద్ధాంతమిదియైనది.

యాగ విషయము నియోగము అని త ప్రత్యయము చెప్పుచున్నది అని కార్యములో వ్యుత్పత్తిని అనుసరించు అన్వితాభిదాన వాదులైన [అన్వయించిన యర్థమునె శబ్దము చెప్పునను] ప్రభాకర గురువుల సిద్ధాంతము. ఇది సర్వము నిర్దుష్టము.

ఇది

శ్రీ చర్ల వెంకమ్మ నారాయణ శాస్త్రుల తనయుడగు

చర్ల గణపతిచే అనువదింపబడిన

సాయణ మాధవీయములో సర్వదర్శన సంగ్రహములో

జైమిని దర్శనము.

———

## పాణిని

పాణిని కాలమునుగూర్చి మనముసరిగ చెప్పలేము. ఆధారములు లేవు కాని పాణిని వ్రాసిన పుస్తకములలోని సంగతులనుబట్టి ఊహించవనగును. ఈ పాణిని వ్యాకరణమునకు పతంజలి భాష్యము వ్రాసెను. ఆ పతంజలి యోగ సూత్రములకు వ్యాసుడు భాష్యము వ్రాసెను. మఱి ఆ భాష్యమును వ్రాసినవాడు భారతాది గ్రంథకర్తయ వ్యాసుడగునో కాదో చెప్పలేము. ఆ వ్యాసుడే ఈ సూత్రములకు భాష్యము వ్రాసెన్నచో వ్యాసుని కంటె పూర్వుడు పతంజలి అనియు ఆ పతంజలికి పూర్వుడు పాణినియని చెప్ప వలసియుండును. పాణిని అష్టాధ్యాయసూత్రములను పాణినీయశిక్ష మొదలగునవి వ్రాసినట్లు తెలియుచున్నది.

## పాణిని దర్శనము

సరే మఱి ఇది ప్రకృతి భాగము ఇది ప్రత్యయ భాగము అని ప్రకృతి ప్రత్యయ విభాగము ఎట్లు తెలియును అన్నచో పాతంజల జలము గ్రోలిన వారికి బోధింపదగిన యిది చమత్కారమును గలిగింపదు. వ్యాకరణ శాస్త్రము ప్రకృతి ప్రత్యయ విభాగము ప్రతిపాదించునను సంగతి ప్రసిద్ధమే గదా. అది యెట్లన

భగవంతుడైన మహాభాష్యకారుడు పతంజలి చెప్పిన మొదటి వాక్యము "మఱి యింక శబ్దానుశాసనము చెప్పబడును" అన్నది. దీని యర్థమిది.

[అథ] మఱి యను శబ్దము అధికారార్థమై ప్రయోగింపబడుచున్నది అధికారమనగా ప్రస్తావము, ప్రారంభమన్నమాట. శబ్దానుశాసనమనగా పాణిని రచించిన వ్యాకరణ శాస్త్రము. శబ్దానుశాసనమన్నది చెప్పగా శబ్దానుశాసనము ప్రస్తావింపబడుచున్నదా లేదా అన్నది సందేహము కలుగుచున్నది. అట్లు ప్రసక్తము కారాదని అథ= మఱి శబ్దమును ప్రయోగిం

చిన బలమునుబట్టి అర్థాంతమును నిషేధించుట ద్వారా ప్రస్తావింపఁబడు చున్నది అను నర్థము అభిధీయమాన మగుచున్నది. దీనిచే 'శంనోదేవీ రభీష్టయే' అను వైదిక శబ్దములును, వానికుపయోగించు గోవు అశ్వము హస్తి మొదలగునవియును శాసింపబడుచున్నవి. అనగా వ్యుత్పత్తిని జెప్పి సంస్కరింపఁబడుచున్నవి. ప్రకృతి ప్రత్యయ విభాగయుక్తముగా బోధింపఁబడుచున్నవి గాన శబ్దానుశాసనము అనఁబడును.

ఇట కొందఱిట్లు ఆక్షేపించుచున్నారు— అనుశాసనక్రియ సకర్మకము గాన కర్మయైన శబ్దముగాని కర్తయయిన ఆచార్యుడుగాని ప్రాప్తింపఁగా 'ఉభయకర్మణి' పా. సూ. 1. 3. 6.6.] అను శాసనమునుబట్టి కర్మకు షష్ఠి విధింపవలయును. అపుడు 'కర్మణిచ' [పా. 2. 2. 4. 8] అనుదానిని బట్టి శబ్దానుశాసనమనుదానికి సమాసము ప్రతిషేధింపబడుట వలన, శబ్దాను శాసన శబ్దము ప్రమాణము కానేరదు.

ఈ విషయములో ఈ సమాధానము చెప్పఁబడుచున్నవి– ఏకృత్ప్రత్యయములోనైతే కర్త కర్మలు రెండు ప్రాప్తించునో అపుడే కర్మయందే షష్ఠీ విభక్తి అగును. కర్మయందు మాత్రముగాదు అని బహువ్రీహి విజ్ఞాన బలముచేత నియమింపఁబడును. అదెట్లనఁగా, నేర్పులేని గోపాలునిచే గోవు లయొక్క దోహనము ఆశ్చర్యము అని. కర్తయందుఁగూడ షష్ఠి అగునని కొందఱు చెప్పుచున్నారు. కనుకనే కాశికావృత్తిలో కొందఱు సామాన్యము గానే 'ఆచార్యునిచే అనిగాని ఆచార్యునికి అనిగాని శబ్దముల అనుశాసనము అని విభాషగా ఇష్టపడుచున్నారు' అని. శబ్దానుశాసన మున్నచోట మాత్రము శబ్దములకు అనుశాసనము అర్థములకుకాదు అని మాత్రమే వివక్షింపఁబడిన యర్థము. కర్తయైన యాచార్యుని జెప్పక పోయినను సులభముగా దానిని ప్రతిపాదింపవచ్చును గాన ఆచార్యపద స్వీకారమునకు విశేషములేదు. కనుక ఉభయ ప్రాప్తిలేదు గాన' ఉభయప్రాప్తే కర్మణి' అను షష్ఠిరాదు కాని 'కర్తృ కర్మణోః కృతి [పాణి. సూ. 1. ?. 6. 5.] అను దానిచే

కృద్యోగములో కర్తయందు కర్మయందు షష్ఠీ విభక్తి అగునని గాన చెప్పుటచే కృద్యోగ లక్షణమైన షష్ఠి యగును. అట్లు ఇధ్మ ప్రవశ్చన, పలాశశాతనాదులవలె షష్ఠి తత్పురుష సమాసము కలుగును. లేక ఈ షష్ఠి శేషషష్ఠి అనవచ్చును. అందు ఏదియును చోదింపఁదగినది అవతరింపనే యవతరింపదు. సరే ఇట్లయినచో అన్నిచోట శేషషష్ఠియే సులభముగాచెప్పుకొనవచ్చును గాన షష్ఠీ సమాసము నిషేధించు సూత్రములు అనర్థకములగును గదా అన్నచో నిజమే. వానికి స్వరమునుగూర్చి విచారణలో దాని ఉపయోగము వాక్యపదీయములో భర్తృహరిచే చూపఁబడెను. అదే మహోపాధ్యాయ వర్ధమానుఁడు చెప్పెను.

లౌకిక వ్యవహారేషు యధేష్టం చేష్టతాంజనః
వైదికేషుతు మార్గేషు విశేషోక్తిః ప్రవర్తతాం.
ఇతి పాణిని సూత్రాణా మర్థవత్త్వ మసౌయతః
జనికర్తురితి బ్రూతే తత్ప్రయోజక ఇత్యపి

లౌకిక వ్యవహారములలో జనులు తను యిష్టమువచ్చినట్లు ప్రవర్తింతురుగాక, వైదిక మార్గములందు విశేషోక్తి ప్రవర్తించును. ఇట్లు చెప్పినచో పాణిని సూత్రములు అర్థవంతములగును. కనుక జనికర్త అన్నది జాయమానునికి హేతువు ఆ పాదకమగునన్నది ప్రయోజకమని కూడ చెప్పుచున్నాడు అని. కర్తను ప్రయోగింప జేయువాడు హేతుసంజ్ఞ కలవాడును, కర్తసంజ్ఞ కలవాడగును.

కనుక శబ్దానుశాసనమను మారుపేరుగల వ్యాకరణశాస్త్రము అరంభింపఁదగినదను వాక్యార్థము సంపన్నమగుచున్నది.

ఆ యర్థము త్వరగా తెలియుటకై 'అథ' మరి వ్యాకరణమని చెప్పఁబడుఁగాక' 'అథ శబ్దానుశాసనం' అని వ్యర్థముగా చెప్పఁబడుచున్నదే అన్నచో అట్లు అనరాదు. ఏలయన, శబ్దానుశాసనమని సార్థకనామమును చెప్పినపుడు దానికి వేదాంగత్వ ప్రతిపాదక ప్రయోజనము చెప్పుట సిద్ధించుచున్నదిగదా. అట్లు గానిచో ప్రయోజనము చెప్పఁబడనపుడు వ్యాకరణము చదువుటకు

పాఠకులకు ప్రవృత్తియే ప్రసక్తముగాదు గదా. నిష్కారణో ధర్మః షడంగో వేదోఽ ధ్యేతవ్యః నిష్కారణ ధర్మమైన షడంగ వేదము చదువఁదగినది' అను దానిచే చదువఁదగినదని విధించుట వలననే ప్రవృత్తి సిద్ధింపఁగలదన్నచో అట్లనరాదు. అట్లు విధానమున్నను అది వేదాంగమని తెలుపు ప్రయోజనము చెప్పనిచో వానికి ప్రవృత్తియె యుపపన్నముగాదు. అదెట్లన—పూర్వమందు వేదము అధ్యయనముచేసి అధ్యేతలు త్వరగా వక్తలగుచున్నారు.

లోకాన్నో వైదికాః శబ్దాః సిద్ధా లోకాచ్చ లౌకికాః

మనకు వేదము వలన వైదిక శబ్దములు లోకము వలన లౌకిక శబ్దములు సిద్ధించుచున్నవి.' కాన వ్యాకరణము నిరర్థకముఅని యఁందురుగాన వేదాంగమని తలఁచువారు దాని యధ్యయములో ప్రవర్తించిరి. కనుక ఇప్పటి వారికిఁగూడ అందు ప్రవృత్తి సిద్ధింపదు. కాన అట్లు ప్రసక్తము కాకపోవుగాక అని 'అది వేదాంగము' అని ప్రతిపాదించు ప్రయోజనము తగునట్లు చెప్పఁదగియే యున్నది.

ఒకవేళ తగునట్లు ప్రయోజనము చెప్పఁబడినను ప్రవర్తింపకపోయినచో అపుడు లౌకిక శబ్ద సంస్కారము లేనివారు యఁజ్ఞకర్మయందు ప్రత్యవాయమును పొందిన వారగుదురు. ధర్మము నుండి క్షీణులవుదురు. కనుకనే యాజ్ఞికులట్లు పఠింతురు "ఆహితాగ్ని అపశబ్దమును ప్రయోగించి ప్రాయశ్చిత్తపు సరస్వతీష్టిని ఆచరింపవలయునని." కనుక తదీయ వేదాంగత్వ ప్రతిపాదక ప్రయోజనమును జెప్పుటకై 'అథశబ్దానుశాసనము' అనియే చెప్పఁబడుచున్నది. కాని అథ వ్యాకరణం' అని చెప్పఁబడుటలేదు. శబ్ద సంస్కారము వ్యాకరణ శాస్త్రమునకు ప్రయోజనమగుచున్నది. ఆ వ్యాకరణశాస్త్ర శబ్ద సంస్కారమును గురించి ప్రవృత్తమగుచున్నది గదా. స్వర్గమును ఉద్దేశించి ప్రవర్తించిన యాగమునకు స్వర్గము ప్రయోజనమైనట్లే ఇదియును. కనుక శబ్దానుశాసనము సంస్కార పదముచేఁ దెలియఁ దగినదై శబ్దానుశాసనమునకు ప్రయోజనమగుచున్నది.

దానికి తగిన యుపాయము లేనందువల్ల ఇప్పుడునుగూడ ఇష్టమైన ప్రయోజనము లభించుటలేదు. మఱి దానికి ప్రతిపద పాఠమే ఉపాయమని

తలంతువేని అపుడు శబ్ద ప్రతిపత్తిలో ప్రతిపదపాఠము ఉపాయము కానే రదు. ఏలయన శబ్దాపశబ్ద భేదముచేత శబ్దములు అనంతముగాన. ఇట్లను భాష్యమునం జెప్పంబడుచున్నది. 'బృహస్పతి ఇంద్రునికి దేవవర్ష సహస్రము ప్రతిపద పాఠవిహితములైన శబ్దముల శబ్ద పారాయణమును చెప్పెను కాని అంతుతేలలేదు, బృహస్పతియో చెప్పువాండు. ఇంద్రుండు అధ్యయనము చేయువాండు. అధ్యయన కాలమో మఱి దేవవర్ష సహస్ర కాలముకాని అంతు చూడలేదు. ఇంక ఇప్పటి సంగతి చెప్పనదేమున్నది. ఒకవేళ ఎవ్వడైన జీవించినచో నూఱేండ్లు జీవించును. అధీతి బోధాచరణ ప్రచారములనెడి నాలుగు ఉపాయములచేత విద్య ఉపయుక్తమగును. అందు అధ్యయన కాలముతో ఆయువు గడచిపోవును. కనుక శబ్ద ప్రతిపత్తిలో ప్రతిపద పాఠము ఉపాయముకాదు గాన దాని ప్రయోజనము సిద్ధింపదు అన్నచో అట్లనరాదు శబ్దప్రతిపత్తి ప్రతిపద సాధ్యము అని యంగీకరించుటలేదు గదా. ప్రకృతి విభాగ కల్పన గల లక్ష్యములలో సామాన్య విశేష రూపలక్షణములు మేఘము వలె ఒకమారే ప్రవర్తించుటలో బహుశబ్దముల అనుశాసనము లబ్ధమగుచు న్నది. ఎట్లన 'కర్మణ్యణ్' ఇత్యాది సూత్రములచే కుంభకార కాండలావ ప్రభృతులైన యనేకశబ్దములు శాసింపంబడుచున్నట్లు లబ్ధమగుచున్నదిగదా. ఇట్లే అనుపసర్గేక ఇత్యాది సూత్రములచే ధాన్యాదుడు ధనదుడు శుభదుడు మొదలగువాని యనుశాసనము లబ్ధమగుచున్నదిగాదా. ఇంక బృహస్పతి ఇంద్రునికి చెప్పిన బృహస్పతి రింద్రాయ ఇత్యాదుల ప్రతిపద పాఠము అశక్య మని చెప్పుటయే యుద్దేశముగలదీ అర్థవాదము.

ఇంక ఇతరమైన యంగములుండంగా ఎందుకని ఇదియొకటే ఆదరింపంబడుచున్నది. అంటే షడంగములలో వ్యాకరము ప్రధానముగదా ప్రధానమైనదాని విషయములో చేయంబడి ప్రయత్నము ఫలించును. అదియు జెప్పంబడెను.

'ఆసన్నం' బ్రాహ్మణస్య తాపసానాముత్తమంతపః
ప్రథమం ఛందసాం మంగమాహుర్వ్యాకరణం బుధాః॥

ఆ వేదమంత్రమునకు ఆసన్నమై తపస్సులలో నుత్తమమైనదిగ వ్యాకరణ మును ఛందస్సులలో వేదములకు ప్రధానాంగమైన దానినిగా బుధులందురు.' అని

కనుక వ్యాకరణశాస్త్రము ఈ శబ్దానుశాసనమునుగూర్చి సాక్షాత్తు ప్రయోజన మగుచున్నది. వేదరక్షాదులు పరంపరగా ప్రయోజనములగుచు న్నవి. కనుకనే భాష్యకారునిచేత రక్ష ఊహ ఆగమ లఘు సందేహ నివారణ అనునవి ప్రయోజనములుగాఁ జెప్పఁబడినవి.' రక్షోహాగమ లఘ్వ సందేహాః 'ప్రయోజనం' అని చెప్పబడినది.

సాధు శబ్దమును ప్రయోగించుట వలన అభ్యుదయము కలుగును కాత్యాయనుఁచేకూడ' శాస్త్రపూర్వకమైన శబ్ద ప్రయోగములో అభ్యుదయము కలుగును అది వేదశబ్ద తుల్యము.' అని చెప్పఁబడెను. ఇతరులుకూడ ఒక శబ్దము చక్కగా తెలిసికొనబడి సాధువుగా ప్రయోగింపఁబడినదయి స్వర్గలోకమున కామమునిచ్చునదగును.' అనియునుజె ప్పిరి. అట్లే

నాకమిష్టసుఖం యాంతి సుయుక్తైర్బద్ధవాగ్రథైః

అథ పత్కాషిణో యాంతి యే చిక్కమిత భాషిణః

సుయుక్తములైన చక్కగా బద్ధములైన వాక్యరథములచేత ఇష్ట సుఖములు గల నాకమును పొందుదురు చిక్క మితభాషులు అనఁగా అవ్యక్త శబ్ద ములను మితముగా పలుకువారు పత్కాషులై పదా కషంతః కాళ్ళతో నేల కొట్టుచున్నవారై నరకమును పొందుదురు "అని

మఱి అచేతనమైన శబ్దమున కిటువంటి సామర్థ్య మెట్లుఉండును అన్నచో సాధుప్రయోగ శబ్దము దేవునితో సమమైనదని వినబడుట వలన' అట్లు అనరాదు. అట్లును శ్రుతి చెప్పుచున్నది—

'చత్వారి శృంగా త్రయో అస్యపాదా ద్వేశీర్షే
సప్త హస్తాసో అస్య త్రిధా బద్ధో రోరవీతి
మహోదేవో మర్త్యాంగంఆవివేశ. [మ. నా. 1, 0, 1.]

దీనినిట్లు భాష్యకారుఁడు వ్యాఖ్యానించెను.

నామ అఖ్యాతము ఉపసర్గము నిపాతము అను నాలుగు పదజాతములు నాలుగు కొమ్ములు. భూత భవిష్యద్వర్తమానకాలమును జెప్పులట్టు మొదలైనవి దీనికి మూఁడు పాదములు. నిత్యము కార్యము అయిన శబ్దములు క్రియావిభక్తులు వ్యంగ్య వ్యంజక భేదమువలన రెండుశీర్షములు. లతోఁగూడిన సప్తనామ విభక్తులు ఏడు చేతులు. ఉరస్సు కంఠము శిరస్సు అను మూఁడు స్థానములందు అది కట్టఁబడినది. వర్షించుట వలన వృషభము శ్రేష్ఠము అని వృషభముగా అది నిరూపింపఁబడినది. జ్ఞా పూర్వకమైన యను స్థానముచే ఫలములను ఇచ్చుటయె వర్షణమనఁగా. రోంవీతి అనఁగా శబ్దము చేయుచున్నది రౌతిక్రియ శబ్దకర్మము. ఇట శబ్దముచేత ప్రపంచము వివక్షితము. మహాదేవుఁడు మరణ ధర్మముగల మనుష్యులను ఆవేశించెను. అనుటచే మహాదేవునితో పరబ్రహ్మముతో సామ్యము చెప్పఁబడినదగును.

జగత్తులకు నిదానమైన స్ఫోటమను పేరుగల నిరవయువ నిత్యశబ్దము బ్రహ్మమని భర్తృహరిచే బ్రహ్మ కాండమునఁ జెపఁబడెను.

అనాది నిధనం బ్రహ్మ శబ్ద తత్త్వం తదక్షరం
వివర్తతేఽర్థ భావేన ప్రక్రియా జగతోయతః

[వాక్య పద. 1.1]

'ఏది యాద్యంతములు లేనిదో ఏది యక్షరరూపమైనదో ఏది ఘట పటాద్యర్థముగా మారుచున్నదో దేనివల్ల జగద్వ్యవహారము జరుగుచున్నదో ఆ శబ్ద తత్త్వమె బ్రహ్మము". అని.

ఇతర ప్రకారములుకూడ ప్రసిద్ధములుగ నున్నవి. కాన నామాఖ్యాత భేదముగా పదములు రెండుగానే 'ప్రతీతమగుటవలన పదములు నాలుగు విధములని ఎట్లు చెప్పఁబడెనని యనరాదు. అది యిట్లు ప్రకీర్ణమునఁ జెప్పబడినది.

పదజాతమును కొందఱచే రెండువిధములుగాను కొందఱచే నాలుగు విధములుగాను కొందఱు అయిదు విధములుగాను వాక్యములనుండి విడదీసి ప్రకృతి ప్రత్యయాదులు చెప్పఁబడెను. అని.

నామాఖ్యాతలని రెండుగా కొందఱిచేతను నామాఖ్యాతోపస ర్గనిపాతలు నాలుగని కొందఱిచేను క్తము. కర్మ ప్రవచనీయములను గలిపిన అయిదుగా న వాక్యములనుండి ప్రకృత ప్రత్యయాదులవలె విభజింపబిన్నమైనది. అయిదవదైన కర్మ ప్రవచనీయముచేత పదము అయిదు విధములని హేలారాజు వ్యాఖ్యానించెను. కర్మ ప్రవచనీయములైతే క్రియా విశేషములచే నుపజనితమైన సంబంధావచ్ఛేద హేతువులని సంబంధ విశేష ద్యోతనద్వారా క్రియా విశేషమును ద్యోతనచేయుట వలన ఆవి ఉపవర్గములందే అంతర్భవించునని తలఁచి పదములు నాలుగేయని భాష్యకారుఁడు చెప్పెనని వివేచింపవలయును. ప్రమాణము లేకపోవుటవలన "స్ఫోటమను పేరుగల నిత్య శబ్దముగల" దనుట యుక్తముగాదు. అని కొందఱు. ఈవిషయమై చెప్పఁబడుచున్నది.

ప్రత్యక్షమే ఇందు ప్రమాణము. అనేక వర్ణములకంటె అతిరిక్తమైన యొక పదము తెలియుబడుట సర్వజనీకమగుట వలన గోవు అన్నది ఒకపదము. బాధకము లేనపుడు పదానుభవము మిధ్య అని చెప్ప శక్యముగాదు. పదార్థ ప్రతీతి ఇంకొకరీతిగా గలుగుట అనుపపన్నమైనను స్ఫోటమును అంగీకరింప వలయును. వర్ణముల వల్లనే దాని జ్ఞానము కలుగుచున్నదని చెప్పుట పరీక్షకు క్షమమైనదికాదు. ఏలయనఁగా వికల్పమును సహింపక పోవుట వలన. వర్ణములు సమస్తములై యర్థజ్ఞానమును గలిగించుచున్నవా? లేక వ్యస్తములై గలిగించు చున్నవా? ఇందు మొదటి పక్షముసరికాదు. వర్ణములు క్షణికములుగాన వాని సమూహము అసంభముగాన. చివరి పక్షమును సరికాదు. వ్యస్త వర్ణములవలన అర్థ ప్రత్యయము అసంభవముగదా. వర్ణములు సమస్తములుగానో వ్యస్తములుగానో ఉండుటకంటె నింకొక విధముగా నుండుటలేదు గదా. కనుక వర్ణములకు వాచకత్వము ఉపపన్నము గాదు కాన ఇంకదేని బలమువల్ల అర్థప్రతీతి కలుగునో అది స్ఫోటము వర్ణము

లకంటె వ్యతిరిక్తమై వర్ణములచే అభివ్యంగ్యమై అర్థజ్ఞానమును గలిగించు నిత్యశబ్దము స్ఫోటమని దానిని తెలిసినవారు చెప్పెదురు. కనుకనే స్ఫుట్యతే [స్ఫుటము చేయఁబడుచున్నది]. వ్యజ్యతే వర్ణైః వర్ణములచేత వ్యక్తము చేయఁబడుచున్నది కనుక స్ఫోటము అవర్ణాభివ్యంగ్యమై దానివల్ల అర్థము స్ఫుటించుచున్నది స్ఫుటమగుచున్నది కాన స్ఫోటము అర్థప్రత్యాయకమని స్ఫోటశబ్దమును రెండు విధములుగా నిర్ణయించిరి. అట్లే భగవంతుఁడైన పతంజలిచే మహాభాష్యములోఁ జెప్పఁబడినది గోవు అన్నచో ఏశబ్దము ఏది పలుకఁబడఁగా గంగడోలు, తోక, మూపురము, కొమ్ములకు జ్ఞానము గలుగుచున్నదో అది శబ్దము [పాతం. మ. భా. పుట. 1. పం. 6.] అని కైయటుడు కూడ దీనిని వివరించెను.— వైయాకరణులు వర్ణవ్యతిరిక్తమైన పదమునకే వాచకత్వమును ఇష్టపడుచున్నారు. వర్ణములకు వాచకత్వ మంగీకరించినచో ద్వితీయాది వర్ణోచ్చారణ అనర్థకము కావలసిన వచ్చుదోషము ప్రసక్తమగుట మొదలుగా చెప్పుటచే తద్వ్యతిరిక్తమైన స్ఫోటము నాదాభివ్యంగ్యమై వాచకమగుచున్నదని వాక్యపదీయములో విస్తారముగా వ్యవస్థాపింపఁబడినది.

వికల్పములను సహించదు గాన, స్ఫోటము అర్థమును బోధించునన్నది కుదురదు. స్ఫోటము అభివ్యక్తమయి యర్థమును బోధించునా లేక అభివ్యక్తముగాక బోధించునా? చివరిది కుదుఁదు. ఎల్లపుడు అర్థము బోధించు లక్షణముగల కార్యమును ఉత్పత్తిచేయుట ప్రసక్తమగును గాన, స్ఫోటమని యంగీకరించుటచేత నిరపేక్షమైన హేతువు సదా యుండుటచేత కార్యము విలంబమగుట సంభవింపదు గనుక. మఱి ఈ దోషమును పరిహరించుటకై అభివ్యక్తమయిన స్ఫోటము అర్థమును బోధించునని కక్షగా జేసినచో అట్లుగూడ అభివ్యక్తముచేయు వర్ణములు తాము ప్రత్యేకముగా అభివ్యక్తము చేయునా కలిసిచేయునా? రెండు పక్షములలోఁగూడ 'వర్ణములు' వాచకములు' అను పక్షములో ఏయే దోషములు చెప్పఁబడినవో యవే స్ఫోటాభివ్యంజక పక్షమందు వ్యావర్తింపఁదగినవి. ఇదే మీమాంసా శ్లోక వార్తికములో భట్టాచార్యులచే నిట్లు చెప్పఁబడెను.

యస్యానవయవః స్ఫోటో వ్యజ్యతే వర్ణబుద్ధిభిః
సోఽపి పర్యనుయోగేన నైకేనాపి విముచ్యతే

"అవయవములులేని స్ఫోటము వర్ణబుద్ధులచే దేనికి వ్యక్తమగునో అదియును ఒక ప్రశ్నచేతఁగూడ విముక్తముగాదు" అని. విభక్త్యంత వర్ణములందె 'సుప్తిఙ్గంతం పదం [పా. సూ. 1. 4. 14.] అని పాణిని చేతను 'తే విభక్త్యంతాః పదం' [గౌ. సూ. 1. 2. 60.] అవి విభక్త్యంతములయి పదమనఁబడును అని గౌతముని చేత పదసంజ్ఞ విధింపఁబడుటవలన సంకేతమును గ్రహించుట వలన అనుగ్రహవశము వలన వర్ణములందే పదబుద్ధి కలుగును. అపుడు 'సర' అను పదమునందు ఎన్ని వర్ణములైతే ఉన్నవో అన్నే 'రస' అను దానిలోను ఉన్నవి. అట్లే వనము నవము, నదీ దీన, రాముడు మారుఁడు, రాజు జార ఇత్యాదులందు అర్థప్రతీతి కాకపోవును అన్నచో అట్లనరాదు. క్రమభేదమునుబట్టి అర్థభేదము సంభవించునుగాన. అది తౌతాతులచే నిట్లు చెప్పఁబడినది.

'యావంతో యాదృశా యేచ యదర్థప్రతిపాదనే
వర్ణాః ప్రజ్ఞాత సామర్థ్యాస్తే తథైవావ బోధకాః'

ఎన్ని ఎటువంటి పది వర్ణములు ఏ యర్థమును ప్రతిపాదించుటకై ప్రజ్ఞాత సామర్థ్యము గలవై యున్నవో అవి అట్లే యర్థ బోధకములగును. కనుక రెండిటికి సమమైన దోషములేదు అందుచేత ఒకటి చోద్యమగునను న్యాయము ను బట్టి వర్ణములు వాచకములగుట యుపపన్నమగుట కుదురుచుండఁగా ఇంకొక క్రొత్త స్ఫోటను కల్పింపఁబనిలేదు అన్నచో ఇది నదీ ప్రవాహముల్లో గొట్టుకొనిపోవువాడు రక్షణకై కాశకుశలములను అవలంబించుట వంటిది. ఏలయన, వికల్పములు ఉపపన్నములు గావు గనుక. వర్ణమైనదెల్ల పదజ్ఞానమున కాధారమగునా? వర్ణ సమూహమా? మొదటిదికాదు. దారము లేకుండ పువ్వులయందు మాలా జ్ఞానమువలే ఒకదానికంటె ఒకటి విలక్షణమైన వర్ణమాలయందు అభిన్నమైన ఇది నిమిత్తము, లేక ఒకపదము, అని ప్రతిపత్తి యుపపన్నముగాదు కనుక రెండవదియును గుదురదు ఉచ్చరింపఁబడి ప్రధ్వస్తములైనవర్ణములు సమూహముగా ఉండుట సంభవింపకపోవుటవలన పదార్థములు

ఏ ఒక ప్రదేశములో గలిసి యుండునో అవి ఆ బహుపదార్థములు సమూహమని అందులో వ్యవహరింపఁబడును. ఎట్లు ఒకే ప్రదేశమందుకూడ ఉండుట ద్వారా అనుభవింపఁబడుచున్న ధవ ఖదిర పలాశాదులందును గజ తురగాదులందును సమూహ వ్యవదేశము కలుగునో అట్లే ఇక్కడను ఉత్పన్నములై ప్రధ్వస్త ములగుట వలన మఱి ఆ వర్ణములు అట్లు అనుభవింపఁబడుటలేదే. అభివ్యక్తి పక్షములోఁగూడ సమూహము అసంభవముగా నక్రమముగానే అభివ్యక్తి కలుగును. పరస్పరాశ్రయ దోషము సంభవించును గాన, కాల్పనికమైన సమూహము కల్పింపరాదు. ఒకే యర్థమును బోధించుట అన్నది సిద్ధింపఁగా ఆ యుపాధిచే వర్ణములందు పదత్వ ప్రతీతి సిద్ధించును. కనుక వర్ణములకు వాచకత్వము సంభవింపదుగాన స్ఫోటమును అంగీకరింప వలయును.

ఇదివఱలోఁ జెప్పఁబడిన స్ఫోట వ్యంజకత్వ పక్షములోఁగూడ ఇదివఱకుఁ జెప్పఁబడిన వికల్పములు ప్రసరించుటచేత [ఘట్టకుటీ=రాజులు పన్నులు వసూలు చేయుచోటు. వర్తకుడు బండిలో పోవుచు పన్ను వసూలుచేయు కార్యాలయమును తప్పించుకొని రాత్రి దారి తప్పి అడవి యంత తిరిగి తెల్ల వారుసరికి మళ్ళీ ఆ పన్ను వసూలు చేయుచోటుకే వచ్చినట్లు] ఘట్టకుటీ ప్రభాతము వంటిదగును. అన్నచో ఇందు వైషమ్యము సంభవించుట వలన ఇది మనోరాజ్య విజృంభణమె యగును. ఎట్లనఁగా, అభివ్యంజకమైనను మొదటి ధ్వని స్ఫోటము స్ఫుటతరము స్ఫుటతమమునగును. ఎట్లు స్వాధ్యాయము ఒకసారి పఠింపఁబడి అవధరింపఁబడదో అభ్యాసము చేతనైతే, స్ఫుటమైనదమగునో, ఇట్లును రత్నతత్త్వము మొదట ప్రతీతమైనపుడు స్ఫుటముగా ప్రకాశింపదు చివర మవస్సులో సరిగా అభివ్యక్తమగును.

"నాదైరాహిత బీజాయా మంత్యేన ధ్వనినాసహ
ఆవృత్తి పరిపాకాయాం బుద్ధౌ శబ్దోఽవధార్యతే

[వాక్య పదీయ. 1. 85]

(నాదములచే స్థాపితమైన బీజమై అంత్య ధ్వనితోగూఁడ మాటిమాటికి మననము చేయు సంస్కారముచే పరిపాకమైన బుద్ధియందు శబ్దము అవధరింపఁబడు చున్నది.)

అని ప్రామాణికుల సూక్తి కనుక ఈ శబ్దము నుండి అర్థమును తెలిసికొనుచున్నాము అను వ్యవహార వశమువలన వర్ణములు అర్థవాచకములగుట యుపపన్నము గాదు గనుక. మొదటి కాండమున లో పూజ్యుడైన భర్తృహరిచేఁ జెప్పఁబడుటవలన నిరవయవమును అర్థబోధకమునగు స్ఫోటమను పేరు గలశబ్దతత్త్వము నంగీకరింపవలయును. ఇది యంతయు పరమార్థజ్ఞాన లక్షణముగల సత్తాజాతియే సర్వశబ్దములకు అర్థము అని ప్రతిపాదించుటయె తాత్పర్యముగాఁగల జాతి బోధకస్థలమందు ప్రతిపాదింపఁబడినది.

సత్తయే సర్వశబ్దములకు అర్థమే యయినచో సర్వశబ్దములు పర్యాయపదములు అయిపోవును గదా. అట్లుకాఁగా ఏ ఒకచోటఁగూడ ఒకసారిగా మూఁడు నాలుగు పదముల ప్రయోగము కుదరదు అన్నది ఆయుష్మంతుని మహాచాతుర్య మనవలయును. అది యిట్లు చెప్పఁబడినది—

పర్యాయాణాం ప్రయోగో హి యౌగపద్యేన నేష్యతే

పర్యాయేణైవ తే యస్మా ద్వదంత్యర్థం న సంహతాః

అవి యెందువల్ల పర్యాయముగానే అర్థమును చెప్పునుగాని కలిసిచెప్పవో అందువల్ల పర్యాయముల ప్రయోగము ఒక్కసారిగా చేయుట ఇష్టముగాదు." అని.

కనుక ఈ పక్షము విమర్శకు యోగ్యముగాదు అన్నచో నీలలోహిత పీతాదులు, గల ద్రవ్యమునుబట్టి స్ఫటికమణికి ఆయావర్ణములుకల్గి భేదములు కలిగినట్లు సంబంధిపద భేదమువలన సత్తకు తద్రూపముగా భేదము కలుగు జ్ఞానము సిద్ధించుచుండఁగా గోసత్తాదిరూప గోత్వాది భేద నిబంధకమైన వ్యవహారములో వైలక్షణ్యము ఉపపన్న మగుచున్నదిగాన ఇది యంతయు ఆకాశమున నెమరువేయుట వంటిది. ఇట్లును ఆప్తవాక్యము గలదు.

"స్ఫటికం విమలం ద్రవ్యం యథా యుక్తం పృథక్ పృథక్

నీలలోహిత పీతాద్యై స్తద్వర్ణ ముపలక్ష్యతే". ఇతి.

విమలమైన స్ఫటిక ద్రవ్యము నీలలోహిత పీతాదులనుబట్టి వేఱువేఱుగా నెట్లు కనిపించునో అట్లే వర్ణమును వేఱువేఱుగా ఉపలబ్ధమగుచున్నది." అని. అట్లు భర్తృహరిచేఁ గూడఁ జెప్పఁబడినది.

సంబంధిభేదా త్సత్తైవ భిద్యమానా గవాదిషు
జాతిరిత్యుచ్యతే తస్యాం సర్వే శబ్దా వ్యవస్థితాః
తాం ప్రాతిపదికార్థం చ ధాత్వర్థం చ ప్రచక్షతే
సానిత్యా సా మహానాత్మా తామహు స్త్వతలాదయః

'సంబంధి భేదమునుబట్టి సత్తయే గవాదులందు భిద్యమానమై జాతియని చెప్పఁబడుచున్నది. ఆ జాతియందు సర్వశబ్దములు వ్యవస్థితములు. దానినే ప్రాతిపదికార్థమని గాని ధాత్వర్థమనిగాని యనుచుందురు. అది నిత్యము. అది గొప్ప ఆత్మగలది: దానిని త్వ, త లోనగు ప్రత్యయములు గోత్వము, గోత ఇత్యాదికముగాఁ జెప్పును." అని.

అశ్రయములయిన సంబంధులచే భేదింపఁబడినదై కల్పించఁబడిన భేదములు గలదై గవాశ్వాదులందు సత్తయే మహామాన్యమైన జాతి. గోత్వాదికమైన యితర సామాన్యము పమార్థమునకు దానికంటె భిన్నమైనదిగాదు. గోసత్తయే గోత్వము ఇంకొక యన్యము ప్రతిభాసింపదు. ఇట్లే అశ్వసత్తయే అశ్వత్వమనఁగా అని యీ విధముగాఁ జెప్పఁకొనఁదగి యున్నది. ఇట్లు కాఁగా అగవాది భేదభిన్నమైన సత్తాజాతియందే గోశబ్దాదులన్నియు వాచకములుగా నున్నవి. ప్రాతిపదికార్థము సత్తయే. ధాతువు భావవచనము అను పక్షములో భావము అనఁగా సత్తయే ధాత్వర్థమగును. ధాతువు క్రియావచనము అను పక్షములోఁగూడ.

"జాతి మన్యే క్రియా మాహు రనేకవ్యక్తి వర్తినీం"

అనేకవ్యక్తులందున్న జాతినే యితరులు జాతి యందురు. అని క్రియాసముద్దేశములందు క్రియను జాతిగా ప్రతిపాదించుట వలన ధాత్వర్థము సత్తయె యగును." తస్య భావస్త్వతలౌ [పాణి. సూ. 5. 1. 11.] అను సూత్రముచే భావార్థమందు త్వతలాది ప్రత్యయములను విధించుట వలన సత్తావాచిత్వము యుక్తము. అసత్తయును ఉదయ వ్యయములు [ఉత్పత్తి నాశములు] లేనిదిగాన నిత్యము. సర్వ ప్రపంచమును అట్లు వివ

త్రమగుచుండుటచే [మారుచుండుటచే] దేశమునుబట్టి కాలమునుబట్టి వస్తువునుబట్టి పరిచ్ఛేదము లేకపోవుట వలన అసత్త గొప్ప యాత్మయని వ్యవహరింపఁ బడుచున్నది అని రెండు కారికలకు అర్థము. ద్రవ్యము పదార్థము అను పక్షములో జ్ఞానలక్షణమైన తత్త్వమే సర్వ శబ్దార్థము అని సంబంధ సముద్దేశములో సమర్థింపఁబడినది—

సత్యం వస్తు తదాకారై రసత్యై రవధార్యతే
అసత్యో పాధిభిః శబ్దైః సత్యమే వాభిధీయతే"

అధ్రువేణ నిమిత్తేన దేవదత్త గృహం యథా
గృహీతం గృహశబ్దేన శుద్ధమే వాభిధీయతే"

"సత్య వస్తువు అసత్యములైన ఆయా యాకారములచే నిర్ధారింపఁ బడుచున్నది. అసత్యమైన యుపాధులుగల శబ్దములచేత సత్యమె చెప్పఁబడుచున్నది. ఇది దేవదత్త గృహమన్నపుడు ధ్రువముగాని నిమిత్తముచేత గ్రహింపఁ బడినదై అది గృహము అని యెడిగృహశబ్దముచేత శుద్ధముగానే చెప్పఁబడుచున్నది." అని. చైత్రుడు మైత్రుడు వెళ్ళుచు ఇంటిమీద కాకియున్నది దేవదత్తుని దనియనుకొనిరి. పిదప స్థిరముగానుండని కాకినిబట్టి అది యెగిరిపోయినను ఆ కాకియున్న గృహము దేవదత్తునిది అని చెప్పబడినట్లు అసత్య వస్తువులచే సత్యవస్తువు చెప్పబడుచున్నది. భాష్యకారునిచేతఁగూడ "సిద్ధే శబ్దార్థ సంబంధే" అను వార్త్తికమును వ్యాఖ్యానించు సందర్భములో "ద్రవ్యము నిత్యము" అను గ్రంథముచేత ఉపాధులందున్న బ్రహ్మతత్త్వము ద్రవ్యశబ్ద వాచ్యమై సర్వశబ్దార్థ మగునని నిరూపింపఁబడినది.

జాతియున్నదే శబ్దార్థము అని చెప్పు వాజప్యాయనుని మతములో గవాది శబ్దములు భిన్న ద్రవ్యములందున్న జాతిని చెప్పును. అది తెలియఁబడఁగా దానినిబట్టి ఆ ద్రవ్యము తెలియఁబడును. శుక్లాది శబ్దములలో శుక్లాది గుణములతోఁ గూడిన జాతినిచెప్పును. గుణమునందు దాని సంబంధమునుబట్టి జ్ఞానమగును. ద్రవ్యమందున్న సంబంధి సంబంధమునుబట్టి అది సిద్ధించును. సంజ్ఞా శబ్దములు ఉత్పత్తి మొదలు వినాశము వఱకు. శైశవ కౌమార యౌవనా ద్యవస్థాదులనుబట్టి భేదమున్నను వాఁడే వీడు అదే యిది

అను అభిన్నజ్ఞాన బలమునుబట్టి సిద్ధించిన దేవదత్తాది జాతి అంగీకరింపవలె యును. క్రియలందును జాతి కనిపించుచున్నది. అదే ధాతువుగాఁ జెప్పఁ దగియున్నది. ఏలయనఁగా—

జ్ఞానము పొర్పిదుర్భవించు చున్నది గనుక. ద్రవ్యమువదార్థము అనివాదిండు వ్యాడియొక్క పక్షముతో శబ్దమునకు వ్యక్తియే అర్థముగా ప్రతిభాసించును. జాతియైతే యుపలక్షణముగా భాసించును గాన ఆనంత్యాది దోషావకాశము లేదు. పాణిన్యాచార్యునికి రెండును సమ్మతమే. ఇందువల్ల జాతిపదార్థ మును అంగీకరించి "జాత్యాఖ్యాయా మేకస్మిన్ బహువచన మన్యతరస్యాం. [పా. సూ. 1. 2. 58 ఇత్యాది వ్యవహారము కలిగినది ద్రవ్యపదార్థము నంగి కరించి సరూపములకు "ఏకశేష ఏక విభక్తౌ [పా. సూ. 1. 2. 64] ఈ మొదలగునదినదిగా రెండును సమ్మతమె. వ్యాకరణము సర్వులకు సమ్మతము గనుక. మతద్వయమును అంగీకరింపఁగా ఏదోషమునులేదు. కనుక అద్వయ మును సత్యమునునగు పరబ్రహ్మతత్త్వము సర్వపదార్థము అని నిలబడినది—

తస్మాచ్ఛక్తి విభాగేన సత్యః సర్వః సదాత్మకః।
ఏకోఽర్థః శబ్ద వాచ్యత్వే బహురూపః ప్రకాశతే ఇతి

కనుక శక్తి విభాగముచేత సర్వము సత్యమై సదాత్మకమై యుండును. ఒకే యర్థము శబ్దవాచ్యత్వమందు బహురూపమయి ప్రకాశించుచున్నది. అని.

భర్తృహరిచేకూడ సంబంధ సముద్దేశమందు సత్య స్వరూపము కూడఁ జెప్పఁబడినది.

"యత్ర ద్రష్టాచ దృశ్యంచ దర్శనం చావికల్పితం
తస్యైవార్థస్య సత్యత్వ మాహుస్త్రయ్యంత వేదినః"

ఎందు ద్రష్టయు దృశ్యమును దర్శనమును వికల్పింపలేమోఅదే ఆ యర్థము సత్యమని త్రయ్యంతవేదులు చెప్పిరి. అని.

ద్రవ్యసముద్దేశములోఁ గూడ—

"వికారాపగమే సత్యం సువర్ణం కుండలేయథా
వికారాపగమోయత్ర తామాహుః ప్రకృతిం పరాం"

'కుండలమందు వికారములుపోగా ఎట్లు సువర్ణము సత్యమైయున్నదో అట్లే

వికారములుపోగా ఏది మిగిలియుండునో అది వర్ణాప్రకృతి అని యందురు అంగీకరింపఁబడిన యద్వితీయత్వమును నిర్వహించుటకు వాచ్య వాచకము లకు అవిభాగము ప్రదర్శింపఁబడినది.

వాచ్యానాం సర్వశబ్దానాం శబ్దాచ్చ నపృథ క్తతః
అపృ థక్త్వేపి సంబంధ స్త యోర్జీవాత్మ నోరివ

సర్వశబ్దములకు వాచ్యమయినయది ఆశబ్దముకంటె వేఱుగాదు కనుక, అపృ థ క్త్వములోఁగూడ వానికి జీవాత్మలకువలె సంబంధముండును.

ఆయా యుపాధులచేత బహుళ భేదములు కలదగుటచేతను భిన్నవ్య వహారము అవిద్యామాత్రముచేత కల్పితమగుటచేతను ప్రతినియతమైన ఆకార మందు ఉంచఁబడిన రూపభేదముగల బ్రహ్మత త్త్వము సర్వశబ్దవిషయము. పారమార్థికమైన అభేదములోను సంవృతి వశమువలన వ్యవహారదశయందు స్వప్నావస్థవలె హెచ్చుతగ్గులయిన ప్రపంచము మార్పు చెందుచున్నదని కారికార్థము. దానినే వేదాంత నిపుణులిట్లుచెప్పిరి.

యథా స్వప్న ప్రపంచోఽయం మయి మాయా విజృంభితః
ఏవం జాగ్రత్ప్రపంచోపి మయి మాయావిజృంభితః

ఈ స్వప్న ప్రపంచమంతయు ఎట్లు నాయందు మాయచే విజృంభిం యున్నదో అట్లే జాగ్రత్ప్రపంచముకూడ మాయచే విజృంభింపబడియున్నది

కనుక ఇట్లు కూటస్థమైన సచ్చిదానంద రూపమైన పరబహ్మయందు ప్రత్య గభిన్నత్వము అవగతముకాఁగా అన్యాద్యవిద్యా నివృ త్తి కలుగఁగా అట్టి బ్రహ్మాత్మగా ఉండుట యనులక్షణముగల నిశ్శ్రేయసము సిద్ధించును. "శబ్దబ్రహ్మణి నిష్ణాతః పరబ్రహ్మాధి గచ్ఛతి, శబ్దబ్రహ్మయందు నిష్ణాతుడైన వాడు పరబ్రహ్మమును పొందును." అని యభియు క్తుల వాక్యముగదా. అట్లును శబ్దానుశాసన శాస్త్రము నిశ్శ్రేయససాధన మనుట సిద్ధించినది. అది యిట్లుచెప్పబడెను—

తద్ద్వార మపవర్గస్య వాఙ్మలానాం చికిత్సితమ్
పవిత్రం సర్వ విద్యానామధివిద్యం ప్రచక్షతే

అది (ఆ వ్యాకరణము) స్వర్గమునకు ద్వారము. వాఙ్మాలిన్యములకు అది మందు, సర్వవిద్యలలో పవిత్రమైనది. విద్యలలో గొప్పదని అందురు. ఎట్లన

"ఇదమాద్యం పదస్థానం సిద్ధిసోపాన పర్వణాం
ఇయ్యంసా మోక్షమాణానా మజిహ్మా రాజ పద్ధతిః"

(వాక్య. పదీయ. 1. 16.)

ఇది మొదటి పదస్థానము. సిద్ధికి [కైవల్యమునకు] సోపానపు మెట్లవలెను స్థానమైనది. ఇది మోక్షము కోరువారికి వక్రముగాని ఋజువైనరాజమార్గ పద్ధతిగానున్నది కనుక వ్యాకరణశాస్త్రము ప్రథమ పురుషార్థ సాధనముగా అధ్యయనము చేయఁదగినదిఅని సిద్ధించినది.

ఇది

శ్రీ చర్ల వేంకమ్మ నారాయణ శాస్త్రుల తనయుడగు

గణపతిశాస్త్రిచే అనువదింపబడిన

సాయణ మాధవీయమందు పాణినిదర్శనము